# నైలు నుంచి కృష్ణ దాకా...

## తెలుగుతో పెనవేసుకున్న భాషాబంధాలు, అధ్యయనాంశాలు

'భాషాభిమాని'

డా॥ జి.వి.పూర్ణచంద్, బి.ఎ.ఎం.ఎస్.




ద్రావిడ విశ్వవిద్యాలయం

శ్రీనివాసవనం, కుప్పం-517 425, ఆంధ్రప్రదేశ్



# Nilu Nunchi Krishna Daaka...

(a collection of essays on the antiquity of Telugu and its people)


*Written by*

**Dr. G.V. Purnachand,** B.A.M.S.

Satnam Towers, Opp Buckinghampet post office

Governorpeta, Vijayawada - 520 002

Phones 0866 (O) 2577373 (R) 2483677

Cell : 94401 72642





Publication No.87

Price:100/-

*Type Setting*

Nadustunna Charithra

*Published by*

**Prasaranga,** Dravidian University

*For Copies*

**The Registrar**

Dravidian University

Srinivasavanam, Kuppam - 517 425

Ph.08570-278220

*Printed at*

**Sri Sri Printers**

Vijayawada - 520 002

cell : 9490634849

ఆచార్య గంగిశెట్టి లక్ష్మీనారాయణ
ఉపాధ్యక్షులు



ద్రావిడ విశ్వవిద్యాలయం
శ్రీనివాసవనం, కుప్పం–517 425

# పీఠిక

భారతీయ సంస్కృతి పునాది ద్రావిడ సంస్కృతిలో ఉంది. ద్రావిడ సంస్కృతికి కొంత పూర్వం లేక సమకాలికమైన సమస్త ప్రాచీన సంస్కృతులు అంతరించాయి. కాని మౌలిక ద్రావిడ స్పర్శ అంతరించలేదు. దేశభాషలలో మార్పులు వచ్చాయి. కాని ద్రావిడ సంస్కృతి మౌలిక భావ తత్త్వంలో పెద్దగా మార్పులు రాలేదు. దీని గురించి తగినంత పరిశోధన జరుగలేదు. భారతీయ సంస్కృతికి సంబంధించిన శాస్త్ర, సాంకేతిక, విజ్ఞాన, తాత్త్విక, సాహిత్య రంగాలలో ద్రావిడ సంస్కృతి మూల ముద్ర ఇప్పటికీ పదిలంగా ఉంది. దీనికి సజీవ దాఖలా 27 పైగా ఉన్న భాషలతో కూడిన ద్రావిడ కుటుంబంలోని అనేక ఆదిమ తెగల నాగరికతలో సజీవంగా నిక్షిప్తమై అగుపిస్తుంది. వాటి గురించి ఒక్క భాషా దృష్టితో తప్ప మరే ఇతర దృష్టితోను ఆధునిక ప్రపంచానికి పరిచయం కలిగించలేదు. అతి ప్రాచీనమైన, సుసంపన్నమైన ద్రావిడ భాషా సంస్కృతుల అభివృద్ధికి ప్రత్యేకంగా నెలకొల్పినదే ద్రావిడ విశ్వవిద్యాలయం. ద్రావిడ భాషీయుల మధ్య తగిన భావ సమైక్యత వికాసానికి ఉద్దేశించిన ప్రత్యేక సంస్థ ఇది.

భావ సమైక్యతా వికాసదిశలో విశ్వవిద్యాలయం చేపట్టిన అనేక ముఖ్య కార్యక్రమాలలో ప్రధానమైనది ప్రచురణ, అనువాద కార్యక్రమాలు. ప్రతి భాషలోని ప్రముఖమైన రచనలన్నింటిని ప్రత్యేకంగా వెలువరించటంతోపాటు వాటిని ఇతర భాషీయులకు అనువాద రూపేణ పరిచయం చేయటానికి ఈ విశ్వవిద్యాలయం బృహత్ప్రణాళికను ప్రారంభించింది. అందులో భాగంగా అనుసృజన (ట్రాన్స్‌లేషన్ బ్యూరో), ప్రసారాంగ (ప్రచురణ మరియు విస్తరణసేవల విభాగం) లను ప్రారంభించింది. ప్రచురణ అనువాద కార్యక్రమాలు పెద్ద ఎత్తున మొదలుపెట్టటమే కాకుండ అనువాదంలో ప్రత్యేక శిక్షణ ఇవ్వటంతోపాటు ప్రతి విభాగాన్ని భాష–అనువాద విభాగంగ నెలకొల్పింది.

***

ద్రావిడుల మూలాల గురించి వివిధ వాదోపవాదాలు, దృక్పథాలు ఉన్నాయి. ఆస్ట్రేలియా, మెటానీ, ఆఫ్రికా, ఆస్ట్రోలైట్, నీగ్రాయిడ్, సుడానీస్, సుమేరియన్, ఫిన్నో ఊగ్రిక్, జపానీస్, వగైరా జాతులతో సంబంధాన్ని కలిపి అనేక ఊహాసిద్ధాంతాలు వచ్చాయి. ద్రావిడులు ఈ దేశానికే సంబంధించిన స్వదేశీయులా లేక విదేశాల నుంచి వలసవచ్చిన వారా అన్నది పెద్ద ప్రశ్నగా మిగిలింది. పైన పేర్కొన్న వివిధ జాతుల సంబంధంతో ఎన్ని ఊహా సిద్ధాంతాలు వెలువడ్డా అవి కేవలం ఊహాగానాలు గానే మిగిలాయి గాని, స్పష్టమైన నిర్ధారణలకు అవకాశం ఇవ్వలేదు. అందుచేతే ఆచార్య భద్రిరాజు కృష్ణమూర్తిగారు (2003) “ఉన్నంతలో ద్రావిడులు ఈ దేశానికి చెందిన వారనే భావించటం ఉత్తమం. క్రీ.పూ. 1500 ప్రాంతంలో ఆర్యులు ప్రవేశించేనాటికి వీరు దేశమంతా విస్తరించి ఉన్నారని భావించడం సమంజసం” అని పేర్కొన్నారు. అంతకు మునుపు Heine-Geldern (1964) Pinnow (1954) వంటి విద్వాంసులు ద్రావిడులు దక్షిణ ఆసియాలోకి క్రీ.పూ. 1వ సహస్రాబ్ది నాటికే ప్రవేశించి బెలూచిస్తాన్, సింధు, గుజరాత్‌ల మీదుగా దక్షిణ భారతంలోకి చేరారని భావించారు. ఇప్పటికీ వారి ప్రయాణమార్గపు గుర్తులు సింధూ, గుజరాత్, మహారాష్ట్రలలోని కొన్ని స్థల నామాల ద్వారా గుర్తుపట్టవచ్చని Zvelebil (1970, 1990) వంటివారు భావిస్తారు. Southworth, McAlpin ప్రభృతులు, పాక్షిక సంచార జీవనులైన ద్రావిడులు, కొంత ఆలస్యంగా దక్షిణాసియాలోకి వచ్చారని, కాని సింధు నాగరికత నిర్మాణంలో భాగస్వామ్యం పొందేటంత పూర్వమే ఉన్నారని, అక్కడినుండే వ్యవసాయాన్ని, తదనుబంధ పదజాలాన్ని పొందారని పేర్కొన్నారు. పాత రాతియుగం నాటి మెడిటరేనియన్ వలసదారులు కొత్త రాతియుగం నాటికి భారతదేశం చేరి వారితో పాటు వ్యవసాయ వృత్తిని, ద్రావిడ భాషల్ని తెచ్చారని Bhasham (1979) భావిస్తున్నారు. మొదటగా సింధు తీరం చేరి, హరప్పా నాగరకులతో కలిసిపోయో, లేదా తామే హరప్పా నాగరికత నిర్మాతలయ్యో, ఆ తర్వాత సరస్వతీ నాగరకత జీర్ణించి, అక్కడివారు సింధుకేసి వచ్చాక, ఎక్కువ మంది దక్షిణానికి వలసవచ్చారని, ముందుగా తెలుగుపూర్వులు వచ్చారని, ఆ తర్వాత మహాభారత సంగ్రామానంతరం మధ్య భారతం నుంచి తమిళ వర్గ పూర్వులు వచ్చారని భావించడానికి ఎక్కువ అవకాశముంది.

Rasmus Rask లాంటివాళ్లు ద్రావిడ భాషలు ఆసియా, యూరప్ ఉత్తర భాగాల్లోని ఆటవిక సిథియన్ జాతి సంబంధాలుగా భావిస్తే, తద్వారా ఫిన్నో-ఉగ్రిష్ కుటుంబానికి చెందిన వారు కావచ్చని Caldwell (1956) లాంటివారు ఊహిస్తే, ఊరల్ ఆల్టాయిక్ తో పదశాస్త్ర సంబంధంగా ఎక్కువ పోలికలగుపడుతున్నాయని Zvelebil (1990) వంటివారు భావిస్తే, ఈలమైట్ సంబంధంకావచ్చని ఈలమైట్-ద్రావిడ పదాల మధ్య అనేక సాదృశ్యాలు, సమాంతరాలు అగుపిస్తున్నాయని, Mc Alpin (1981), Vaclav Blazek (2001) వంటివారు వివరించారు. ఈ సందర్భంగా బ్లేజెక్ ఇచ్చిన పటం గుర్తించతగింది.




అయితే భద్రిరాజు, జ్వెలెబిల్ వంటి ప్రముఖులు ద్రావిడ-ఈలమైట్ జన్య సంబంధాల మీద కృషి చేసే పరిశోధకుల నుంచి మరింత స్పష్టమైన, అంగీకార యోగ్యమైన భాషాశాస్త్ర సంబంధ ఉపపత్తులను ఆకాంక్షిస్తున్నారు.

ద్రావిడ-ఆఫ్రికన్, ద్రావిడ-ఊరలిక్ సంబంధాలమీద లభ్యమయ్యే సాక్ష్యాలన్నిటినీ అత్యంత ప్రతిభావంతంగా సమీక్షించాడు Bernard Sergent (http.) సూడన్ నుంచి సెనెగల్ దాకా, సాహెల్ ప్రాంతమంతా మాట్లాడే ఆఫ్రికన్ భాషల్లో, ద్రావిడ భాషల్లో ఉండే అనేక వ్యాకరణాత్మక, అర్థ సంబంధమైన అంశాలు అగుపిస్తున్నాయనీ, ఫిన్నిష్, హంగేరియన్ వంటి ఊరలిక్ భాషల్లో కూడా ఈ పోలికలున్నాయనీ, సుమారు 10000 సంవత్సరాల పూర్వం వ్యవసాయ సంస్కృతిని ప్రారంభించిన కొత్తరాతి

విప్లవం మొదట్లో, ద్రావిడులనబడేవారు సూడన్‌ను వదిలిపెట్టి ఉంటారనీ, అందులో ఇరాన్ వద్ద చీలిన ఓ గుంపు ఊరల్‌లకు ఉత్తరంవైపు వెళ్లగా, మరో గుంపు భారతంలోకి అడుగుమోపి దక్షిణంవైపు కదిలారని సార్జంట్ ఊహిస్తున్నారు. చాలామంది లాగే సార్జెంట్ కూడా, తొలి ద్రావిడులను క్రీ.పూ.2500 నుంచి 1600 దాకా వున్న "దక్షిణ కొత్తరాతి" సంస్కృతికి చెందినవారితో సరిపోల్చవచ్చన్నాడు. కర్రతోచేసిన వాళ్ల గుండ్రటి గుడిసెలు, గ్రామీణ ద్రావిడ నివాసాలతో నేరుగా సరిపోలుతున్నాయని పేర్కొంటాడు. దక్షిణ కొత్తరాతి యుగం తవ్వకాలలో రెండు విభిన్న రకాల హైందవ పాత్రలు బయటపడ్డాయని వివరించాడు. ద్రావిడులు సింధు, గుజరాతుల్లో అగుపించే హరప్పా ప్రజకంటె పూర్వ ప్రజలు కావచ్చుని, వారు తమపై దండెత్తిన ఆర్యులతో కంటె, తమకంటె సమున్నతంగా ఎదిగిన హరప్పా ప్రజతో విలీనమయ్యారని సార్జెంట్ భావిస్తున్నారు. ఉత్తర ఆఫ్రికాలోని ఆఫ్రో-ఏషియాటిక్ కుటుంబాన్ని, దక్షిణ ఆఫ్రికాలోని ఖొయి-సాక్, కొరామా భాషలను మినహాయిస్తే, మిగిలిన యావత్తు మెలనో - ఆఫ్రికన్ ఉపరికుటుంబంతో, ద్రావిడ భాషలకు సంబంధముందని సార్జెంట్ నిశ్చితంగా పేర్కొంటున్నాడు. ఇతర భాషలతో పోలిస్తే, ద్రావిడం, మెలనో ఆఫ్రికన్ భాషలు ఒక జంటగా నిలుస్తున్నాయంటూ, "The tendency to agglutination, the absence of grammatical gender, the absence of internal vowel change, the use of pre-or post position instead of inflection are some of the main traits which set the Negro-African and Dravidian languages jointly apart from the Indo-European and Hemito-Semitic groups".

ఇంతకంటె మరింత స్పష్టమైన పోలికలను ఎత్తిచూపుతాడు.

"A simple system of five basic vowels with an opposition short/long, vocalic harmony, absence of constant clusters in initial position, abundance of geminated consonants, distinction between inclusive and exclusive pronoun in the first person plural, absence of the comparative degree in adjectives, absence of adjectives and adverbs acting as distinct morphological categories, alternation of consonants or augmentation of nouns noted among the nouns of different classes, distinction between accomplished and unaccomplished action in the verbal paradigms as opposed to the distinction of time-specific tenses, separate sets of

paradigms for the affirmative and negative forms of verbs, the use of reduplicated forms for the emphatic mode etc.''

ఇలా మరెన్నో ఉపపత్తులు చూపుతాడు.

ఈ భాషా శాస్త్రీయ సాక్ష్యాలు ద్రావిడ భాషలు - కొన్ని ఆఫ్రికన్ భాషలు ఒకే కుదురుకు సంబంధించినవనే భావనను బలంగా ప్రతిష్ఠాపిస్తాయి. రెండింటిమధ్య దూరాన్ని బట్టి చూస్తే అవి ఆదాన ప్రభావాలు కావడానికి వీల్లేదు. ఏదేమైనా ప్రొటో-ద్రావిడం; నీగ్రో-ఆఫ్రికన్ భాషల పూర్వీకపు భాషకు భౌగోళికంగానైనా చాలా దగ్గరగా ఉండాలి.

కాలక్రమంలో మార్పులు ఎన్నయినా వచ్చివుండవచ్చు. వేర్ల అనుబంధం మాత్రం అలాగే ఏదో ఓ రూపంలో అగుపిస్తూనే ఉంటుంది. భాష పరంగానే కాదు, సంస్కృతి పరంగా కూడా ఎన్నో సాదృశ్యాలు. అన్నట్లు తెలుగు వారికి, తెలుగు వారికన్నమాటేమిటి, ద్రావిడులందరికీ అతి అలవాటయిన వంకాయ, కాకరకాయ, బెండకాయ, దొండకాయ ఇలాటి కాయలన్నీ ఆఫ్రికాలోనే మొదట పుట్టింది, ఆఫ్రికా సంస్కృతి ప్రదానాలకు గుర్తులే.... మన 'పాత' సంస్కృతి విశేషాలలో ఆఫ్రికా సంస్కృతి సాదృశ్యాలు ఎన్నో ఉన్నాయి. నృశాస్త్రపరంగా ద్రావిడులందరూ, నీగ్రోయిడ్‌లుగానే వింగడింపబడుతున్నారు మరి.

ద్రావిడ విశ్వవిద్యాలయంలో ఆఫ్రోలింగ్విస్టిక్స్‌కు ఒక ప్రత్యేక పీఠం ఏర్పాటు చేయమని, మైసూరు విశ్వవిద్యాలయం పూర్వ ఉపకులపతి, కన్నడ భీష్మ, నాడోజ ఆచార్య జవరేగౌడగారు రెండేళ్లక్రితం పేర్కొన్నారు. తాను ఆఫ్రికాసందర్శన సమయంలో గుర్తించిన అనేక సాదృశ్యాల గురించి పేర్కొంటూ, ఓ 30 సాదృశ్య పదాలను వివరిస్తూ తాను వ్రాసిన వ్యాసం గురించి ప్రస్తావించారు. తనకు అలాటి పీఠాన్ని ప్రారంభించే సమయం అప్పట్లో లేకపోయిందని, ఇప్పటికైనా నన్నాపని చేయమని సూచించారు. నాకూ సాధ్యంకాలేకపోయింది కాని, ఇదిగో మిత్రులు డా. పూర్ణచంద్‌గారి వ్యాసావళి 'నైలునుంచి కృష్ణదాకా' ప్రచురణతో ఆ ముచ్చట కొద్దిగానైనా తీర్చుకోగలుగుతున్నాను.

భాషాశాస్త్ర పరంగా చూసినప్పుడు ఈ వ్యాసాలు శాస్త్రీయం కాకపోవచ్చు.

ఇవి కేవలం ఒక భాషాభిమాని, ఔత్సాహికుని సృజనాత్మక విశ్లేషణలేకావచ్చు. నిజమే. ఇవి భాషాశాస్త్ర వ్యాసాలు కావు, భాషాభిమాని వ్యాసాలే. అయితే ఇవి ఆలోచింప చేస్తున్నాయి. ఆశ్చర్య చకితులను చేసి, ఓ క్షణం అలాగే ఆపివేసి, మనలో కొత్త ఆలోచనలను, కాదంటే ప్రశ్నలను లేవనెత్తుతున్నాయి. తెలుగు పేరిట బ్రతుకుతున్న వారం, తెలుగు గురించి ఏదీ కొత్తగా చెప్పలేక పెద్దలు చెప్పిందే కేవలం తిరగ చెప్పుతూపోతున్న రోజుల్లో, కాలక్షేపానికైనా తెలుగుకేసి కాస్సేపు నిక్షేపంగా చూడమని, ద్రావిడ మూలాలను కాస్త ఆలోచించమని, మన పాతదనం చరిత్ర ఎంత లోతయిందో గుర్తించమని హెచ్చరిస్తున్నాయి.

చరిత్రను గుర్తించకుండా చరిత్రను నిర్మించలేము. తెలుగుకు సంబంధించి ఇవ్వాళ ఓ కొత్త ఉద్యమ చరిత్ర ప్రారంభమైంది. భాషోద్యమం ఓ కొత్త ఊపందుకొంది భాషోద్యమ మంటే, జాతి ఉద్యమమే, భాషా గౌరవమంటే జాతిగౌరవమే. భాష-జాతి-సంస్కృతి వేరు వేరు కావు. ఒక జాతికి అభివ్యక్తిరూపాలే భాషా, సంస్కృతులు. ఆ రెంటి సమ్మేళన రూపమే జాతి. ఒకప్పుడు భాషోద్యమం, జాతీయోద్యమంలో భాగం, ఇవ్వాళ జాతి గౌరవోద్యమంలో భాగం.

అలా జాతి గౌరవోద్యమం మొదలైన దశలో, ఆ జాతి పురాతనత తవ్వుకొంటూపోతే ఎంతలోతయిందో తెలియచేసేవి ఇలాటి భాషాభిమాన రచనలే. ఇవి శాస్త్రీయమైన ఆవిష్కరణలకు బలమైన ఉపకరణాలు.

ఆ నేపథ్యంలో ఈ పుస్తకాన్ని తెలుగుజాతి మనస్ఫూర్తిగా ఆదరిస్తుందని విశ్వసిస్తున్నాను.

**గంగిశెట్టి లక్ష్మీనారాయణ**

**మండలి బుద్ధ ప్రసాద్**
రాష్ట్ర పశుసంవర్ధక, పాడి పరిశ్రమ అభివృద్ధి,
పశు విశ్వవిద్యాలయము మరియు
మత్స్య శాఖామాత్యులు
ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం.



ఆంధ్రప్రదేశ్ సచివాలయం
హైదరాబాద్
ఆం.ప్ర. ఇండియా
సెల్.98480 41767
తేది.09.06.2008

# జాతి మూలాలలో కొత్త కోణాలు

తెలుగువారు ఎప్పటివారు? ఎక్కడివారు? తలచుకుంటేనే ఒళ్ళు పులకరిస్తోంది. "నైలూ నుంచి కృష్ణ దాకా..." గ్రంథంలో నా జాతి మూలాలు ఎక్కడెక్కడో విస్తరిల్లాయని తెలుసుకొని రోమరోమం పులకితమైంది!

ఇంతటి మహత్తరమైన చరిత్రను వెలికితీసే ప్రయత్నం డా॥జి.వి.పూర్ణచంద్ చేయడం అభినందనీయం.

డా॥ పూర్ణచంద్ అలుపెరుగని అన్వేషకుడు. తెలుగుభాష ప్రాచీనతని, సంపన్నతని లోకానికి చాటిచెప్పడం కోసం అంకితమై కృషిచేస్తున్న పరిశోధకుడు. ఆయన ప్రతిపాదనలతో ఏకీభవించలేని వారుండవచ్చు. అందరూ ఏకీభవించాలని ఎక్కడా లేదుకదా! అయితే, ~~ఈ~~ పుస్తకంతో అలా విభేదించే వారెవరైనా వుంటే, వారిని నేను కోరేది ఒక్కటే... "మీరు కూడా జాతి మూలాలకు సంబంధించి కొత్త కోణాలను ఆవిష్కరించే ప్రయత్నం చేయండి" అని!

కొమర్రాజు లక్ష్మణరావు, మల్లంపల్లి సోమశేఖరశర్మ, వేటూరి ప్రభాకరశాస్త్రి, సురవరం ప్రతాపరెడ్డి వంటి పండిత పరిశోధకులు మన తెలుగుజాతి చరిత్రను తవ్వి తట్టలకెత్తే ప్రయత్నం చేశారు. కానీ, వారి పరిశోధనాంశాలలో చాలా ముఖ్యమైన వాటిపైన ఆ తరువాతికాలంలో పరిశోధనలు కొనసాగించడంలో మనం

దృష్టిపెట్టి పనిచేయలేదనేది వాస్తవం. ఇన్నాళ్లకు మరలా ఆ కృషి పట్టుదల డా॥ జి.వి.పూర్ణచంద్‌లో చూస్తున్నాను.

తెలుగుజాతి ఇప్పుడు ఒక సవాలును ఎదుర్కొంటున్నది. ఎందుకో తెలియని ఆత్మన్యూనతాభావం తెలుగు పెద్దలను కృంగదీస్తున్నదని అనిపిస్తున్నది. వేల ఏళ్ళ అనంత చరిత్ర గల్గిన తెలుగుజాతిని కొత్త తేజంతో ముందుకు నడిపించడం కోసం ఈ ఆత్మన్యూనతాభావాన్ని సంపూర్ణంగా తుడిచివేయవలసిన అవసరం వున్నది. చరిత్ర గమనంలో వందలాది సంవత్సరాల అనైక్యత ఫలితంగా ఏర్పడిన దోషాలను పరిహరించుకొని, జాతిని ముందుకు నడపడానికి డా॥ జి.వి.పూర్ణచంద్ లాంటి అన్వేషకులు, పరిశోధకులు, సాహితీవేత్తలు బాధ్యతగా ముందుకురావాలి. వారికి ఈ పుస్తకం ప్రేరణ కావాలి. దీని విస్తృత ప్రయోజనాన్ని పొందవలసిన అవసరం తెలుగు ప్రజలకుంది.

డా॥ జి.వి.పూర్ణచంద్‌కు నా హృదయపూర్వక అభినందనలు.

ద్రావిడ విశ్వవిద్యాలయం కులపతి ఆచార్య గంగిశెట్టి లక్ష్మీనారాయణ ఈ పుస్తకాన్ని తమ విశ్వవిద్యాలయం పక్షాన ప్రచురించడం సమయోచితం. అందుకు వారిని మనస్ఫూర్తిగా అభినందిస్తున్నాను.

**- మండలి బుద్ధప్రసాద్**

కృష్ణాజిల్లా రచయితల సంఘం గౌరవాధ్యక్షులు

ఆం.ప్ర. మంత్రిమండలి సభ్యులు

# కలిసివెతుకుదాం, రండి!

'విద్యకు సంబంధించిన విషయాలను కేవలం విద్యావేత్తలకే వదలివేయకూడదు' అని ఒక సందర్భంలో మహాత్మాగాంధీ అన్నారు. అదేవిధంగా, భాషకు సంబంధించిన విషయాలను కూడా కేవలం భాషావేత్తలకు వదలివేయకూడని పరిస్థితి వచ్చింది. ప్రజాహితాన్ని గురించి పట్టించుకోని నేటి రాజకీయ నాయకులనూ ప్రభుత్వాలనూ తట్టిలేపి, దారిలో పెట్టవలసిన అగత్యం కూడా వచ్చిపడింది. తెలుగుజాతి పత్రికగా 'నడుస్తున్నచరిత్ర' చొరవతీసుకొంది. స్ఫూర్తిదాయకంగా, వేదికగా పనిచేస్తూ ఉంది. ఈ పత్రికలో మూడేండ్లుగా వివిధ అంశాలపై 'అన్వేషణ' శీర్షికన డా॥ జి.వి. పూర్ణచంద్ వ్రాసిన వ్యాసాలు ఎంతో ఆదరణను పొందాయి. వాటిలో కొన్నింటితో **'తెలుగే ప్రాచీనం'** అనే పుస్తకం కూడా వచ్చింది. దాన్ని ఆంధ్రప్రదేశ్ అధికారభాషా సంఘం అధ్యక్షులు డా॥ ఎ.బి.కె. ప్రసాద్ పట్టుబట్టి మరీ ప్రచురించారు. నడుస్తున్న చరిత్రలో ప్రచురించిన మరికొన్ని వ్యాసాలతో ఇప్పుడీ **'నైలు నుంచి కృష్ణదాకా'** పుస్తకం వస్తున్నది.

ఈ పుస్తకంలోని వ్యాసాల ద్వారా డా॥ జి.వి. పూర్ణచంద్ కొన్ని ముఖ్యాంశాలను చర్చకు పెడుతున్నారు.

మూల ద్రావిడభాష మాట్లాడినవారు నైలు నుంచి బయలుదేరి దక్షిణ భారతదేశంలో తెలుగువారుగా స్థిరపడ్డారనడానికి ఆధారాలందించారాయన. మూలద్రావిడ భాషాకుటుంబాల ఆనుపానుల్ని వెతికి, కొన్ని పరిశీలనలను పాఠకుల ముందుంచారు. తెలుగునేలమీద ఈజిప్షియన్ మూలాలను శోధించి, రాతియుగాల లోనే సాగిన ఆదానప్రదానాలను ఎత్తిచూపారు. సింధు నాగరికతకు ముందే భారతదేశంలో ద్రావిడుల ఉనికి ఉందనీ, తమిళులు ద్రవిడజాతీయులు కాకపోవచ్చనీ ఆధారాలనందిస్తున్నారు. తెలుగు ప్రాచీనతకు సుమేరియాలో సాక్ష్యాలు చూపుతున్నారు.

"ప్రపంచంలో ఏమూలకు వెళ్లినా ఒక ప్రాచీనజాతి లేదా ఒక ప్రాచీనదేశం లేదా ఒక ప్రాచీన నగరంలో మనకు ఎంతోకొంత తెలుగుమూలం దొరుకుతుంది" అని డా॥ జి.వి. పూర్ణచంద్ అంటున్నారు. తెలుగు ప్రజలు ప్రపంచం నలుమూలలా సంచరిస్తూ తమ భాషను కూడా తీసుకువెళ్లారు. భాషతోపాటు వారి సంస్కృతి కూడా ఎంతోకొంత వ్యాపించింది. వాటి వివరాలు వెలుగులోకి రావాలి. ఇంటర్నెట్‌లోనూ, అనేక గ్రంథాల్లోనూ లభిస్తున్న సమాచారాన్ని సేకరించి, విశ్లేషించి వివిధ శీర్షికల క్రింద డా॥ పూర్ణచంద్ తన ఆలోచనలను, అభిప్రాయాలను మనముందుంచారు. ఈ వ్యాసాల్ని శాస్త్రీయ పద్ధతుల్లో పరిశీలించి, విద్య, పరిశోధనా వేదికల ద్వారా వాటి నిగ్గుతేల్చాలి. ఈ బాధ్యత - భాషాశాస్త్రం, మానవ శాస్త్రం, సామాజికశాస్త్రం తదితర శాస్త్రాల పండితులదీ, పరిశోధకులదీ. "తెలుగువాళ్లు ప్రపంచం అంతా వ్యాపించి వుండేవారనే

భావనతో పరిశోధనలు సాగితే తెలుగుభాష మూలాలు విశ్వవ్యాప్తం అయిన వైనం నిరూపితమయి తీరుతుంది'' అని ఈ పుస్తక రచయిత స్పష్టంగా చెప్తున్నారు. ఇందుకనుగుణంగానే ఈయన - ఆఫ్రికన్లు, ఈజిప్షియన్లు, సుమేరియన్లు, రెడ్ఇండియన్లు-వీరి భాషలతోపాటు ఆస్ట్రేలియాలోని ఆదివాసుల భాషల్లోనూ, తూర్పున చైనా, జపాన్, కొరియా భాషల్లోకూడా ఈనాటికీ సజీవంగావున్న అనేక తెలుగు పదాలను ఈ వ్యాసాల్లో ఇచ్చారు. తెలుగుభాషా పదాలు విశ్వవ్యాప్తమైనవనే భావన తెలుగుభాషా పరిశోధకుల్లో కొత్తజీవాన్ని నింపుతుంది. అందుకే యువ పరిశోధకులు పట్టుదలగా ముందుకు సాగాలి.

జీవిత చరమాంకంలోవున్నా, అహాన్నీ, అభిజాత్యాన్నీ కీర్తికాంక్షనూ వదులుకోలేని కొందరు పెద్దలు అన్నీ తమకే తెలుసునని, తాము ఇప్పటికి చెప్పిందే తప్ప ఇక చెప్పవలసింది ఏమీ లేదని అంటున్నారు. పరిశోధకుల్లో, శాస్త్రజ్ఞుల్లో ఈ ధోరణి జాతికి నష్టం కలిగిస్తుంది. నిరంతర అన్వేషణ జరగాలి. జ్ఞానాన్ని పెంచుకొనే ప్రయత్నాలను ఎవరూ అడ్డుకోగూడదు. తప్పొప్పులను తెలియజేయడం, మార్గదర్శనం చెయ్యడం పెద్దల బాధ్యత.

మనది తెలుగుజాతి. మన భాషను, మన ప్రతిష్ఠను మనం నెత్తినపెట్టుకొని మొయ్యాలి. ఆవిధంగా గాక, మనల్ని, మన ప్రతిష్ఠను తెలుగుజాతి మొయ్యాలనీ, మనం చేస్తున్న కృషికిగాను మనకు తెలుగుజాతి ఋణపడివున్నదని మనలో ఎవరు అనుకొన్నా అది తప్పే. ఈ అవగాహనతోనే 'నడుస్తున్న చరిత్ర' ద్వారా చేతనైన కృషిచేస్తున్నాం. డా॥ జి. వి. పూర్ణచంద్ 'నడుస్తున్న చరిత్ర'తో కలిసి నడిచారు. ఎందరో నూతన పరిశోధకులకు ఆదర్శంగా నిలిచారు. ఎన్నో అంశాలపై కొత్త కాంతులను ప్రసరింపజేసి దారిదీపంగా నిలిచారు. ఆయనకు మా అభినందనలు.

రాష్ట్రంలోనే కాదు, ఇతర రాష్ట్రాల్లో వున్న మన తెలుగువారు కూడా తలెత్తుకొని, ఆత్మగౌరవంతో జీవించగలగాలి. ఎందుకంటే, దేశం మొత్తంలో ఉన్న తెలుగువారిలో ఇంచుమించు సగంమంది ఇతర రాష్ట్రాల్లో ఉన్నారు. ఈ వాస్తవాన్ని దృష్టిలో ఉంచుకొనే మనం వ్యవహరించాలి. ఇందుకోసం ఎంతో కృషి జరగాలి. మనకు గొప్ప చరిత్ర ఉంది. ఈ అన్వేషణ - వెతుకులాట - మన గొప్పదనాన్ని మనం తెలుసుకొనేటందుకే. భవిష్యత్తును తీర్చిదిద్దుకొనేటందుకే.

అందుకే, మనం 'కలిసి వెతుకుదాం, రండి' అంటున్నాను.

**డా॥ సామల రమేష్‌బాబు**
సంపాదకుడు, **నడుస్తున్న చరిత్ర**

# మనసు విప్పి...

**"నైలు నుంచి కృష్ణ దాకా - తెలుగుతో పెనవేసుకున్న భాషా బంధాలు - అధ్యయనాంశాలు"** గ్రంథాన్ని రూపొందించడానికి నాకు వెన్నుదన్నుగా నిలిచినది 'నడుస్తున్న చరిత్ర' మాసపత్రిక. "అన్వేషణ" పేరుతో ఇందులో మూడేళ్లుగా రాస్తూవస్తున్న వ్యాసాలను వాటిని కోరుకునే పాఠకులకు చేర్చి తెలుగు భాషోద్యమ దీప్తిని రగిలించడానికి ఈ పత్రిక ఎంతగానో తోడ్పడుతోంది. వైద్యవృత్తికి సంబంధించిన వాణ్ణయినా, భాషాచారిత్రకపరమైన అంశాలలో నా ఉత్సాహాన్ని చూసి ప్రోత్సహించిన సంపాదకులు డా॥ సామల రమేష్‌బాబుకు మొదటగా నా కృతజ్ఞతలు.

నడుస్తున్న చరిత్ర అందగానే నా వ్యాసాన్ని చూసి నాకు ఫోన్ చేసి అభినందించి అందులోని విషయాలను పరామర్శించే వ్యక్తులు ఇద్దరు! ఒకరు ద్రవిడ విశ్వవిద్యాలయం వైస్‌ఛాన్సలర్ ఆచార్య గంగిశెట్టి లక్ష్మీనారాయణ. ఇంకొకరు ఆంధ్రప్రదేశ్ అధికార భాషాసంఘం అధ్యక్షులు డా॥ ఎ.బి.కె. ప్రసాద్. ఆ ఇద్దరికీ నా నమస్కారాలు తెలుపుకొంటున్నాను.

"ఈసారి దేనిమీద రాస్తున్నావ్?" అని కన్పించినప్పుడల్లా నన్నడిగి, సంతోషిస్తూ, తెలుగుజాతి ప్రాచీనతని, తెలుగుభాష ప్రాచీనతని తదేకంగా ప్రచారం చేస్తున్న మాన్యమంత్రివర్యులు తెలుగుజాతి ప్రియతమ నాయకులు శ్రీ మండలి బుద్ధప్రసాద్, ఆంధ్రప్రదేశ్ హిందీ అకాడమీ అధ్యక్షులు పద్మశ్రీ ఆచార్య యార్లగడ్డ లక్ష్మీప్రసాద్ గార్లకు నా మనఃపూర్వక కృతజ్ఞతలు.

మనసుకు తట్టినవి, కళ్లకు కన్పించినవి, బుద్ధికి తోచినవీ గుదిగుచ్చి ఈ పుస్తకరూపంలో అందిస్తున్నాను. ఎన్నో ప్రాచీన భాషలలో తెలుగు పదరూపాలు కన్పిస్తున్నాయి. కొన్నింటిని మాత్రమే పరిమితంగా

ఇందులో పేర్కొన్నాను. భాషాశాస్త్ర నియమాల ప్రకారం వాటిని విశ్లేషించగలిగే శక్తి నాకులేదు - భాషావేత్తనూ చరిత్రకారుణ్ణీ నేను కానేకాదు - మరింత లోతైన అధ్యయనాన్ని చేయడానికి ఈ పుస్తకంలోని అంశాలు పరిశోధకులకు కొంతైనా ఉపయోగపడగలవని నమ్ముతున్నాను.

వివిధ భాషలు మాట్లాడే ప్రజలతో తెలుగువారి సంబంధాలు, చరిత్ర పూర్వయుగం నుంచి నడిచాయనేది నిర్వివాదం. ఒకే పదం రెండు వేర్వేరు భాషల్లో ఒకే అర్థంలో వ్యవహారంలో వున్నప్పుడు కచ్చితంగా ఆ రెండు భాషలకు చెందిన ప్రజల మధ్య ఏదో ఒక సంబంధం వుండి వుండాలి. ఏ సంబంధం లేకుండా భాషాపదాలు మార్పిడి జరిగే అవకాశం వుండదు. ఒకటీ - రెండూ అయితే కాకతాళీయం అని కొట్టిపారేయవచ్చు. కానీ, వందలకొద్దీ దొరుకుతున్నప్పుడు అది చారిత్రకంగా చాలా ముఖ్యమైన అంశం అవుతుంది.

ప్రజలలో భాషాభిమానాన్ని, భాషా చైతన్యాన్ని పెంపొందించడం కోసం తెలుగు భాష, తెలుగు ప్రజలు, తెలుగు నాగరకతలు అత్యంత ప్రాచీనమైనవని నిరూపించి ప్రజలకు అందించవలసిన బాధ్యతని తెలుగు పరిశోధకులు స్వీకరించవలసి వుంది. అందుకు కావలసిన అధ్యయ నాంశాల్ని మాత్రమే ఈ గ్రంథంలో సమీకరించే ప్రయత్నం చేశాను.

శాస్త్రీయమైన అధ్యయనాన్ని శాస్త్రవేత్తలు మాత్రమే చేయగలరు. భాషా శాస్త్రవేత్తలు, పురావస్తు శాస్త్రవేత్తలు, మానవ శాస్త్రవేత్తలు ముగ్గురూ కలిసి మనసుపెట్టి పరిశోధిస్తేనే తెలుగు ప్రాచీనతని సశాస్త్రీయంగా నిరూపించడం సాధ్యం అవుతుందని నమ్ముతున్నాను-ఇది ఏ ఒక్కరో తేల్చి చెప్పే అంశం కాదని కూడా భావిస్తున్నాను.

ఈ వ్యాసాలకోసం ప్రసవవేదన పడ్తున్నప్పుడు నాకు అనేకవిధాల తోడ్పాటు నందించిన ఆప్తమిత్రులు శ్రీ ఎ.వి.ఎస్.ఆర్. ఆంజనేయులు గారికి, డా॥ గుమ్మా సాంబశివరావు గారికి, డా॥ వెన్నా వల్లభరావు గారికి నా హృదయపూర్వక ధన్యవాదాలు తెలుపుకొంటున్నాను.

కృష్ణాజిల్లా రచయితల సంఘం అధ్యక్షుడు, ప్రాణమిత్రుడు శ్రీ గుత్తికొండ సుబ్బారావు అందించిన ప్రోత్సాహాన్ని ఎప్పటికీ మరచిపోలేను.

విజయవాడ — రచయిత

*1.06.2008*

# ఇవీ... తరంగాలు







సీ. ఆంధ్ర దేశస్థ సర్వాపగా భంగాత్
రంగరంగముల శౌర్యములు నేర్చి
ఆత్మప్రలాప శౌర్యములు తాలిచి 'సుమి
త్రా' 'బోర్నియో' ద్వీప తతులు గెలిచి
వంగ మహారాష్ట్ర హద్దులు పరిచయ
స్థలములై వినయమ్ము సలుపమెలగి
ఈజిప్టు నుండి కృష్ణాజలమ్ములకు 'బారం
బాట'గా పరాక్రమము జూపి

తే. సకల దీవుల విజయధ్వజములు నాటి
తనదు తెరచాప వార్ధి రాజునకు కట్టు
కోకగా పూర్వ మాంధ్రుల నౌక రాజ్య
మమర జేసిన 'దేడు సంద్రముల మీద

(ఆంధ్ర పౌరుషం)

– కవిసమ్రాట్ విశ్వనాథ సత్యనారాయణ

# 1

# తెలుగు నేలపైన ఈజిప్షియన్ మూలాలు

## రాతియుగాలలోనే సాగిన ఆదానప్రదానాలు

క్రీ.పూ. 3,000 కు ముందునాటి సంగతి...

తొలి ప్రపంచ నాగరకతలు నెమ్మదిగా వస్తుమార్పిడికి అలవాటుపడసాగాయి. "నేను కట్టుకునే బట్టలకోసం పట్టుదారం నీదగ్గరుంది. నీ మెడకో నగ కోసం మేలిమి బంగారం నా దగ్గరుంది -" అనే ధోరణిలో మనుషులు ఇచ్చిపుచ్చుకోవడం మొదలుపెట్టారు. చిన్న వ్యాపారం - పెద్ద వర్తకం - పెద్ద వాణిజ్యం అయ్యాయి. వాణిజ్యవేత్తలు ధనవంతులుగా ఎదిగారు.

వ్యాపార ప్రయోజనం కోసమే కావచ్చు...దూర సుదూర ప్రాంతాల అన్వేషణ ఎక్కువయ్యింది...

ఎన్నెన్నో జాతులతో ఎందరెందరికో పరిచయ భాగ్యం కల్గింది. మానవ సంబంధాలు బలపడసాగాయి. వాటిని పౌర సంబంధాలు (public relations) అంటే ఇంకా బాగుంటుంది.

ఆనాటి మానవుడికి "విపులాచ పృధ్వీ" ఈ భూమండలం చాలా విశాలమైందని తెలిసివచ్చింది.

ప్రపంచంలోని అనేక జాతుల మధ్య పెనవేసుకున్న బంధాలు భాషనీ, సంస్కృతినీ, నాగరికతనీ మరింత అభివృద్ధి పరిచాయి. ఒకరి వలన ఒకరు ప్రభావితులౌతూ... ఒకరినొకరు ప్రభావితం చేస్తూ... నాగరకులుగా పరివ్యాప్తం కాసాగారు మనుషులు.

వర్తకవాణిజ్యాలు తొలి నాగరికతలకొక వరంగా పరిణమించాయి. ఈ వరాలను అందుకొన్న జాతులు నాగరకులుగా ఎదిగారు.

అప్పటిదాకా మనిషి ఆలోచన, తనకోసం, తన అవసరాల కోసం, తన వినియోగం కోసం మాత్రమే స్వయం సమృద్ధికావాలనే ధోరణిలో వుండేది. కానీ, ఇతర జాతీయులతో (లేదా) దేశీయులతో (లేదా) ప్రాంతీయులతో వ్యాపార సంబంధాల వలన అవతలవారి అవసరాల గురించి కూడా ఆలోచించవలసిన పరిస్థితి ఏర్పడింది. తన దగ్గరున్నవేవో అమ్ముకోవడం కన్నా, అవతలి వాడికి కావలసింది ఉత్పత్తిచేసి అమ్మడం వలన ఎక్కువ లాభం వస్తుందనే గమనికని ఆనాటి నాగరక మానవుడు సరిగానే అందుకోగలిగాడు. అంటే, మార్కెటింగ్ దృష్టి ఆనాటికే పెంపొందిందని అర్థం!

వాణిజ్య రహదారులకన్నా, వాణిజ్య స్థావరాలకన్నా ముందే వాణిజ్యం మొదలయ్యింది. వాణిజ్యం కారణంగానే దూరప్రాంత ప్రజల మధ్య సంబంధాలు ఏర్పడ్డాయి. వాణిజ్యం కారణంగానే ఆ ప్రజలకు స్వంత వనరులు, స్వంత ఉత్పత్తులు ఏర్పడ్డాయి.

కానీ, ఆ ఉత్పత్తులు ఇతర ప్రాంతాలకు చేరడానికి కావలసిన ప్రయాణ సదుపాయాలు లేని ఆ రోజుల్లో వాణిజ్యం అనేది నిస్సందేహంగా సాహసయాత్రే! సింద్‌బాద్ సాహస గాథలన్నీ ఇలాంటివే!

అందుకు పరిష్కారంగానే మధ్యవర్తుల వ్యవస్థ పుట్టుకొచ్చింది.

మధ్యవర్తులు రెండురకాలు :

1. ఉత్పాదకులకూ, వ్యాపారులకూ మధ్యన వుండేవారు. సాధారణంగా వీళ్లు స్థానికులు అయివుంటారు.

2. వేర్వేరు వ్యాపారుల మధ్యన వుండేవారు. వీళ్లు సాహసికులైన నావికులు, యాత్రికులు అయివుంటారు(Distributing Agents). ఒక దేశం నుంచి మరొక దేశానికి (లేదా) మరో ప్రాంతానికి నేలదారినో, నీటిదారినో సరుకులు అందించేవారు.

అలా అందించగలగడంలో సిద్ధహస్తులుగా ఫినీషియన్లు, నాగులూ ప్రముఖంగా కన్పిస్తారు. ఈ నావికా వర్తకులే నిజమైన నాగరకతా వ్యాపకులనవలసి వుంటుంది.

వర్తకులు తెచ్చిందే ఆ రోజున "వార్త"! ఒక ప్రాంతంలోని ఉత్పత్తులతోపాటు- అక్కడి జనం కథలు, సంస్కృతి, వారి పదజాలం అన్నీ ఇంకొక జాతికి అందడానికి ఈ వర్తకులే కారకులు!

సుదూర తీరాలకు వర్తకాల విస్తరణ అనేది తొలిసారిగా మెసపొటేమియా, సింధు నగరాల మధ్య క్రీ.పూ. 3,000 ఏళ్లనాడు ప్రారంభం అయిందని భావిస్తున్నారు.

సుగంధ ద్రవ్యాలు, బట్టలు, బంగారం - వెండి ఆభరణాలు, ముఖ్యంగా ఇనుము, కంచుతో తయారయిన వస్తువులు సింధు నగరాల ద్వారా ఎగుమతులు, దిగుమతులు జరిగాయి.

లాభాలు దిట్టంగా వున్నప్పుడు వ్యాపారాల్ని కొత్త ప్రాంతాలకు విస్తరించాలనుకోవడం సహజం. క్రమేణా యూరప్ ఆసియా ఖండాలలో వాణిజ్యం బాగా విస్తరించింది. యూరేసియా దేశాలన్నింటి మధ్య సాంస్కృతిక బంధాలు పెనవేసుకో సాగాయి.

ఇప్పటికి నాలుగువేల ఏళ్ల క్రితం సైప్రస్ చాలా వెనకబడిన ప్రాంతం. వాళ్లదగ్గర అపారమైన రాగి నిక్షిప్తాలున్నాయి. రాగిని ఎలా ఉపయోగించుకోవాలో నెమ్మదిగా తెలుసుకోగలిగిన సైప్రస్ ప్రజలు ఈజిప్ట్ తదితర ప్రాంతాలతో వ్యాపార బంధాలు పెంచుకోగలగడంతో సైప్రస్ దశ మారిపోయింది.

ఆనాటి చైనా పట్టు వస్త్రాలతోనూ, ప్రాచీన బ్రిటన్ తగరంతోనూ, భారతీయులు సుగంధ ద్రవ్యాలతోనూ, ప్రత్తి, నూలు వస్త్రాలతోనూ మెడిటరేనియన్ ఆఫ్రికన్ తీరాలలో విశేషమైన వాణిజ్యం నిర్వహించి లాభపడ్డారు. దక్షిణ భారతదేశంలోని దక్కన్ భూభాగం (ఈనాటి ఆంధ్రప్రదేశ్) ఇనుముతో చేసిన వస్తువులను కూడా ఎగుమతి చేసి ఆనాటి ప్రముఖ వాణిజ్య కేంద్రాలలో ఒకటిగా గుర్తింపు నొందింది!

నైలునది, టైగ్రిస్, యూఫరేట్స్ నదులు, చైనాలోని ఎల్లోనది, పశ్చిమ భారతదేశంలో సింధునది, దక్కన్‌లో కృష్ణా, గోదావరి, తుంగభద్ర నదీ పరీవాహక ప్రాంతాలన్నీ ఈ వాణిజ్య అవకాశాలను ఉపయోగించుకొని సుసంపన్నంగా ఎదిగాయి.

చైనా నుంచి వర్తకులు ఆ రోజుల్లో పట్టు వస్త్రాలను తీసుకువెళ్లి అమ్మిన మార్గాన్ని "సిల్క్ రూట్" అంటారు. ఇండియా నుంచి సుగంధ ద్రవ్యాలు వెళ్లిన

మార్గాన్ని "స్పైసె రూట్" అంటారు. అరబ్ దేశాలు జవ్వాది, కస్తూరిలాంటి సువాసన ద్రవ్యాలను ఎగుమతి చేసిన మార్గాన్ని "ఇన్‌సెన్స్ రూట్" అంటారు. ఇలా ఎక్కడికక్కడ వాణిజ్య మార్గాలు నెలకొన్నాయి. వాణిజ్య మార్గాలలో మధ్యమధ్య అనేక నగరాలు వెలిశాయి. సిరియా ఎడారుల్లో వ్యాపారులకు సేద తీరే అవకాశంగా palmyra, petra ప్రాంతాలు ఇలానే అభివృద్ధి పొందాయి.

క్రీ.పూ. 1వ శతాబ్ది నాటికి రోమన్‌ల సామ్రాజ్యం, పార్థియన్‌ల సామ్రాజ్యం, కుషాన్‌ల సామ్రాజ్యం, xiongnu అనే వలస దారుల సామ్రాజ్యం, హూన్ సామ్రాజ్యం, దక్కన్‌లో శాతవాహనుల సామ్రాజ్యం ఈ వాణిజ్య కార్యకలాపాల్లో ముమ్మరంగా పాల్గొన్నాయి.

## నైలు నుంచి ద్రావిడుల రాక...ఇలా!

వర్తక వాణిజ్యాలు చెయ్యాలంటే ఆ రోజుల్లో సముద్రయానం తప్పనిసరి! మన పురాణాల్లో చెప్పిన సముద్రమథనం కథ ఈ సముద్రయానానికి సంబంధించిందేనని కొందరు చరిత్రకారుల అభిప్రాయం. పెద్ద పడవలు లేదా ఓడలకు అడుగున వుండే చక్రాలు నీటిని చిలుకుతూ పడవను ముందుకు నడిపిస్తాయి. సముద్ర మథనం అంటే ఇదే ! ఈ నావికాయానంలో సముద్రంమీద ఆధిపత్యం కోసం, వాణిజ్యం మీద ఆధిపత్యం కోసం ఆ రోజుల్లో భారతదేశంలో దేవాసురులు పోటీపడి వుండవచ్చు. సముద్రమథనం ద్వారా కామధేనువు, కల్పవృక్షం లాంటి ప్రపంచ వింతలు బైటపడ్డాయని సముద్రమథనం కథ చెప్తోంది. మనకులేని అనేక వస్తు సరంజామా, మొక్కలు, పశువులు వీటిని మనం పొందడానికి వర్తకుల తోడ్పాటు అవసరం. అందుకు సముద్రం మీద ఆధిపత్యం కూడా అవసరమే!

సగరుడి పేరుతో జలనిధి అయిన సముద్రాన్ని సాగరం అన్నారంటే, బహుశా సగరుడు ఈ సముద్రాధిపత్యాన్ని సాధించి విశేషమైన వర్తక వాణిజ్యాలు నిర్వహించి వుండాలి. సుమేరియన్ శిధిలాలలో "సార్గన్" పేరుతో కన్పించిన ఒక రాజు కథ, మన సగరుడి కథ ఒక్కటే! బహుశా సగరుడు సుమేరియా నగరాల నుంచి తన వ్యాపారాలు నిర్వహించి వుండవచ్చు.

జాతులు నాగరకత సముపార్జించు కొంటున్నకొద్దీ నావికాయానం అభివృద్ధి చెందుతూ వచ్చి వుంటుంది. వ్యవసాయానికన్నా ముందు మనిషి వేట మీద ఆధారపడి జీవించాడు. మృగాలతోపాటు, జలచరాల్ని కూడా వేటాడటం ఒక తప్పనిసరి అవసరమే!

నదిపైనగానీ, సముద్రంపైనగానీ వేటకు వెళ్లాలంటే పడవలు అవసరం! కాబట్టి, జంతువుల్ని చంపడంకోసం రాతి ఆయుధాలను తయారు చేసుకొన్నట్లే, నీటిమీద వేటకోసం చెక్క పడవల తయారీకూడా సాధించగలిగాడు.

James Hornell (1918) మద్రాసు ప్రభుత్వ మత్స్యశాఖకు సంచాలకుడుగా వుండేవాడు. చేపలు పట్టడానికి సంబంధించిన ప్రాచీన చరిత్రనీ, ముఖ్యంగా దక్షిణ భారతదేశంలో ఆ కాలంలో పడవల తయారీ విధానాన్నీ విశ్లేషిస్తూ "The origins and the Ethnological Significance of Indian Boat Designs" అనే పేరుతో ఒక మోనోగ్రాఫ్‌ని ఆయన ప్రచురించాడు. అది మెమోయిర్స్ ఆఫ్ ద ఏసియాటిక్ సొసైటీ ఆఫ్ బెంగాల్ (vol.VII number 1, 1918) లో అచ్చయ్యింది. ఈ పరిశోధనలోని ముఖ్యమైన అంశాల్ని సునీత్ కుమార్ చటర్జీ అన్నామలై విశ్వ విద్యాలయం కోసం 1963లో చేసిన "ద్రవిడియన్" ప్రసంగాలలో మొదటి ప్రసంగంలో వివరించారు. ఆ విశేషాలివి:

1. దక్షిణ భారతదేశంలో సముద్రతీరాన ద్రావిడభాషలు మాట్లాడిన వాళ్లు ఇంకా ఇక్కడికి రాకముందు (Pre-Dravidian Coast-population) నీగ్రిటోలు, మూల పాలినీషియన్ ప్రజలు ఉండేవారిక్కడ. వీళ్లలో నీగ్రోలు మొదటి తరంవాళ్లు కావచ్చు. కొండల్లోనూ, దట్టమైన అడవుల్లోనూ నివసించడానికి అలవాటుపడిన నల్లజాతి ప్రజలు వీళ్లు! వీళ్ల ముఖం గుండ్రంగా వుండేదిట!

2. రెండోతరంవాళ్లు ప్రోటో పాలినీషియన్లు. వీళ్లు ఒక తెడ్డుతో నడిపే పడవల్ని (Single outrigger form of Canoes and Boats) నడిపారు.

3. రెండు తెడ్ల పడవలు నడిపినవారు మలేషియన్లు, ఇండోనేషియన్లు! పాలినేషియన్ల తర్వాత శ్రీలంక మీదుగా ఈ మలేషియన్లు, దక్షిణదేశపు సముద్రతీర ప్రాంతాలకు చేరి వుంటారు.

4. వీళ్ల తర్వాత పూర్వ ద్రవిడియన్లు దక్షిణభారత దేశంలోకి ప్రవేశించారు. మాలే నుంచి కొబ్బరి పంటని ఇక్కడికి వెంటబెట్టుకొని తెచ్చింది ఈ ద్రావిడులే!

5. పూర్వ ద్రావిడులు నిస్సందేహంగా మెడిటరేనియన్ జాతులకు సంబంధించినవారే! వీళ్ల ఆచార వ్యవహారాలు కూడా వాళ్ల నుంచి సంక్రమించినవే!

6. పూర్వ ద్రావిడులు మెడిటరేనియన్ల నుంచి విడివడటానికి ముందే గుండ్రని దొన్నెలు కనుగొన్నారు. వాటిని ఇక్కడకూడా తయారుచేసి మన నదుల పైన ప్రయాణించారు.

7. మెడిటరేనియన్ నుంచి బయల్దేరిన ఈ పూర్వ ద్రావిడులు బహుశా అల్పాయిన్ లేదా మంగొలాయిడ్ ప్రజలతో తలపడటం వలన కావచ్చు, దక్షిణానికి, దక్షిణ వాయవ్యానికి తరమబడి (లేదా) బలవంతంగా నెట్టబడి వుంటారు. బెలూచిస్తాన్‌లో ఈ పూర్వ ద్రావిడ ప్రజల ఆనాటి ఉనికికి సాక్ష్యంగా అక్కడ బ్రాహుయీ భాష అంతో యింతో ఇంకా కన్పిస్తోంది.

8. బెలుచిస్తాన్ నుంచి ఇండియాలోకి ప్రవేశించాక సింధూ, గంగా తీరాల వెంబడీ వీళ్లు ప్రయాణించారు. ఈ నదులపైన పడవల్ని ప్రవేశపెట్టింది ఈ ద్రవిడులే! ఒకప్పుడు నైలూ, టైగ్రిస్ నదులలో పడవలమీద ప్రయాణించినట్లే ఇక్కడ సింధు, గంగా నదులలో కూడ ప్రయాణించారు. అలాంటి పడవల వినియోగమే ఇక్కడా కన్పించడం ఇందుకు సాక్ష్యం.

9. ఈ ద్రావిడియన్లు అటు నదీ జీవితానికి అలవాటుపడినట్లుగానే, ఇటు వ్యవసాయక జీవనానికి కూడా అలవాటు పడినట్లు అర్థం అవుతుంది. ఏమైనా, నీటి మీద ప్రయాణాన్ని ఇక్కడ విస్తృతపరిచింది ఈ ద్రావిడులే!

10. దక్షిణదేశంలోకి వచ్చిన తర్వాత అంతకుముందునుంచే అక్కడున్న పాలినీషియన్లతో సంబంధాలవలన చేపల వేటకు సంబంధించిన ఎన్నో విశేషాలు వారి నుంచి సంగ్రహించుకున్నారు.

11. కాలక్రమంలో ఈ పాలినీషియన్లు ద్రావిడులతో పూర్తిగా సంలీనం అయిపోయారు. రాజకీయంగానూ, భాషాపరంగా కూడా వాళ్ల అస్తిత్వం ఇక్కడలేకుండా పోయింది. బహుశా పూర్వద్రావిడ భాషలో వారి పదసంపద ఏదైనా మిగిలివుంటే వుండవచ్చు. అందుకనే "జేమ్స్ హార్నెల్" గారు ద్రావిడుల్ని ?caucasian × Mongolian × papuasian లుగా భావించాడు.

హార్నెల్‌గారి ఈ అభిప్రాయాలు పరిశీలించిన మీదట మనకు కొన్ని విషయాలు స్పష్టమౌతున్నాయి :

- నైలునది నుంచి బయల్దేరి వచ్చిన ప్రజలే ద్రావిడులుగా పిలువబడ్డారు.
- సుమేరియన్ నాగరకతా కాలంలో వర్తక వాణిజ్యాలు నిర్వహించి కొంత అనుభవం సంపాదించుకున్నారు.
- వీళ్లు బెలూచిస్తాన్‌లోకి ప్రవేశించేనాటికి పూర్వ ద్రావిడ భాషలోంచి బ్రాహుయీ విడివడి వుంటుంది.

● క్రీ.పూ. 3000 కాలానికి వీళ్లు సింధు నగరాలలో ప్రముఖపాత్ర పోషించి వుంటారు. బహుశా ఆనాటికి సింధు నాగరికత చరమాంకం నడుస్తూ వుండవచ్చు. అప్పటికే తెలుగుభాష ఒక ప్రత్యేక రూపాన్ని సంతరించుకొని వుండవచ్చు. బ్రాహుయి తర్వాత మొదటగా విడివడింది తెలుగుభాషేనని భాషావేత్తలు చెప్తున్నారు.

● సింధు గంగా తీరాలలో ఆర్యులతో కలిసి సహజీవనం చేసే అవకాశం కూడా వీరికి కలిగివుండవచ్చు.

● ఎక్కడికక్కడ స్థానిక జాతులతో సంలీనాలు, ఆదాన ప్రదానాల కారణంగా పూర్వద్రావిడ భాష కనీసం 24 భాషలుగా విడివడి వుంటుంది. బ్రాహుయీ తర్వాత భారతదేశంలో మొదటగా విడివడిన ద్రావిడభాష తెలుగే అయివుంటుంది.

హార్నెల్ పండితుడు తన వాదనకోసం F.S. Richards I.C.S. పేర్కొన్న అంశాలను ఆకరాలుగా తీసుకున్నాడు. రిచర్డ్స్ గారు 1917 జూలై మిథిక్ సొసైటీ జర్నల్‌లో "Some Dravidian affinities and their sequel" అనే వ్యాసం ప్రచురించాడు. ఈ వ్యాసంలో రిచర్డ్స్‌గారు వెలిబుచ్చిన అభిప్రాయాలివి :

1. ద్రావిడులకన్న ముందు దక్షిణభారత దేశంలో నివసించిన స్థానిక ప్రజలు చట్టి ముక్కు (Broad Nosed) ఆటవిక ప్రజలు. ముండాభాష మాట్లాడినవారికి, నల్లజాతి ప్రజలకు (మెలనీషియన్లు) దగ్గర పోలికలతో వుండి వుంటారు. వీళ్లలో కొంత నీగ్రోయిడ్ కొంత ఆఫ్రికన్ అంశలు ఇమిడి వుండవచ్చు.

2. ద్రావిడులు స్వచ్ఛమైన మెడిటరేనియన్లే అనడానికి వారిలో నాగదేవతార్చన వుండటం ఒక ప్రబల సాక్ష్యం.

3. ఆర్యుల ప్రభావం ద్రావిడులపైన జాతిపరమైనదికాదు. కేవలం సాంస్కృతిక పరమైనదే! కానీ సుమేరియన్ ప్రభావం జాతిపరమైనదే! బ్రాహ్మణిజంలోని వర్ణవ్యవస్థకు సమాన స్థాయిలో ద్రావిడులలో కులవ్యవస్థ ప్రబలడానికి ఈ ప్రభావమే ముఖ్య కారణం.

4. అగ్రవర్ణాలు (లేదా) అగ్రకులాలపైన సాధారణ ప్రజల తిరుగుబాటుగానే బౌద్ధం అవతరించి దేశం అంతా విస్తరించింది. తెలుగునాట బౌద్ధం మరింతగా విస్తరించడానికి ఇక్కడ కులవ్యవస్థ ఎక్కువగా వుండటమే ముఖ్యకారణం. కులపరంగా వెనకపడినవారిలో ఆత్మవిశ్వాసం పెంచడానికి బౌద్ధం పూనుకొంది.

5. ద్రవిడియన్లు, మెడిటరేనియన్ల మధ్య బాంధవ్యాలు ఉండేవనడానికి రిచర్డ్స్‌గారు సూచించిన గట్టి సాక్ష్యాలు ఇవి :

✤ జానపద గాథలలో కొన్ని అంశాలు సమాంతరంగా కన్పిస్తున్నాయి.

✤ పునర్జన్మకు సంబంధించిన మన నమ్మకాలు ఆర్య సంస్కృతి నుంచి వచ్చినవి కావు, మెడిటరేనియన్ల నుంచి మనకు సంక్రమించినవే!

✤ బౌద్ధం ఈ పునర్జన్మ సిద్ధాంతాన్ని బాగా వ్యాప్తిచేసింది. గ్రీకులు కూడా ఈ సిద్ధాంతాన్ని నమ్మినవారే.

✤ మనవడికి తాతగారి పేరు పెట్టుకునే అలవాటు మెడిటరేనియన్ల నుంచే మనకు సంక్రమించింది.

✤ మెడిటరేనియన్ల లిపికీ, సింధు నగరాల లిపికీ దగ్గర పోలికలు కన్పిస్తున్నాయి.

✤ గ్రామ దేవతల ఆరాధన, జంతు బలులిచ్చే పద్ధతుల్లాంటివి మెడిటరేనియన్లవే!

ఇలాంటివే ఇంకా అనేక ఉదాహరణల్ని రిచర్డ్స్‌గారు ప్రస్తావించి ద్రావిడులు నిస్సందేహంగా మెడిటరేనియన్లేనని తేల్చి చెప్పాడు.

## తమిళులు ద్రావిడ జాతీయులు

డా॥ జార్జిస్ ఆలివియర్ (Dr. Georges Olivier) అనే పారిస్ విశ్వవిద్యాలయం ఆంత్రపాలజీ ప్రొఫెసర్ Anthropologie des Tomouls du sud de I` Inde" అనే ఫ్రెంచి వ్యాసం లో తమిళులు, ఇతర ద్రవిడియన్ల గురించి ఆంత్రపోలాజికల్ సర్వే వివరాలు అందించాడు. ద్రావిడులలో వున్న వివిధ కులాలకు సంబంధించిన ప్రజల్ని వాళ్ల నల్లని శరీర వర్ణాన్నిబట్టి పరిశీలన చేశాడాయన. భారతదేశంలో నల్లవాళ్లని ఆయన "మెలనో-ఇండియన్స్" (Dark Black Indians) అని పిలిచాడు. తమిళియన్లు ఈ మెలనో ఇండియన్లకు సంబంధించినవారు కారనీ, వాళ్లు ఆస్ట్రేలియన్ స్థానిక ఆదివాసీలు (Aboriginals) కావచ్చునీ స్పష్టంగా పేర్కొన్నాడు.

మెలనో ఇండియన్లను భారతదేశంలో ఏ తరహా ప్రజలుగానూ వర్గీకరించేందుకు అవకాశంలేదని, వాళ్లు మిశ్రమజాతీయులు కాదు, అలాగని స్వచ్ఛమైన జాతీయులూ కాదు - వాళ్లు ప్రత్యేకమైన గ్రూపు ప్రజలనీ, వీళ్లని SOUTH INDIAN RACE అని పిలవడం సబబుగా వుంటుందనీ ప్రొఫెసర్ ఆలివియర్ పేర్కొన్నాడు.

మొదట వీళ్లు ఉత్తరభారత దేశంలో వ్యాపించారనీ, సింధునాగరికతకు వీళ్లు ప్రధాన కారకులని కూడా ఆయన అన్నాడు. ఇవేవీ తమిళులకు వర్తించే అంశాలు కావు.

మొహెంజొదారోలో దొరికిన మానవ కపాలాలు కూడా ఈనాటి తమిళులతో సరిపోలి లేవనీ తమిళులలోని veddids ఆస్ట్రేలియన్ ఆదివాసీలతో సరిపోతున్నారనీ, తమిళులూ మెలనో ఇండియన్లూ ఒకరుకారనీ ఆయన అభిప్రాయపడ్డాడు. "....Strictly speaking, one may imagine that these Melano Indians had occupied formerly the North India also, and they are responsible for the Indus Civilization, inspite of the fact that the character of the skulls found at Mohen-jo-Daro donot Correspond with those of the present day Tamils. The true problem consists in finding out if one should connect the veddids (one of the component Elements of the Tamil people) with the Australian aborigines, the problem which means separating them from Melano Indians with whom they are related...." అనేది ప్రొఫెసర్ ఆలివియర్ గారి స్పష్టమైన ప్రకటన.

ఆలివియర్ గారి ఈ పరిశోధనాంశాలు మనల్ని అనేక రకాలుగా ఆలోచింప చేస్తున్నాయి.

1. ద్రావిడులు నిస్సందేహంగా భారతదేశంలో నల్లజాతి మెలనీషియన్లే! బహుశా ఋగ్వేదంలో దస్యులని హేళనగా పిలిచింది వీళ్లనే కావచ్చు.

2. ప్రాచీన మెడిటరేనియన్ జాతులకు వీళ్లు వారసులు.

3. సింధు నగరాల కాలంలో వీళ్లు ఒక వెలుగు వెలిగినట్లు కన్పిస్తోంది.

4. వీళ్లని ద్రావిడులు అనడంకన్న "దక్షణభారత జాతి" అని వ్యవహరించడమే సబబు.

5. ఏ ద్రావిడ శబ్దాన్ని స్వంతం చేసుకుని ద్రావిడపదం కన్పించిన ప్రతి సందర్భంలోనూ దానిని "తమిళ" అని మార్చి వ్యవహరిస్తున్నారో, ఆ తమిళులు ఆస్ట్రేలియా ఆదిమవాసుల వారసులేగాని, మెడిటరేనియన్ ద్రావిడ జాతులతో వీరికి సంబంధంలేదని ఆలీవియర్‌గారు నిర్మొహమాటంగా ప్రకటించారు. అంటే, తమిళులు జాతిపరంగా ద్రావిడులు కాదని, ద్రావిడ భాషని స్వీకరించి వుంటారనీ అర్థం అవుతోంది.

6. ఇలాంటి పరిశోధనాంశాలకు విస్తృత ప్రచారం, వ్యాప్తి కలగకుండా తొక్కిపెట్టేశారనేది స్పష్టం. అయితే ఈ విషయాల్ని సునీతి కుమార్ చటర్జీగారు అన్నామలై విశ్వవిద్యాలయంలో 1963లో ఉటంకించడమే విశేషం. అన్నమలై విశ్వవిద్యాలయమే భాషాశాస్త్రపరంగా తమ 7వ ప్రచురణగా ఈ ఉపన్యాసాలను "ద్రవిడియన్" పేరుతో 1965లో ఒక పుస్తకంగా ప్రకటించింది.

తమభాష గొప్పదనీ, తమ జాతి గొప్పదనీ, తమ సంస్కృతి గొప్పదనీ ప్రతి ఒక్కరూ అనుకొంటారు. అనుకోవాలికూడా! కొందరు తెలుగు ప్రజలకీ, పరిశోధకులకీ దురదృష్టవశాత్తూ అలాంటి అభిమానాలు వుండకపోతే వుండకపోవచ్చు. కానీ, ప్రపంచంలో అన్ని జాతులకూ "జాత్యభిమానం" సహజ గుణం. అది సుగుణం కూడా! అయితే, తమ గొప్పతనాన్ని చాటుకోవడం కోసం, చరిత్రని వక్రీకరించి సోదరభాషల్ని కించపరుస్తూ, వాస్తవాల్ని మరుగు పరిచేందుకు ప్రయత్నించే కొందరి ధోరణిని ఈ ఆలివియర్‌గారి పరిశోధనలు ఎండగడ్తున్నాయన్నది వాస్తవం.

## సింధు నాగరకతకు ముందే భారతదేశంలో ద్రావిడుల ఉనికి

నూటయాభై సంవత్సరాల క్రితం వరకూ భాషాకుటుంబ భావన అనేదే మనకు తెలియదు. ఆరోజుల్లో "జనని సంస్కృతంబు ఎల్లభాషలకు" అని అందరూ గట్టిగానే నమ్మేవారు. దక్షిణాదిలోని తెలుగు, తమిళ కన్నడ మలయాళాలలో కొన్ని సంస్కృత పదాలుకూడా వున్నాయి. కాబట్టి అది నిజమేననిపించడం కూడా సహజమే!

పశ్చిమదేశాలలో క్రైస్తవులు ఈ ప్రపంచంలోని భాషలన్నీ హిబ్రూలోంచే పుట్టాయని నమ్ముతారు. జెహోవా స్వర్గంలో మాట్లాడేభాష ఇదేనని వాళ్ల నమ్మకం. "terricolis multae linguae caelicolis una - "there are many Languages among those who dwell on earth, but only one among those who dwell in heaven" ఈ భూమ్మీద నివసించే మనుషుల మధ్య అనేక భాషలున్నాయి, కానీ, స్వర్గంలో నివసించే వారికి ఒకే భాష వుంది - అది హిబ్రూ" అని, వాళ్ల విశ్వాసం.

"సా మాగధీ మూల భాషా, నరాయామ్ ఆది కప్పికా బ్రాహ్మణో చస్సుతాలాపా సంబుద్ధాచాపి భాసరే-" పాలీ (ళీ) -లేదా-మాగధి "మూల భాష" అనీ, అనాదికాలపు దేవతలు ఈ భాషనితప్ప మరొకభాష విన్నవారు కాదనీ, బుద్ధ

భగవానుడు ఆ భాషలోనే సంభాషించేవాడనీ బౌద్ధులుకూడా పాలీభాష గురించి చెప్పుకున్నారు.

తొలినాటి జైనులు ప్రాకృత భాషని ఆర్షభాష అనీ, సంస్కృతంతో సహా అన్ని భాషలూ ఈ ప్రాకృతంలోంచే ఏర్పడ్డాయనీ నమ్ముతారు.

సంస్కృత భాషాభిమానులు ముఖ్యంగా బ్రాహ్మణులు -సంస్కృతం. లోంచే ఒకరకమైన ప్రాకృతం ఏర్పడిందనీ, సౌరసేని, మాగధి, మహారాష్ట్ర కూడా దానిలోంచే ఏర్పడ్డాయని, ఈ ప్రాకృతంలోంచే ద్రవిడ భాషలు కూడా రూపొందాయని సూత్రీకరించుకున్నారు.

ఈ సూత్రీకరణల పర్వం ఇక్కడితో ఆగలేదు "and as a counterblast, some ardent patriots among Tamilians, with more enthusiasm than knowledge and commonsense, have declared that the Tamil of the Sangam literature is the primeval speech - the TAY -MOZHI or the great Mother Language, from which all other Languages of the World, including Sanskrit and the Languages of Europe have originated -" సంస్కృతవాదులకు వ్యతిరేకంగా కొందరు తమిళ భాషాభిమానులు అత్యుత్సాహంతో, సరయిన పరిజ్ఞానమూ సందర్భ శుద్ధీ లేకపోయినా, సంగమ సాహిత్యంలోని తమిళభాషే అత్యంత ప్రాచీనభాష అనీ, "తాయ్-మోజి" -, అన్ని భాషలకు తమిళమే తల్లి అనీ, తమిళంలోంచే ప్రపంచంలోని భాషలన్నీ, సంస్కృతంతో సహా యూరోపియన్ భాషలన్నీ పుట్టాయనీ ఘనంగా ప్రకటించుకున్నారు" అని వ్యాఖ్యానించారు - ద్రవిడియన్ (1) అనే వ్యాసంలో సునీత్‌కుమార్ ఛటర్జీ. అన్నామలై విశ్వవిద్యాలయంలో, 1963లో ఇచ్చిన మూడు ఉపన్యాసాలలో మొదటి ఉపన్యాసంలో ఆయన ఈ వ్యాఖ్యలు చేశారు.

"రాయి పుట్టి మన్ను పుట్టక ముందే పుట్టిన శ్రేష్టమైన తొలిభాష తమిళం" అని చెప్పుకొని తమిళ మేధావులు సామాన్య ప్రజల్ని భాషాభిమానం వైపు రెచ్చగొట్టి నడిపించారు. తొలి ద్రావిడ భాషలోంచి భారత దేశానికి వెలుపలే బ్రాహుయీ విడిపోయిందనీ, భారతదేశంలో మొదటగా "తెలుగు" విడివడిందనీ, ఆ తర్వాత తమిళం తదితర భాషలు రూపుకట్టుకున్నాయనీ ఒక వైపు భాషావేత్తలు ఘోషిస్తూవుండగా...క్రీ.శ. తొలి శతాబ్దాలనాటి బౌద్ధ సంఘారామాలకు సంబంధించిన తమిళ "సంగం" సాహిత్యంలోంచే ప్రపంచ భాషలు, ముఖ్యంగా సంస్కృతం,

ఇతర ఇండోయూరోపియన్ భాషలన్నీ పుట్టాయని భాషావేత్తల్ని సైతం నమ్మించ గలగడం విశేషమే!

తొలి ద్రవిడియన్లు దక్షిణభారతదేశంలో పుట్టి పెరిగినవాళ్లు కాదనీ, నైల్ నదీతీరం నుంచే వచ్చారని ఇప్పుడు ఎక్కువమంది శాస్త్రవేత్తలు భావిస్తున్నారు. వీళ్లు ద్రావిడులు ఎలా అయ్యారు - ? అంతకు మునుపు వీళ్లని ఏ పేరుతో పిలిచారు...?? అనేవి తేలని ప్రశ్నలే!

ద్రవిడియన్లు ఆఫ్ఘన్‌లోని బోలార్ పాస్ మీదుగా సింధులోకి క్రీ.పూ. 3,000 ఏళ్ల క్రితమే ప్రవేశించారని డేవిడ్ మెకల్పిన్ (1979) పేర్కొన్నాడు.

ఆర్యులు ఉత్తరాదిన వలస జీవులుగా సంచరిస్తున్న కాలానికి ద్రావిడులు దేశం అంతా విస్తరించి వ్యవసాయం, పశుపోషణతోపాటు వర్తకవాణిజ్యాలు నిర్వహించగలిగే స్థాయిలో వున్నారనికూడా ఆయన భావించాడు.

సింధు నగరాలకు పూర్వమే ఉత్తరభారతదేశంలో ద్రావిడుల ఉనికి వుందని డేవిడ్ మెకల్పిన్ (1979) లాంటి ద్రావిడ భాషా పరిశోధకులు గట్టిగానే వాదిస్తున్నారు.

ద్రవిడియన్ల మూలాల్ని వాళ్లు నివసించిన గ్రామనామాలు, వాళ్లు వినియోగించిన వస్తువుల పేర్లనుబట్టి తెలుసుకోగలగాలి. పల్లి, వల్లి, ఓలి, ఓలు అనే పేర్లు. గుజరాత్ లోనూ, మహారాష్ట్రలోనూ చాలా ఊళ్లపేర్లలో కన్పిస్తాయి. మైకెల్ విజ్జెల్ (1999) ఈ విషయాన్ని ప్రస్తావిస్తూ, ఇది ద్రావిడ సంస్కృతి ప్రభావానే జరిగిందన్నాడు.

ఇక్కడో సున్నితమైన అంశాన్ని చెప్పుకోవాలి- గుజరాత్ నుంచి నేరుగా మహారాష్ట్ర వరకూ పుష్కలంగా కన్పించిన ద్రావిడ ప్రభావం పంజాబ్-సింధు ప్రాంతాలలో దాదాపుగా కన్పించదు. కాబట్టి- సింధు నాగరికత ద్రావిడ నాగరికత కాకపోవచ్చు నని మరొక వాదన కూడా వుంది.

ఈ వాదనా ఆలోచించవలసినదే! ద్రావిడ భాషా ప్రభావం పూర్వ సంస్కృతం (వైదికభాష) పైనా, సంస్కృత భాషపైనా వున్నంతగా దేశంలో హిందీరాష్ట్రాల భాషలలో దేనిమీదా కన్పించకపోవడానికి వేదకాలంలోనే, ద్రావిడులు దక్షిణాదికి తరలివచ్చి స్థిరపడిపోవడం కారణం కావచ్చు.

దీన్నిబట్టి మనకు కొన్ని స్పష్టమైన ఆలోచనలు కలుగుతున్నాయి-

1. హిందీ రాష్ట్రాలలోని బీహారీ, బెంగాలీ, ఒరియా తదితర భాషలు సంస్కృత భాష ప్రభావాన అర్వాచీనంగా ఏర్పడ్డవి.

2. ద్రావిడులు-ఉత్తరాది ఆర్యుల మధ్య సంపర్కాలు సింధు నాగరికత (లేదా)

వేదయుగం నాటివి. కాబట్టి ద్రావిడభాషతో ఆదాన ప్రదానాలు వేదభాష వరకే పరిమితం అయ్యాయి. హిందీ భాషలతో ఆదానప్రదానాలు జరిగేందుకు అవకాశం తక్కువ.

3. ద్రావిడులు క్రీ.పూ. 3,000 ఏళ్లనాటికే భారతదేశం అంతా వ్యాపించారనే వాదనని తీసుకొని, ద్రావిడ అనేచోట "తమిళ" శబ్దాన్ని చేర్చి తమిళులు ప్రపంచం అంతా వ్యాపించి వున్నారని తమిళ చరిత్రకారులు అన్యాయంగా రాశారు.

4. ద్రవిడియన్ల స్థావరాలలోకి ఇండోఆర్యన్లు చొచ్చుకొచ్చినకొద్దీ వైదిక, పూర్వ ద్రావిడ భాషలమధ్య ఆదానప్రదానాలు ముమ్మరంగా సాగాయి. (Dravidian Loans appear only gradually in the next stages ie; when Indo Aryan culture penetrates Dravidian Territory)

5. భారతదేశంలో ఈ పూర్వద్రావిడ భాషలోంచి విడివడిన తొలిభాష తెలుగు! కాబట్టి, వైదిక ఆర్యులతో సహజీవనము, (లేదా) సమీప వర్తిత్వము నెరపిన ప్రజలు కచ్చితంగా తెలుగువారే అవుతారు. అందుకే, ఋగ్వేదభాషలో అనేక ద్రావిడ (తెలుగు) పదాలు కన్పించాయి- తెలుగులో అనేకానేక సంస్కృత పదాలూ చేరిపోయాయి!!

6. తెలుగులో వున్నన్ని సంస్కృత పదాలు తమిళ భాషలో లేవు. ఆ వున్న వాటిని కూడా బ్రాహ్మణ అంటే పిరమిణ అని తమిళీకరించుకొని, తమిళభాషపైన సంస్కృత ప్రభావం ఏమీలేదని నిరూపించే ప్రయత్నాలు చేశారు.

7. ఎన్ని ఎక్కువ సంస్కృత పదాలుంటే, సంస్కృత ప్రజలతో అంత ఎక్కువ సమీప వర్తిత్వం వున్నట్టుగా మనం అంగీకరించాలి. తెలుగుభాష ప్రాచీనతని ఈ ఒక్క అంశమే చాటిచెప్పగలదు!!

## ఈజిప్టుకి భారతీయ సంస్కృతిని ద్రావిడులే చేర్చారనే మరో నిరూపణ

ద్రావిడులు నైల్ నదీతీరం నుంచి వచ్చారనీ, వస్తూ అక్కడి సంస్కృతిని వెంటతెచ్చుకున్నారనీ ఈ వ్యాసంలో మనం చాలా చర్చచేశాం. కానీ, పీటర్ వాన్ బోలెన్(peter von Bohlen) అనే జర్మన్ ఇండాలజిస్టు (1796-1840) రెండువందల ఏళ్లక్రితమే ఈజిప్ట్-ఇండియాల మధ్య నడిచిన సంబంధాల గురించి విశేషమైన విశ్లేషణ చేస్తూ.... భారతదేశం నుంచే ఈజిప్ట్కు, సాంస్కృతిక సంపదచేరిందనీ, ఈజిప్ట్లో కన్పించేది మౌలికంగా ప్రాచీన భారతీయ సంస్కృతేననీ వాదించాడు.

"Ancient India with special reference to Egypt" అనే గ్రంథంలో ఈ విషయాలను ఆయన పేర్కొన్నాడు. ఒకసారి వాటిని కూడా పరిశీలిద్దాం:

1. మానవ శరీర శాస్త్రం (ఆంత్రపాలజీ) ప్రకారం ప్రాచీనకాలం నాటి ఈజిప్షియన్లు ఆఫ్రికన్లకన్నా ఆసియన్లకు ఎక్కువ దగ్గరగా కన్పిస్తున్నారు.

2. తొలినాటి ఈజిప్షియన్‌లు PUNT (పుంత) అనే దేశం నుంచి ఈజిప్ట్‌కి చేరినట్లు ఈజిప్ట్ పురాణగాథల్లో వుంది. ఈ "పుంత" భారతదేశంలో ఒక ప్రాంతం కావచ్చునా!

3. మానవ ముఖం సింహశరీరం ఆకారంలో "స్ఫింక్స్" బొమ్మ ఈజిప్ట్‌లో ప్రసిద్ధి. ఇది మన నరసింహ రూపానికి ఈజిప్షియన్ రూపం కావచ్చుకూడా!

4. నరసింహావతారానికీ, తెలుగు వారికి చాలా దగ్గరి సంబంధం వుంది. హిరణ్యకశ్యపుడు స్తంభాన్ని కొడితే, అందులోంచి నరసింహుడు అవతరించాడనేది మన కథ. స్తంభాన్ని దేవతగా పూజించే వారిపై శివభక్తుల దాడి ఇది. ఇక్కడ అసలు విషయం ఏమంటే, తెలుగువారు, ఈజిప్షియన్లు స్తంభాన్ని ఒక దేవతగా పూజించేవారే! ఖమ్మం, కంభం, కంభంపాడు లాంటి ఊళ్ల పేర్లు స్తంభం అనే అర్థంలో మనకి వున్నాయి.

5. తెలుగు నేలమీద నుంచి ఈ స్తంభ దేవతారాధన, అలాగే సింగడు (స్ఫింక్స్) రూపం ఈజిప్ట్‌కి చేరి వుంటాయి.

6. ఈజిప్ట్‌తో తెలుగువారి సంబంధాలు బౌద్ధుల కాలంలో విస్తృతమైనాయి. మౌర్యులకాలంలో మరింతగా పెరిగాయి. శాతవాహనుల కాలంలో ఇంకా ఆ ఊపు కొనసాగింది.

7. క్రీ.పూ. 285-246 లో ఈజిప్ట్‌ని పాలించిన టోలమీ-2 వరకూ ఈ సంబంధాలు వైభవోపేతంగా నడిచాయి.

8. క్రీ.శ. 78లో ప్లినీ, ఈజిప్ట్ ఇండియాల మధ్య సంబంధాలను ప్రస్తావించాడు. డయనైసస్ అనే రాయబారి బౌద్ధ ధర్మాన్ని స్వీకరించినట్లు అశోకుడి శాసనాల ద్వారా తెలుస్తోంది.

9. రోమ్ నాణాలపైన DIVI అనే అక్షరాలు కృష్ణా తీరంలోని దివి సీమనే సూచిస్తున్నాయని పండితుల విశ్లేషణ. క్రీ.శ. 1-2 శతాబ్దాల కాలంలో అలెగ్జాండ్రియా ఈజిప్ట్‌లలో భారతీయ పండితులు, వేదాంతులు తరచూ కన్పిస్తూ వుండేవారని చరిత్రకారులు పేర్కొన్నారు. నైలూ - కృష్ణ నదుల మధ్య దాకా విస్తరించిన సంస్కృతికి బోలెన్ గారి ఆలోచనలు అద్దంపడుతున్నాయి.

## యూరప్‌లోనూ దక్కను ద్రావిడుల ఉనికి

ఇండో యూరోపియన్ భాషలు మాట్లాడే వారంతా ఒకే జాతీయులు కానట్లే, ద్రావిడ భాషలు మాట్లాడే వాళ్లంతా కూడా ఒకే జాతీయులు కారు.

"ద్రవిడియన్" అనే మాట భాషాపరమైన కూటమిని సూచిస్తుందేగానీ, జాతిపరమైన కూటమికి అది సంకేతం కాదు.

మద్రాస్ విశ్వవిద్యాలయం ఆంథ్రపాలజీ విభాగం అధిపతిగా పనిచేసిన ఎల్. ఎ. కృష్ణ అయ్యర్ 1967లో "Kerala Megaliths and their Builders" అనే పరిశోధనా గ్రంథాన్ని వెలువరించాడు. అప్పట్లో మద్రాస్ విశ్వవిద్యాలయం దీన్ని ప్రకటించింది.

ఈ గ్రంథానికి ముందుమాట వ్రాస్తూ మార్టిమర్ వీలర్ పండితుడు ఒక ముఖ్యమైన వ్యాఖ్య చేశాడు - "పురావస్తు పరిశోధనలో దక్షిణ భారతదేశానికి సంబంధించి మూడు ముఖ్యమైన అంశాలు సమస్యాత్మకం అవుతున్నాయి. 1. భాష 2. జాతి 3. సంస్కృతి. నిజానికి ఈ మూడూ తికమక కల్గించే అంశాలే! అయితే, ఈ మూడింటి మధ్యా స్పష్టమైన తేడా వుంది.

**మొదటి అంశం భాష** : ద్రవిడియన్ అనే పదానికి 'ద్రావిడ భాష మాట్లాడే ప్రజ" అని అర్థం.

**రెండవ అంశం జాతి** : జాతిపరంగా ఈ ద్రవిడియన్లందరూ ఒకటి కాదు. జాతిపరమైన వ్యత్యాసం వీరి మధ్య చాలా వుంది.

**మూడవ అంశం సంస్కృతి** : చరిత్ర పూర్వయుగాల నుంచి చారిత్రకయుగం వరకూ శవాలకు జరిపే అంత్యక్రియల విషయంలో ఈ ద్రావిడులందరూ ఒకే విధానాన్ని పాటించలేదు. పెద్ద రాతి సమాధులు, రాక్షసగుళ్లు కట్టే విధానంలో తెలుగువారికి ఇతరులకూ చాలా తేడావుంది. ఎవరి విధానం వాళ్లదిగా కన్పిస్తుంది. వాటిని కట్టిన తీరులోనేకాదు, ఆ సమాధుల్లో వుంచిన వస్తు సరంజామాల్లోకూడా తేడా స్పష్టంగా కన్పిస్తుంది.

ద్రవిడియన్లందరినీ ఒకే జాతీయులుగానో, గ్రూపులుగానో, వర్గీకరించడానికి ఈ తికమక సమస్యాత్మకం అయ్యింది - "అని వివరించారు వీలర్ పండితుడు.

అందుకనే, చరిత్ర పరిశోధకులు ఈ పురావస్తు పరమైన అంశాల్ని ఎక్కడికక్కడ స్థానికంగా పరిశీలించడమే ఉత్తమం అనీ, మొత్తం ద్రవిడియన్లందరినీ ఒక జాతిగా పరిగణనలోకి తీసుకొని చూడడం వలన తికమకే మిగుల్తుందనీ భావించసాగారు.

మార్టిమర్ వీలర్ పండితుడిపేరు చెప్పగానే, బ్రహ్మగిరిలో రాతియుగంనాటి తెలుగువాడి ఉనికినీ తెలుగు ప్రజల సామాజిక జీవనాన్నీ ప్రపంచానికి చాటిన వాడుగా మనకు గుర్తుకొస్తాడు. "Pointed butt-axe culture" అని దీనికి ఆయన పేరుపెట్టాడు. ఆనాటి ప్రజల జీవన విధానాన్ని "బ్రహ్మగిరి సంస్కృతి" అని కూడా పిలిచాడాయన.

రాతియుగంలో మనిషి ఆటవిక జీవనంలోంచి కొంతమేర బయటకొచ్చి, నదీతీరం వెంబడి జీవించడం అలవాటుచేసుకొన్న కాలాన్ని "Paleolithic Age" అంటారు. దక్షిణభారత దేశంలోనూ, ఆఫ్రికాలోనూ, దక్షిణ ఇంగ్లండ్‌లోనూ ఈ "పాలియోలితిక్" కాలంనాటి మనిషి ఉపయోగించిన వస్తువుల తయారీ విధానం ఒకేలా వున్నదని ఆయన ప్రకటించారు. "....One can take almost without selections tools from South India, Africa and South England, which show identical Technique of manufacture and form -"

నదీ తీర జీవితాన్ని మధ్యరాతియుగం అనుకొన్నట్లయితే, అంతకుపూర్వం గుహలలో జీవించిన యుగాన్ని పాతరాతియుగం అనవచ్చు. కర్నూలులో బయటపడిన పాతరాతియుగపు గుహలు యూరప్‌లో బయటపడిన గుహల తరహాలో వున్నాయనికూడా కృష్ణ అయ్యర్‌గారు స్పష్టంగా చెప్పారు.

ఇదిచాలా సున్నితమైన అంశం. జాగ్రత్తగా పరిశీలించవలసిన అంశం కూడా!

**పాతరాతి యుగంలో తెలుగునేలమీద మనిషి యూరప్ తరహాలోనూ, మధ్యరాతియుగంలో ఆఫ్రికన్ తరహాలోనూ జీవించినట్లు మనకు చక్కగా అర్థం అవుతోంది. ఇందుకు కారణం ఏమై వుంటుంది? ఈ క్రింది విషయాలను ప్రశాంతంగా పరిశీలించండి:**

1. పాత రాతియుగంలో గుహజీవనం సాగిస్తున్నకాలంలో యూరప్ వైపునుంచి గుంపులుగా జనం ఇక్కడికి చేరివుండవచ్చు. మధ్యరాతి యుగాలలో నదీతీర సహజీవనం సాగిస్తున్నకాలంలో ఆఫ్రికన్ ప్రాంతాల నుంచి కూడా గుంపులుగా మనుషులు ఇక్కడికి చేరి వుంటారు. అందుకే, తెలుగుభాషలో అటు ఆఫ్రో ఆసియాటిక్ భాషాపదాలు, ఇటు ఇండోయూరోపియన్ భాషాపదాలు సమానంగా కన్పిస్తాయి.

2. గుహలలో నివసించే స్థితినుంచి మధ్యరాతియుగం చివరిలో గుడిసెలు వేసుకొని జీవించే స్థితికి చేరుకున్నారు. ఆహార సేకరణ దశనించి ఆహారాన్ని ఉత్పత్తి చేసుకొని వండుకొని తినే స్థితి కూడా ఏర్పడింది. నిప్పు రాజేయడం అంతకు

మునుపే తెలుసుకోగలిగినట్లు కర్నూలు గుహలో ఆధారాలు సాక్ష్యం ఇస్తున్నాయి. నిప్పుకోసం వాడిన చెకుముకిరాళ్లు కూడా కొన్ని అక్కడ దొరికాయట!

3. కొత్త రాతియుగంలో బలమైన రాళ్లతో పదునైన ఆయుధాలు తయారు చేసుకోవడం కోసం QUARTZITE పాలిష్ రాళ్లని వెదుక్కొంటూ ఆనాటి మనిషి నదులూ కొండల వెంబడీ తిరిగి వుంటాడని కృష్ణ అయ్యర్ భావించారు. ఆనాటి మనిషి aimless wanderer అనికూడా అన్నారాయన!

4. పెద్ద (లేదా) కొత్తరాతి యుగం అనగానే తెలుగునేలకు చారిత్రక ప్రాధాన్యత తెచ్చిన అసుర సమాధులు (రాక్షసగుళ్లు లేదా కైరన్లు - (Uruns and cairns) స్ఫురణకొస్తాయి. క్రీ.శ. 5వ శతాబ్దిదాకా పెద్దపెద్ద సమాధులు నిర్మించే అలవాటు ఇక్కడ కొనసాగింది. వ్యవసాయం, పశుపోషణ, స్థిరజీవితం, ఇనుముని కరిగించే సాంకేతిక పరిజ్ఞానం సాధించుకున్న మానవుడి సామాజిక వ్యవస్థ అది. రాతి కర్రు గలిగిన నాగలి స్థానంలో ఇనుపకర్రు బిగించ గలిగాడు. పలుగు-పారలు తయారు చేసుకోగలిగాడు. నల్ల పూసకు బెజ్జం వెయ్యగలిగాడు.

5. హైమన్ డార్ఫ్ Haimen dorf అనే పరిశోధకుడు పెద్ద రాతియుగంలో పెద్దరాతి సమాధులు నిర్మించిన వారెవరు? అనే ప్రశ్నకు వాళ్లు సమాధానంగా నిస్సందేహంగా ద్రావిడ భాషల మాతృకని మాట్లాడిన ప్రజలేనని, క్రీ.పూ. 1000 నాటి మానవులనీ ప్రకటించాడు.

ఈ సమాధుల్లో దొరికిన కుండలు ఇతరమట్టి పాత్రల్ని తయారుచేయడంలో నాణ్యమైన పనితనం కన్పిస్తోందని ఆయన పేర్కొన్నాడు. వీళ్లని మెడిటరేనియన్లతో మాత్రమే పోల్చి చూడగలమని ప్రకటించాడు.

6. ప్రముఖ భారతీయ చరిత్ర పరిశోధకులు సంకాలియా ఈ సందర్భంలో చెప్పిన అంశాలు చాలా ముఖ్యమైనవి :

**అ.** దక్షిణాదిలోని పెద్ద రాతి యుగానికి చెందిన ఒక గ్రూపు ప్రజలు పశ్చిమ యూరప్‌లో కూడా కన్పించారని ఆయన ప్రకటించాడు.

**ఆ.** పశ్చిమ యూరప్‌లో ఈ ప్రజలు నిర్మించిన పెద్దరాతి సమాధులు క్రీ.పూ. 2000 నాటివి కావచ్చు. అయితే వీటిలో ఇనుము లేదు.

**ఇ.** ఈ యూరోపియన్ పెద్ద రాతి సమాధులు దక్షిణభారత దేశం నుంచి వెళ్లిన వాళ్లు నిర్మించినవే కావచ్చు.

**ఈ.** 1954-56 లలో "నేవాసా"లో జరిపిన త్రవ్వకాలలో 3 అస్థిపంజరాలు

దొరికాయి- ఆ అస్థిపంజరాల స్వరూపం కచ్చితంగా దక్కన్‌లోని ఆనాటి తెలుగుప్రజల అస్థిపంజరాలను పోలివున్నాయి - అన్నారు సంకాలియా!

ఉ. ఇలా ఎందుకు జరిగింది? ఇక్కడివాళ్లు అక్కడికి ఎందుకు వెళ్లారు? ఎప్పుడు వెళ్లారు? అనే ప్రశ్నలకు సమాధానం వెదకాల్సిందే!

మొత్తంమీద దక్కన్‌లో నివసించిన ద్రవిడ ప్రజలు (తెలుగువారు) ప్రపంచం నలుమూలలా విస్తరించారనడానికి సంకాలియాగారు చెప్పిన ఈ అస్థిపంజరాల అంశం ముఖ్య సాక్ష్యంగా కనిపిస్తోంది.

ఎలియట్ స్మిత్ ప్రకారం క్రీ.పూ. 5,000 నుంచి 4,000 వేల ఏళ్ల క్రితమే రాతి సమాధుల నిర్మాణాన్ని ఈజిప్షియన్లు ప్రారంభించారు. కాబట్టి క్రీ.పూ. 3,000 కన్న ముందే నైలు నుంచి కృష్ణదాకా చేరుకున్న ఈజిప్షియన్లు పెద్దరాతి సమాధులు నిర్మించే తమ అలవాటుని ఈ నేలమీద కూడా కొనసాగించారు. కేవలం ఆ అలవాటు మాత్రమే సాంస్కృతికంగా ఇక్కడికి చేరింది కాదనీ, ఆ ప్రజలే ఇక్కడకు చేరుకున్నారనీ కూడా అర్థం అవుతోంది.

దక్షిణభారత దేశంలో పెద్దరాతి సమాధులకు కనీసం 500 నుంచి 700 ఏళ్లకు మునుపు ఈజిప్ట్‌లో అలాంటి సమాధులు కన్పించాయని బి.బి.లాల్ పేర్కొన్నారు. అంటే, నైలు నుంచి కృష్ణకు చేరడానికి కనీసం 700 ఏళ్లకాలం పట్టి వుంటుందని మనం ఊహించవచ్చు.

ఈ విశేషాలన్నీ ద్రవిడియన్ల మెడిటరేనియన్ మూలాల్ని, భారతదేశంలోకి వాళ్ల రాకనీ, దక్కన్ భూభాగంలో వాళ్ల స్థిర నివాసాన్ని మనకు స్పష్టీకరిస్తున్నాయి.

ఆఫ్రికన్ భాషలతో తెలుగు భాషకు సంబంధాల్ని విశ్లేషించ గల్గినప్పుడు భాషాపరంగా పెనవేసుకున్న బంధాలు కూడా వెలుగులోకి వస్తాయి.

అన్నింటికన్న ముఖ్యం - తెలుగు ప్రజల ప్రాచీనతని తెలుగు భాష ప్రాచీనతని, తెలుగు నాగరకత ప్రాచీనతని నిరూపించడానికి భాషావేత్తలు, పురావస్తు శాస్త్రవేత్తలు, మానవ శరీర నిర్మాణ శాస్త్రవేత్తలు ముగ్గురూ జాత్యభిమానంతోనూ, భాషాభిమానంతోనూ ఆత్మాభిమానంతోనూ కలిసికూర్చొని పరిశోధనలు జరిపితేనే వాస్తవాలు వెలుగులోకి వస్తాయి.



# 2

# తెలుగులో చక్కని ఆఫ్రో ఆసియాటిక్ పదరూపాలు

## ఇలమైట్, ఆఫ్రికన్ భాషలలో తెలుగు మూలాలు

**ఆఫ్రికా** ఖండం తూర్పుతీరంలోని టాంజానియా, మొజాంబిక్ దేశాలలో ప్రజలు 'మకొండె' అనే భాషని మాట్లాడతారు. ఇది బంటూ భాషా కుటుంబానికి చెందిన భాష. ఈ భాషలో 'కుంగున్యాల' అనే పదానికి కుంగిపోవడం అని అర్థం.

కుంగు, క్రుంగు అనే తెలుగు పదాలకు ఏ అర్థం వున్నదో ఆఫ్రికన్ 'కుంగున్యాల'లో 'కుంగు' క్కూడా అదే అర్థం వుంది.

1952-53 సంవత్సరాలలో టాంజానియా, ఉగాండాలలో కీళ్ళనొప్పులతో కూడిన జ్వరం, తీవ్రమైన నడుమునొప్పి ఏర్పడి రోగి కుంగిపోయే పరిస్థితిని తెచ్చిన వ్యాధిని మొదటిసారిగా కనుగొన్నారు. కుంగుండే జబ్బు ఇదని ఆఫ్రికన్ ప్రజలు చెప్పుకున్నారు.

కుంగున్యాల (కుంగుండటం) అనే లక్షణం ప్రధానంగా వుంది కాబట్టి, ఈ పదానికి ముందు 'చి'ని చేర్చి ఆ వ్యాధికి 'చికుంగున్యా' అనే పేరుపెట్టారు. 'చి' అంటే 'గొప్ప' అని! "చికుంగున్యా" అంటే గొప్పగా కుంగిపోవడం అని అర్థం. 1955లో 'లుంస్డెన్స్' అనే వైద్య పరిశోధకుడు ఆఫ్రికాలో ఈ వ్యాధి పైన పరిశోధనచేసి అందించిన రిపోర్టులో మొదటిసారిగా 'చికుంగున్యా' అనే వ్యాధి పేరుని సూచించాడు. దీన్ని ఇంగ్లీషు వాళ్ళు 'చిక్' వ్యాధి అని పిలిస్తే, తెలుగు పత్రికలవాళ్ళు గున్యా వ్యాధి, గన్యా వ్యాధి అని ఇష్టం వచ్చినట్లు రాశారు.

ఇంతకీ, 'కుంగు' అనే తెలుగుపదం, కుంగు అనే ఆఫ్రికన్ పదం ఒకే అర్థంలో వుండటం కాకతాళీయమేనా అనేది ప్రశ్న! భాషావేత్తల తాజా పరిశోధనలు ఇది చారిత్రక సంబంధం అంటున్నాయి.

ఆఫ్రికా భాషల ప్రాచీనతని అధ్యయనం చేస్తున్నకొద్దీ మూలద్రావిడ భాషాపదాలు తెలుగుభాషకు దగ్గరగా వున్నవి ఇలా అనేకం కన్పించసాగాయి. అంతేకాదు, ఇలమైట్ సుమేరియన్, అక్కాడియన్ శిలాశాసనాలలోని అక్షరాలు (Cuneiform Scripts) చదవడానికి ఈ ఆఫ్రికన్ భాషల అధ్యయనం ఎంతగానో తోడ్పడసాగింది. ఇది అత్యంత తాజా సమాచారం భాషాచారిత్రకపరంగా !!

## ఆఫ్రో ఆసియాటిక్ భాషా కుటుంబ భావన ఇలా కలిగింది

రెండు జాతుల మధ్య సంఘర్షణలు జరిగినప్పుడు గెలిచిన వారికి ఓడినవారు బానిసలౌతారు. ఈ బానిస స్త్రీల ద్వారా గెలిచినవారు సంతానాన్ని కంటారు. అలా కొత్తతరం తయారౌతుంది. దానికి ఆ రెండు జాతుల సంలీన లక్షణాలూ వుంటాయి. రెండుజాతుల ఆచారాలు, సంస్కృతులతోపాటు, భాషాపదాలు కూడా కలగలిసి వుంటాయి.

ఇలా అనేక పర్యాయాలు జరిగిన సంలీనాలే చరిత్ర నిర్మాణానికి ప్రధాన అంశాలు. జాతుల మధ్య సంఘర్షణలు - సంలీనాల చక్రభ్రమణమే మానవ చరిత్ర. ఇలా వేర్వేరు జాతుల మధ్య సంలీనాలు జరగకపోతే మానవజాతి ఏనాడో నశించిపోయి వుండేది. అందుకనే చరిత్ర నిర్మాణానికి సంఘర్షణల కన్నా సంలీనాలే ముఖ్యం.

ప్రాచీన ఇరాన్‌కు చెందిన ఇలమైట్స్, ఇరాక్‌కు చెందిన అక్కాడియన్లు, ఆఫ్రికాకు చెందిన మండింగ్ జాతులు, మధ్యధరా సముద్ర ప్రాంతానికి చెందిన సుమేరియన్లు ప్రస్తుతం దక్షిణ భారతదేశంలో ఎక్కువగా నివసిస్తున్న ద్రావిడ ప్రజలు... వీళ్ళ మధ్య ఒకనాడు సంలీనాలే వున్నాయనీ, వీళ్ళందరికీ మూలజాతి ఒకటే కావచ్చనీ, బహుశా అది మూలసహారా జాతి కావచ్చనీ (Proto Sahara origin) పండితుల భావన. క్రీ.పూ. 2700 నుంచీ 539 వరకూ ఇలమైట్ నాగరకత నడిచింది. దానికి ముందు వున్న కాలాన్ని ప్రోటో ఇలమైట్ యుగం అంటారు. ఈ కాలంలోనే సంఘర్షణలు - సంలీనాల పర్వం జరిగి వుంటుంది.

సముద్రం మీద విస్తారంగా వాణిజ్య కార్యకలాపాలు నిర్వహించిన కుషైట్స్ ఈ భూమండలం అంతా విస్తరించిన ప్రాచీన ప్రజలనీ, వీళ్ళు 7 వేల సంవత్సరాలు పాలించారనీ, వివిధ జాతుల పురాణకథల్లో వీళ్ళ గురించి ప్రస్తావన కన్పిస్తుంది. వీళ్ళ కశి, కుష్, కిష్ పదాలు మన పురాణాలలో కూడా వున్నాయి. కాశ్మీర్, హిందూకుష్, కిష్కింధ, పేర్లన్నీ ఈ కుషైట్స్ వలన మనకు ఏర్పడ్డవే! వీళ్ళ నివాస స్థానం కుశద్వీపం అని మత్స్య పురాణం చెప్తోంది. కుషాణులు వీళ్ళే!!

చైనాలో K - San అనే ప్రాచీన నగరం వుంది. టిబెట్ 'కు-షి' నగరం కూడా ప్రాచీనమే!

ఈనాటి ప్రాదేశిక భౌగోళిక విభజన ఏదీ లేని ఆరోజుల్లో జాతులు విస్తరించుకుంటూ వెళ్ళాయి... అంతేగానీ, ఆ దేశపు వారు, ఆ జాతివారు ఈ దేశం మీదకో, ఈ జాతి మీదకో దాడిచేసి వచ్చి తమ సంస్కృతిని, తమ భాషనీ బలవంతంగా రుద్దారని చెప్పడం సరికాదు. 'ఆర్యులదాడి' సిద్ధాంతం ఇలాంటి మోసపూరితమైనదే! దాన్ని నమ్మి మనం ఇతర కులాలపట్ల ద్వేషాన్ని పెంచుకోనవసరం లేదు.

ఈ వక్రభాష్యాన్ని మొదట చెప్పింది బ్రిటిష్ చరిత్రకారులే! ఆ తర్వాతికాలంలో ఎన్నో కొత్త చారిత్రక సత్యాలు వెలుగుచూస్తున్నా, కాలం చెల్లిన ఆ సిద్ధాంతాన్నే పట్టుకుని మనం వేళ్ళాడుతున్నాం.

ఉదాహరణకి ఇలమైట్ భాషకు సంబంధించిన అనేక వివరాలు వెలుగులోకి వచ్చిన తర్వాత ఈ భాషని ఏ భాషా కుటుంబంలో చేర్చాలో తేలనప్పుడు, David 'W' McAlPin 1974లో ద్రావిడ భాషతో దీనికి గల దగ్గర సంబంధాలరీత్యా ప్రోటో ఇలమో ద్రావిడియన్ భాషా కుటుంబం 'PED' పేరును అనే ప్రతిపాదించి అందులో చేర్చాలన్నాడు. Diakunoff 1979 ఈ సిద్ధాంతానికి మెరుగులు పెట్టాడు. కానీ భాషావేత్తలు ఈ సిద్ధాంతాన్ని పట్టించుకోలేదు.

1992లో VACLAV BLAZEK మరో అడుగు ముందుకు వెళ్ళి ఆఫ్రికన్ భాషాపదాలు కూడా వీటికి దగ్గరగా కన్పిస్తున్నాయి కాబట్టి "ఆఫ్రో ఆసియాటిక్ భాషాకుటుంబం" అని పిలిస్తే బాగుంటుందని సూచించాడు. ప్రస్తుతం భాషా చారిత్రక పరిశోధనా రంగంలో ఈ ఆఫ్రో ఆసియాటిక్ భాషా కుటుంబ భావన రాజ్యం ఏలుతోంది.

## ఇలమైట్, ఆఫ్రికన్ భాషలలో తెలుగుమూలాలు

ద్రావిడ, ఇలమ్, మండింగ్ భాషలలో అచ్చులు హల్లుల ప్రయోగం ఇంచు మించుగా ఒకటిగానే వుంటాయి. అలాగే, బహువచన ప్రత్యయాలు కూడా ఈ మూడుభాషల్లో సమానంగా కన్పిస్తాయి.

ఇలమ్ = వ్ (వు)

తెలుగు = లు

మండింగ్ భాషలో 'మొగో' అంటే మొగుడు (మగాడు) దీనికి 'లు' చేరిస్తే మొగోలు = మగాళ్ళు.

అలాగే, వ్యతిరేక పదాలకోసం 'న్' వాడకం ఎక్కువ. 'ను' 'ల' కూడా వ్యతిరేక పదాల కోసం వాడటం వుంది.

ఇలమైట్ - ఇన్ - ర్ = ఇతడు కాడు

అన్ - ఇ = అది కాదు

ను - జు = తెలుసుకోకపోవడం

ను - డుగ్ = మంచిది కాదు

ఇలమైట్ భాషలో నామవాచకానికి 'ర' ప్రత్యయం చేరుస్తారు. 'కిన్నెర' అని మనం తెలుగులో అన్నట్టు.

కెల్లిర = సైన్యాధికారి

కుటీర = మోసేవాడు (బానిస)

కివార = వార్తాహరుడు

ఆఫ్రికన్ మండింగ్ భాషలో కూడా 'ర' ప్రత్యయం ప్రముఖంగా కన్పిస్తుంది. 'తౌన్-ర' అంటే తౌన్ రాజు 'Lord of Ton' అని !

ఇలాంటిదే ఇంకో ఉదాహరణ - 'తు' ప్రత్యయాన్ని పరిశీలించండి.....

మండింగ్ భాషలో తెగి = కోయు To cut. దీనికి 'తు' చేరిస్తే 'తెగి-తు' = cutting. ఇది 'తెగుతూ' అనే తెలుగు పదానికి దగ్గర పదమే కదా!

కోయు + తు = కోస్తూ

చేయు + తు = చేస్తూ

ఇలా మనం తెలుగులో అన్నట్లే ఆఫ్రికన్లు కూడా 'తు' శబ్దాన్ని ఉపయోగిస్తారు.

మరో ముఖ్యమైన ఉదాహరణని గమనించండి:

ఇలమైట్ భాషలో - 'క' చేరిస్తే రాక, పోకలా గానే ఎన్నో పదాలు ఏర్పడతాయి.

హుల్ట + క = Done

తురు + క = Said

ఇలాగే మండింగ్ భాషలో కూడా 'క' ప్రత్యయంతో పదాలున్నాయి.

నయ్ని (*nyini*) = To look (చూడటం)

నయ్ని + క = Interrogation (ప్రశ్నించడం)

సందర్భవశాత్తూ ఒక్క మాట -. 'నై' అనే సంస్కృత ధాతువుకు పర్యవేక్షకుడనే అర్థం వుంది. 'నాయకుడు' పదానికి నైక అనే ఆఫ్రికన్ పదం మూలంగా కన్పిస్తోంది.

వలె (లేదా) వలయు అంటే, తెలుగులో 'అవసరం' (necessary) అని అర్థం కదా! దీనికి 'కా' ఉపసర్గ చేరినప్పుడు కావలె, కావలయు (It is necessary) అవుతుంది. రావలె, పోవలె, ఈవలె, తేవలె ఇలా... ఆఫ్రికన్లకు కూడా 'కా' ఉపసర్గగా చేర్చిన పదాలున్నాయి.

'కా - న్వే' = It's good

'క', 'గ' లు 'to be' అనే అర్థంలో మండింగ్ భాషలో కన్పిస్తాయి 'అగు' అనే మాటని 'to be' అనే అర్థంలోనే తెలుగులో కూడా వాడుతున్నాం.

ఇలాంటి అద్భుత భాషా శాస్త్ర రహస్యాల్ని వెలికి తెచ్చింది డేవిడ్ మెకాల్పిన్, వక్లావ్ బ్లాజక్. ఒకరు ఇలమ్ భాషతో ద్రావిడ భాషకు గల సంబంధాన్ని విశ్లేషిస్తే, రెండవ వారు ఆఫ్రికన్ భాషలతో ద్రావిడ భాషకు సంబంధాన్ని ఎత్తి చూపించారు.

ఈ ఇద్దరి పరిశోధనల్నీ కలగలిపి ఆఫ్రో ఆసియాటిక్ భాషాకుటుంబ సిద్ధాంతం వ్యాప్తిలోకి వచ్చింది.

ప్రాచీన ఇలమ్, ప్రాచీన మండింగ్ పదరూపాలలో తెలుగు భాషకు దగ్గరగా వున్న కొన్నింటిని ప్రత్యేకంగా ఏరి ఇక్కడ పొందుపరుస్తున్నాను, పరిశీలించండి!

| ఇంగ్లీషు | ఇలమ్ (పర్షియన్) | మండింగ్ (ఆఫ్రికన్) | ద్రావిడ (తెలుగు) |
|---|---|---|---|
| Male | ము | మొకొ, మొగొ | మగ |
| Lord | మనుస్ | మన్సా | మన్నన్ |
| Father | పాప్ | పా | అప్ప |
| Eye | ఇని (ఇగి) | ఎన్ (అక్కి) | కాన్(కన్ను) |
| Slavery | కుర్ (కుటీర) | కుర్కుర్ | కుటిర్ (నీళ్ళుమోసే పనిమనిషి) బానిస/ కురకుర తక్కువస్థాయి గలది) |
| Road | సిల | సీల | సిలము (రాతికి సంబంధించినది) |
| Top | - | కున్ | కొన |
| One | - | డొ | ఒండు |
| Four | - | నాని | నలు (నాలుగుకు ఆదేశముగా వచ్చే రూపము) |
| Mud | - | బొరొ, బురు | బురద |
| to give | లి | డి | ఇడి, ఇడు |
| Stone | - | కులు | కల్లు |
| elder | - | మామే | మామ |
| liver | - | కురా | కార్జ్యము, కారజం |
| hand | - | కొరొ | క - ర (కరము) |
| iron | - | నుము | ఇనుము |
| Seed | గెన్ | గె | గింజ |
| to watch | పర | ఫెరెకె | పర (కంటిపార) |
| death | సాహ్రి | సా | సావు |

ఈ నిరూపణలన్నీ ఆనాటి మూలద్రావిడ భాష మన తెలుగుకు దగ్గరగా వుండేదని గట్టిగా నమ్మడానికి తోడ్పడుతున్నాయి.

లోతుల్లోకి వెళ్ళేకొద్దీ ఇంకా ఆశ్చర్యకర విశేషాలు కన్పిస్తున్నాయి. ఈ వివరాలు పరిశీలించండి:

**'కు రా అక్'** అంటే, ఇలమైట్ భాషలో కాల్చు (burn) అని! 'లి మాక్ కు రా అక్ ప అట్ పు ఉప్ ర అప్ ప అక్ న' అనే ఒక పెద్దవాక్యం అక్కడి పురావస్తు తవ్వకాలలో దొరికిన క్యూనిఫామ్ లిపిలో కన్పించింది. దీని అర్థం 'the enemies should be burnt, seared at my feet be hound' అని.

సరిగ్గా ఇదే అర్థంలో 'కూరాకు చేయడం' అనే పదం తెలుగులో కూడా కన్పిస్తోంది - 'పులుల జట్టలు చీరి దుప్పులను వేళ్ళ నే కలమ్ముల గ్రుమ్మి కూరాకుసేసి -' అని సారంగధరలో ఒక ప్రయోగం వుంది. కూరాకై ఉడకడం అంటే కుతకుతలాడిపోవడం. కూరాకు చెయ్యడం అంటే చంపుకు తినడం! శత్రునిర్మూలన!

ఇలమైట్‌భాషలో కూడా 'కు రా అక్' అంటే వండటం, కాల్చడం అనే! 'కురాఅమ్‌కు' అంటే పెద్ద గాడిపొయ్యి (furnace) . కురా అంటే కాల్చడం. 'కూర' అనే తెలుగు పదానికి, మూలం ఇక్కడ కన్పిస్తోంది. కాల్చి వండేది కూర కావచ్చు.

కూరని మొదట కాల్చుకుతిన్నారు.

తర్వాత వండుకు తిన్నారు.

ఇదిగో, ఇప్పుడు నూనెలో వేసి వేపుకు తింటున్నాము.

Proto Uralic భాషల్లో korpe అంటే, కాల్చడం (To burn). Proto Semetic భాషల్లో 'kawr' అంటే పెద్ద పొయ్యి.

కూర అనే తెలుగు పదం వెనక ఇంత కథనీ మనం వెలికి తీసి చూడాలి. తమిళంలో 'కరి' వుందిగానీ, 'కూర' లేదు.

ఈ నిరూపణ ఒక్కటి చాలు.. తమిళంకన్నా తెలుగే ప్రాచీనం అనీ, దాని మూలాలు ఇలమైట్, ఆఫ్రికన్ భాషల్లో వున్నాయని, చాటి చెప్పడానికి.

విదేశీ పరిశోధకులు లోతుగా తెలుగు పదాలను అర్థం చేసుకునేందుకు కావలసిన 'తెలుగు లెక్సికన్' లేదు కాబట్టి, తెలుగుభాషావేత్తలు నిజాయితీతో పూనుకొని ఈజిప్షియన్, అక్కాడియన్, సుమేరియన్, సింధునాగరకతల కాలంనాటి భాషల్లో తెలుగు మూలాలను వెదికే ప్రయత్నం చేయాలని నా విజ్ఞాపన. ఆమేరకు ఒక ఆలోచన రేకెత్తించడం కోసం భాషాసేవకుడిగా ఇది నా ప్రయత్నం!



# 3

# నైలు నుంచి కృష్ణదాకా...

## తెలుగుతో పెనవేసుకున్న భాషాబంధాలు - అధ్యయనాంశాలు

**భారతదేశంలో** ఇప్పుడు మాట్లాడుతున్న భాషల మూలాలు ఎప్పుడో ఒకప్పుడు ఏదో ఒక విదేశంలో రూపుదిద్దు కున్నవేనని బెర్నార్డ్ సార్జెంట్ అనే పండితుడు గట్టిగా వాదిస్తున్నాడు.

మధ్య భారత దేశంలోనూ, దక్షిణ భారతదేశంలోనూ ప్రజలు నూరుపాళ్లూ భారతీయులుగానే కన్పిస్తారు. అత్యంత ప్రాచీన కాలంలోనే వాళ్లు ఇక్కడ ఆవిర్భవించినట్లుగా తెలుస్తోంది. కానీ, వాళ్లు మాట్లాడుతున్న భాషల మాతృకలు మరెక్కడో ఏ నైలునది పరిసరాలలోనో మధ్యధరా సముద్రతీరంలోనో ఆవిర్భవించి వుండవచ్చునంటాడాయన.

భారతదేశంలో ప్రాచీన భాషా కుటుంబాలైన 1. ఆస్ట్రో ఆసియాటిక్, 2. ఇండో ఆర్యన్, 3. ద్రావిడ భాషా కుటుంబాలు మూడింటికీ ఇది వర్తిస్తుందని బెర్నార్డ్ సార్జెంట్ గారి భావన.

ఈ భాషల్లో అతిపురాతనమైనది ఆస్ట్రో ఆసియాటిక్ భాషా కుటుంబం. "ముండా" భాష ఇందులో ముఖ్యమైంది. మధ్యభారత దేశం నుంచి వియత్నాం వరకూ ఈ భాషా కుటుంబానికి చెందిన భాషలు ఒక దశలో వ్యాపించి వున్నాయని చెప్తారు.

ఎఫ్.బి.జె. క్వీపర్ (F.B.J. KUIPER) అనే పరిశోధకుడు మయూర, గజ, కార్పాస లాంటి కనీసం 300 పదాలు ముండా భాషలోంచే వేద భాషలోకి చేరినట్లు గుర్తించాడు.

అలాగే, సూడాన్ నుంచి సెనెగల్ దాకా విస్తరించిన సాహెల్ తీరం మొత్తంలో, అంటే, ఆఫ్రికాలోని ప్రధాన భూభాగంలో ద్రావిడ భాషారూపాలు అనేకం కన్పిస్తున్నాయని అత్యంత తాజాగా పరిశోధకులు భావిస్తున్నారు. ప్రోటో ఆఫ్రో ఆసియాటిక్ భాషా కుటుంబంలోంచి ఏర్పడిన అనేక భాషల్ని ఇక్కడి ప్రజలు మాట్లాడుతున్నారు. ఈ ప్రోటో ఆఫ్రో ఆసియాటిక్ మాతృకలోనే ఎన్నో పూర్వ ద్రావిడ రూపాల్ని గమనించారు.

దీని అర్థం, ప్రోటో ఆఫ్రో ఆసియాటిక్ భాషా మాతృకకు చెందిన ప్రజలతో పూర్వద్రావిడులకు సంబంధాలున్నాయనే!

బెర్నార్డ్ సార్జెంట్ ఇలా అంటాడు. "...at the dawn of the Neolithic revolution (start of Agriculture, 10,000 years ago), the Dravidians left Sudan, one band splitting off in Iran to head North to the Urals, the others entering India and moving South" కొత్తరాతి యుగం అనేక విప్లవాత్మక పరిణామాలకు కారణమైంది. వ్యవసాయం ప్రారంభ దశ అది. షుమారు 10 వేల ఏళ్ల నాటి సంగతి! ఈ దశలో ద్రవిడియన్లు సూడాన్ నుంచి బయల్దేరి ఇరాన్ చేరుకున్నారు. అక్కడ ఒక బృందం ఉత్తర దిశగా ఉరల్స్ పర్వతశ్రేణులవైపు వెళ్ళింది. రెండో బృందం ఇండియాని చేరి, ఇండియాలో దక్షిణ దిశగా వచ్చింది - అని బెర్నార్డ్ సార్జెంట్ ఒక ఊహాత్మక ప్రతిపాదన చేశాడు.

నైలూనది నుంచి కృష్ణా తీరం దాకా రమారమి ఆరు వేల సంవత్సరాల కాలంలో వీరు నడిచిన ప్రాంతాలలో వ్యాప్తిలో వున్న అన్ని భాషలలోనూ ద్రావిడ భాషా రూపాలు కన్పిస్తాయి. ద్రావిడో ఆఫ్రికన్, ద్రావిడో ఉరలిక్ భాషా బంధాల గురించి పరిశోధనలు ముమ్మరంగా సాగుతున్నాయి. ఈ ఎనిమిదేళ్ల కాలంలో ఈ పరిశోధనలు కొత్త పుంతలు తొక్కుతున్నాయి కూడా!

తొలి ద్రావిడులు మొదట సింధు - గుజరాత్‌లలో స్థిర నివాసాలు ఏర్పరచుకున్నారు. -' సింధు - సరస్వతీ నాగరికత' అని దాన్ని పిలవ వచ్చునని, అక్కడ అనేక జాతులతో - తొలి ద్రావిడులు సంలీనం చెంది వుంటారని, ఆ

అందరి సమష్టి కృషి ఫలితమే, కాలగమనంలో హరప్పా నాగరకతగా రూపొందిందనీ, ఇండో ఇరానియన్లు (లేదా) ఇండో ఆర్యన్లు అక్కడ ద్రవిడియన్లతో కలిపి సహజీవనం చేశారని బెర్నార్డ్ సార్జెంట్ విశ్లేషణ చేశాడు - ఆయన రాసిన "Genese de Inde" అనే గ్రంథం ఆధారంగా అనేక మంది పరిశోధకులు ఇప్పుడు ఈ సిద్ధాంతాన్ని నమ్మకమైందిగా పరిగణిస్తున్నారు.

బెర్నార్డ్ సార్జెంట్ అంటాడు - the early Dravidians can be equated with the Southern Neolithic of 2500-1600 BC. Their round Huts with wooden frame work are the direct precursors of contemporary rural Dravidian housing-" అని! డెక్కన్ భూభాగంలో తొలి ద్రవిడియన్లు క్రీ.పూ. 2500 - 1600 మధ్యకాలంలో నివసించి వుంటారనేది ఆయన అభిప్రాయం. ఆ కాలంనాటి 'చుట్టు గుడిసెలు' 'చెక్క తలుపులు', ఈనాటి సగటు తెలుగు గ్రామీణ వాతావరణానికి అద్దంపట్టేవిగా వున్నాయి.

ఆఫ్రో ఆసియాటిక్ భాషా కుటుంబం ద్రావిడ భాష మాతృకతో ముడిపడిందనే ఆలోచన భాషావేత్తలలోనూ, చరిత్ర పరిశోధకులలోనూ అనేక సంచలనాత్మక భావావేశాలకు కారణం అయ్యింది.

నిజానికి, ప్రాచీన కాలం నాటి జాతుల మధ్య సంబంధాన్ని నిర్ధారించాలంటే 'కుండలు' లేదా ఆహార ధాన్యాలకు సంబంధించిన పేర్లలో సామీప్యత కన్పించడం ఒక ముఖ్య అంశం. 'కుండ' (లేదా) 'కడవ'కు వివిధ ఆఫ్రో ఆసియాటిక్ భాషల్లో వున్న పేర్లు గమనించండి -

**Proto Afro - Asiatic :** Kud/Kod = Vessel, pot

**Proto Semitic :** Kadah = Vessel

**Arabic :** Kadah = drinking bowl, cup, goblet, glass, tumbler

**Sabalanm :** Kdh = Cup

**Ethiopic :** Kadho = Vessel, gourd

**Lowland cushitic :** kadad = Vessel

**Oromo :** Kodaa = Vessel gourd

**Egyptian :** Qd = Pot

**East cushitic :** Kod = receptical

ఈ "ఆఫ్రో ఆసియాటిక్" భాషలలో 'కుండ' (లేదా) 'కడవ'కు కడ, కడా, కఢో, కొడా ....ఇలా రూప సామీప్యత కన్పిస్తుంది. తెలుగులో 'కడవ' అంటే నీటిని తెచ్చేకుండ. తమిళంలో 'కడవ' అంటే కడిమిచెట్టు అనే అర్థమేవుంది. "నీళ్లకుండ" అని లేదు.

పూర్వ తెలుగు (ప్రోటో తెలుగు) భాష మాట్లాడిన వారితో ప్రోటో ఆఫ్రో ఆసియాటిక్ భాషలు మాట్లాడిన ప్రజలకు నేరుగా సత్సంబంధాలు నడిచాయని ఊహించడానికి ఈ "కడవ" ప్రబల సాక్ష్యం!

పరిశోధకులు ఆఫ్రో ఆసియాటిక్ పూర్వ మాతృకల్ని పునర్నిర్మించే ప్రయత్నాలు చాలా చేశారు. ఏ భాషకైనా, దాని పూర్వ రూపాన్ని ఊహమీద తిరిగికట్టవలసిందే! అలా కట్టిన ప్రోటో ఆఫ్రో ఆసియాటిక్ పదాలు షుమారుగా 2800 వరకూ వున్నాయి. వాటి ఇంగ్లీషు అర్థాలతోపాటు, ఇతర ఆఫ్రో ఆసియాటిక్ భాషారూపాలలో ఈ పదం ఎలా కన్పిస్తుందో వివరంగా చూపించ గలుగుతున్నారు.

ఆయా పదాల్ని పరిశీలిస్తే తెలుగు భాషలో సజీవంగాఉండి, ఈనాటికీ మన మాటల్లో దొర్లుతున్నవి ఎన్నో కన్పిస్తున్నాయి. మరీ లోతుల్లోకి పోకుండా, పైపైన చూస్తేనే తెలిసిపోతున్న పదాలు కొన్నింటిని ఇక్కడ అందిస్తున్నాను. - విజ్ఞులైన వారిని, ఈ సామీప్యతని పరిశీలించవలసిందిగా కోరుతున్నాను. పరిశీలించబోయే ముందు ఒక విజ్ఞప్తి.

1. ఈనాటి ఆఫ్రికన్లతో తెలుగువారికి రక్తసంబంధమో, జన్యు సంబంధమో ఉందని నేను ప్రతిపాదించడం లేదు. పూర్వపు ఆఫ్రికన్లకు పూర్వ ద్రావిడులతో గల సంబంధాలను ప్రత్యేకంగా అధ్యయనం చేయాలని కోరుకొంటున్నాను.

2. తెలుగు భాషలో ఆఫ్రికన్ పదాలు గాని, లేదా ఆఫ్రికన్‌భాషల్లో తెలుగుపదాలు గానీ అక్కడా ఇక్కడా ఒకేఅర్థంలో, ఒకేరూపంలో వున్నవాటిని గుర్తించడం మొదట జరగాలి. ఈ సామీప్యత ఎలా సాధ్యమయ్యిందో విశ్లేషించడమూ జరగాలి.

3. తెలుగు నాగరకత ప్రాచీనతని అన్వేషించడానికి తెలుగు వారైన ప్రతి ఒక్కరికీ అవకాశం వుంది. ఎవరు ఏ చిన్న విషయాన్ని బయటకు తెచ్చినా అది అపురూపమైన చారిత్రక సంపద అవుతుంది. అందుకని ఈ చారిత్రక సత్యాలు ప్రజాపరం కావాలని కోరుకొంటున్నాను.

1. ప్రోటో - ఆఫ్రో ఆసియాటిక్ :

Buka / Bunka = knee, to bend, bow, elbow,

**తెలుగు** : పోక (పోవుట, గమనము, నడత, నడక)

**Proto Bantu :** Bonggo = bend down

**Proto Mongolian :** Boke = bend

**Proto Australian (aboriginal) :** Pungku = knee

**Papuan:** Poko = knee

2. ప్రోటో - ఆఫ్రో ఆసియాటిక్ :

Kama = hold (in the hand)

**తెలుగు** : కమరఁజేయు, కమర్చు, కమసాలె (స్వర్ణకారుడు), కమ్మరి, కమ్మరం, కమాను (పడవ నడుపు సాధనం),

**Swahili (ఆఫ్రికన్ భాష)** : Kama = squeeze

**Arabic :** Kamshah = handful

**Finnish :** kammen = palm of the hand

**Mongolian :** gamu = gather, pickup

**Proto Thai :** kum = hold with hand

3. ప్రోటో ఆఫ్రో ఆసియాటిక్ :

Alum = Boat.

**తెలుగు** : కలము = ఓడ, పడవ, 12 తూముల పరిమాణం, కలుష గంధం, వ్రాసే కలం (లేఖిని), కలమారి (నావికుడు)

"కలము పై గీలించి గాలికెత్తిన చూపవోవె మిన్నంతయు బూరటిల్లె" అని మహా భారతం ఉద్యోగపర్వంలో కవిప్రయోగం వుంది. కలము అంటే ఓడ లేదా పడవ. ప్రోటో ఆఫ్రో ఆసియాటిక్ అలమ్, తెలుగు కలము ఒక అర్థంలో కన్పిస్తున్నాయి.

**Semetic :** alim = raft

**Central chadic :** Hulum = Boat

4. **ప్రోటో ఆఫ్రో ఆసియాటిక్:**

cir = cut

**తెలుగు :** చీరు = చీల్చు, బ్రద్దలుచేయు, పిలువు, చీరుడు.

**western chadic :** cir = split meat on skewers, pierce

5. **ప్రోటో ఆఫ్రో ఆసియాటిక్ :**

puti = vulva = స్త్రీ జననాంగం

ఇండో యూరోపియన్, తదితర భాషల్లో కూడా ఇది బూతుపదమే!

**తెలుగు :** పూత = వికసనము, పూచుట. (తమిళ = puNTai, మళయాళ = poccu అనేవి అశ్లీలపదాలే! తెలుగులో ఈ అశ్లీలత పరిహరించబడిందని అన్పిస్తుంది. భగవతి, సుభగీ అనే పదాలలాంటిదే "పూతన" అనే పేరుకూడా! పూతన అచ్చమైన తెలుగు పేరు అయి వుండాలి.

6. **ప్రోటో ఆఫ్రో ఆసియాటిక్ :** ciQal = Sand

తెలుగు : ఇసుక (ఒక దానితో ఒకటి అంటని పొడి) (ఇసిక)

7. **ప్రోటో ఆఫ్రో ఆసియాటిక్ :** cil = snake, worm

తెలుగు : చిలువ (పాము) ఉదా॥ కొండచిలువ. చిలువ కన్యక (నాగ కన్యక); చిలువ టెంకి (పాము పుట్ట) ; చిలువ తాలుపు = శివుడు; చిలువ తిండి = గరుత్మంతుడు (పాములను తినేవాడు), చిలువ దొర = నాగరాజు.

**Semetic :** sill = adder

**western chadic :** cil = tape worm

**Central chadic :** cil = snake

8. **ప్రోటో ఆఫ్రో ఆసియాటిక్ :** (an) gaid = upper part of Breast with the neck

**తెలుగు :** అంగిలి (లోకుత్తుక), అంగిలి గుంట, అంగిట (అంగిలికి సంబంధించిన)

**Semitic :** an - gid = Neck, Breast

**East chadic :** gi - H - id = Neck

**Low east chadic :** gahad - breast

**9. ప్రోటో ఆఫ్రో ఆసియాటిక్** : dib (take away)

**తెలుగు** : దొబ్బు

మందస బలంబున నందరు ద్రొబ్బి తెచ్చి - (నన్నయగారి ప్రయోగం.)

శైల తటంబులందు ద్రొబ్బించితి - (పోతనగారి ప్రయోగం)

నీటి ద్రొబ్బించిన - (పొన్నిగంటి తెలగనార్య కవి ప్రయోగం)

మెడపట్టి వెడల ద్రొబ్బిన - (చదలవాడ మల్లనకవి ప్రయోగం)

**Egyptian :** db db = grasp, take back

**Werstern chadic :** d. yab = take away

**East cushitic :** deb = grasp

తమిళంలో తురట్టు (తురట్టి) అనే రూపమే కన్పిస్తుంది.

త్రోచు, త్రోద్రోపులాడు, త్రోపడు, త్రోపరి, త్రోపాటు, త్రోపు, త్రోయు, త్రోలు అనే తెలుగు రూపాలు దీనికి దగ్గరగా వున్నాయి. "దొబ్బు" అనేది నేరుగా 'తెలుగు' లోకి ప్రవేశించిన ఆఫ్రో ఆసియాటిక్ పదం కావచ్చునేమో... పరిశీలించవలసివుంది. తెలుగులోని అనేక బూతుపదాలు ఇలా ఆఫ్రో ఆసియాటిక్ భాషల్లో కూడా కన్పిస్తున్నాయని వివరించడమే ఇక్కడ ముఖ్య విషయం.

**10. ప్రోటో ఆఫ్రో ఆసియాటిక్** : gila (prepuce, testicles, clitoris, vagina)

**తెలుగు** : గిల్లకాయ (వృషణాలకు పామరులు పెట్టిన తెలుగు పేరు. బూతుపదం కాబట్టి నిఘంటువులలో కన్పించకపోవచ్చు)

గ్రుడ్డు, గుడుసు, గొడ్డ, గుడి అనే రూపాలు గుండ్రని వస్తువును సూచించేవి తెలుగులో కన్పిస్తాయి. తమిళంలో కొట్టాయ్, అంటారు. 'గిల్ల' = వృషణం అనే అర్థంలో తెలుగులో మాత్రమే వుంది. ప్రోటో ఆఫ్రో ఆసియాటిక్ భాష మాట్లాడిన ఆ అనాది కాలపు ప్రజలతో తెలుగు వారికి సంబంధాలేవో నడిచాయనడానికి ఇది ప్రధాన సాక్ష్యం.

**Semetic :** gila = prepuce, clitoris

**East chadic :** gula / il - testicles, penis

**BeJa :** galu = scrotum.

**South cushitic :** gulal = testicles.

**11. ప్రోటో ఆఫ్రో ఆసియాటిక్ :** Bur = ashes, dust

**తెలుగు :** బూది (లేక) పొడి (బూడిద కన్నా, పొడి అనడమే ఎక్కువ దగ్గరగా వుంది ఇతర ఆఫ్రో ఆసియాటిక్ రూపాలను గమనిద్దాం -

**Arabic :** barr = dryland)

**Finnish :** poly = dust)

**Estonian :** pori = mud)

**12. ప్రోటో ఆఫ్రో ఆసియాటిక్ :** ca - nwan (breast, udder)

**తెలుగు :** చేన్ను, చేనుగప్పు (రవిక); చేనుగొన (చూచుకం)

**Western chadic :** canwan = udder, breast

**High east cushitic :** Hanun = breast

తమిళంలో చన్నం (DEDR 2320) అంటే పురుషావయవం (penis) చణ్ణు (చణ్ణి) = to copulate

ప్రోటో ఆఫ్రో ఆసియాటిక్ "చన్వన్" కి తెలుగు చేన్ను ఎంతో దగ్గరగా వుండటాన్ని మనం గమనించవచ్చు.

**13. ప్రోటో ఆఫ్రో ఆసియాటిక్ :** gud (back room)

**తెలుగు :** గూడు, గుడిసె, గోడలో ఏర్పరిచిన చోటు

**Semetic :** gudd, gidgad = wall, back room

**Western chadic :** gid = compound, hut

**Low east cushitic :** god = hut

**తమిళం :** కూటు, కూటంపాయ్, కూటప్పు (nest, Bird cage) (DEDR 1883)

తెలుగు, కన్నడం, తుళు భాషలలో 'గూడు' (nest, Hut) అనే రూపం యథాతథంగా కన్పిస్తోంది.

**14. ప్రోటో ఆఫ్రో ఆసియాటిక్ :** a - bul ( Male genitals, pennis)

**తెలుగు :** బుల్ల, బుల్లి, బెల్లం (మగ గుటి, చిన్నపిల్లవాని జననాంగం) (DEDR 4309)

**కన్నడం :** బుల్ల, బుల్లి (Male generative organ)

**Berber :** balul = penis

**Egyptian :** bnn = become erect

గ్రీకు : balanos = glans penis (పురుషావయవం కొనభాగం)

15. ప్రోటో ఆఫ్రో ఆసియాటిక్ : KUNA = woman, queen; Kun = wife, woman; Kaffa = Lady

తెలుగు : కూన = శిశువు, పిల్ల, బిడ్డ, కందు, కుక్కపిల్ల, పిల్లి పిల్ల

చాన = ఇంతి, స్త్రీ

**Akkadian :** Kini - tu = wife.

**Berber :** te - kni = wife

**Slavic :** zhena = wife

**Avesta :** gena = wife

సంస్కృత : gna = godess

అండమాన్ : చాన = స్త్రీ

16. ప్రోటో ఆఫ్రో ఆసియాటిక్ : Mako = child.

తెలుగు : మగ = పుంస్త్వము, మగవాడు, మగువ = స్త్రీ

**Irish :** Mac = son

**Proto Indo Europian :** Maghos = young; Maghu = child, boy

**Old English :** Magu = child, son, man

తమిళం : మక = child, son

కన్నడ : మగ = son

బంటు : manku, mongo = child

proto tibeto burman = mak = son - in - Law

17. ప్రోటో ఆఫ్రో ఆసియాటిక్ : bab = father

తెలుగు : బాబు = తండ్రి, పూజ్యుడు,

**Semitic :** Baba = father, grand father

**Berber :** Bab = father, owner, morter

**Werstern chadic :** bab = father (ఇంగ్లీషులో ఇది నర్సరీ పదం.)

తెలుగులోకి బాబు అనే పదం బెంగాల్ బీహారుల నుంచి వచ్చింది కాకపోవచ్చు. దీని ప్రాచీన రూపం ఆఫ్రో ఆసియాటిక్ భాషల్లో కన్పిస్తుంది. బహుశా తెలుగు నుంచి బెంగాల్లోకి వెళ్లిన అనేక పదాల్లో ఈ "బాబు" కూడా ఒకటి కావచ్చు.

18. **ప్రోటో ఆఫ్రో ఆసియాటిక్ :** cad = shout, speak

**తెలుగు :** చాటు = ఎరుకచేయు, విశదపరచు, చాటించు, చాటువ

చాడి = చాడీ, కొండెము, నేరములు చెప్పుట, చాడీగొట్టు

**Semetic :** sad = shout speak

**Western chadic :** cad - shout, speak

**తమిళ :** చటి (DEDR 2323) = to deceive

**కన్నడ :** చాడి deceit (పితూరి)

19. **ప్రోటో ఆఫ్రో ఆసియాటిక్ :** Teku = Leg, foot

**తెలుగు :** డెక్క = పశువుల కాలిగిట్ట

**Nilu - Saharan :** taka = foot, shoe

20. **ప్రోటో ఆఫ్రో ఆసియాటిక్ :** dag = hide, daq = hide, burry

**తెలుగు :** దాఁగు = అదృశ్యమగు, మఱుగుపడు

దాగుకొను, దాగురింత, దాగురు మూతలు, దాచు, దాక్కొను (దాగుకొను)

దాపరము, దాపరించు (to steal), దాపరీడు = దొంగ

**Egyptian :** dgy = hide

**Western chadic :** dag = hide

**Central chadic :** dug = hide

21. **ప్రోటో ఆఫ్రో ఆసియాటిక్ :** dar = Road, way

**తెలుగు :** దారి (మార్గము, ధరించువాడు)

**Semetic :** darar = straight way

**Western chadic :** dahar = road

**తమిళం :** తారి (DEDR 3170) way, road, path, right mode

తారాయ్ = way path

**కన్నడ, తుళు :** దారి

**తమిళ :** atar (way, path, public Road, rule - (communicated by Prof. Bh. Krishna Murthy

**22. ప్రోటో ఆఫ్రో ఆసియాటిక్ :** car (a) = furrow

**తెలుగు :** చాఱ = రేఖ, చారమీను, జీడిమామిడి

చాఁగ, వ్యాఘ్రువర్గము, బహువల్కము

చాఱిక = రేఖ, చాఱ, తిలకం

చాలు = దున్నునప్పుడు ఏర్పడిన రేఖ, సీత

**Semitic :** tir = furrow

**Berber :** (H) isir = furrow

**East chadic :**ca (H) ar = furrow

**తమిళం :** చారాయ్ (stripe - DEDR 2481)

**కన్నడ :** చార = Line, streak, stripe.

**23. ప్రోటో ఆఫ్రో ఆసియాటిక్ :** cillaw / y (saliva)

**తెలుగు :** చొల్లు, జొల్లు, చొంగ, లాల

చొళ్లు మాట = తుంపురులమాట

**Semitic :** cillaw / y - t = saliva.

**Western chadic :** culli = saliva.

**తమిళ :** చొల్లు = dribbing at the mouth

as of a child (DEAR 2862)

**కన్నడ :** జొల్లు

**తుళు :** జొల్లె

**24. ప్రోటో ఆఫ్రో ఆసియాటిక్ :** cama (eat, food)

**తెలుగు :** చామ = ఒక దినుసు, పడవ ; యువతి,

స్త్రీ, నలుపు, సస్యవిశేషం (శ్యామాక ధాన్యం) ఆఫ్రికన్ పంట "చామబియ్యాన్ని" తెలుగులోంచి స్వీకరించి, సంస్కృతీకరించి శ్యామాకధాన్యం అన్నారని అనిపిస్తుంది!

చామన చాయ = శ్యామలవర్ణం.

**Semetic :** + cma = feed with rich food
**Western chadic :** cam = taste, test
**East chadic :** cam = eat (Hard food)

25. **ప్రోటో ఆఫ్రో ఆసియాటిక్ :** cilam (be dark, black)
**తెలుగు :** చిలుము (తామ్రాది మాన్యము, విషము), లి / కిలుము.
**Semitic :** t clam - be dark, be black
**East chadic :** Zilim = black
**South cushitic :** calam = green
**తమిళం :** చిలుంపు, (DEDR 1586), చెలింపు, కిలువు (Rust)
**తుళు :** కిలింబు, కిలుబు, కిల్బు (Rust)

26. **ప్రోటో ఆఫ్రో ఆసియాటిక్ :** cip (sweep)
తెలుగు : చీపురు
**Semitic :** sip = Rake up, purify, ref. ne
**Berber :** cif = plane, wash
**Western / chadic :** cif = ( 1. sweep ; 2. take off the top layers of washed cern ; 3. skim ; 4. broom ; 5. bresh)

27. **ప్రోటో ఆఫ్రో ఆసియాటిక్ :** cur = flint, flint knife.
**తెలుగు :** చురె, చురి, చురియ = చురకత్తి, చిన్నకత్తి
**Semitic :** t. u / ir - (flint, rock)
**Berber :** cur (flint, rock)
**Western chadic :** cur - knife without handle
**Central chadic :** cur (i) - axe, hoe.

## చివరగా ఒక మాట

జాతి ప్రాచీనతని, భాష ప్రాచీనతని, నాగరకత ప్రాచీనతని నిర్ణయించడానికి చాలా పరిశోధన జరగాలి. తమ మూలాలను అన్వేషించే విషయంలో ఇన్నాళ్లూ తెలుగువారు ఇంచుమించు మౌనంగా వుంటూనే వచ్చారు. ఇప్పాటికి కూడా వెల్లువెత్తిన స్పందనేమీ కన్పించడం లేదు. అదలా వుంచుదాం.

భాష విషయానికి వచ్చేసరికి పరిపుష్టమైన వాక్యనిర్మాణం కలిగిన తెలుగు మనకి క్రీ.శ. 5వ శతాబ్దికి చెందిన శాసనాల నుంచి మాత్రమే కన్పిస్తుందని పి.వి. పరబ్రహ్మశాస్త్రి గారి లాంటి పెద్దలు చెప్తారు.

వర్ణమాల కొచ్చేసరికి భట్టిప్రోలు శాసనంలో 'ళ' అనే అక్షరం, తెలుగు భాషనే సూచిస్తోందని అంటారు. ఇది బహుశా క్రీ.పూ. 3వ శతాబ్ది నాటిది కావచ్చు.

వర్ణమాల, వాక్యనిర్మాణాల చరిత్రని అలావుంచితే భాషకు అతిముఖ్యమైంది పదసంపద. వ్యాకరణ సూత్రాలు లేకపోయినా లిపి తెలియకపోయినా తెలుగువారికి అతిప్రాచీన కాలంనుంచీ చక్కని పదాలున్నాయి. ప్రకృతిలో కన్పించే సమస్త వస్తు సముదాయానికీ తెలుగులో పేర్లు పెట్టుకోగలిగారు. ఇతరుల భాషలకు ఆ పేర్లను అందించగలిగారు; ఇతర భాషల్లోంచి కొన్నింటిని పొందగలిగారు.

రాతియుగం నాటికే వర్తకవాణిజ్యాల కారణంగా గానీ, లేక మరే ఇతర కారణాల వలనగాని, ఇతర జాతులతో ఆనాటి పూర్వ తెలుగు ప్రజలకు సంబంధాలు స్థిరంగానే నడిచాయనేది నిర్వివాదం. ఇవ్వాళ పనిగట్టుకుని ఒకరు నిరూపించ వలసిన అవసరం లేని అంశాలు అవి.

విభిన్న భాషలు మాట్లాడుకునే ప్రజల మధ్య సంబంధాలు నడచినప్పుడు వారి భాషలు కూడా ఆదాన ప్రదానాలను పొందుతాయి.

ఒకే పదం రెండు వేర్వేరు సుదూర భాషల్లో ఒకే అర్థంలో కన్పించినప్పుడు చారిత్రకంగా అది చాలా ముఖ్యమైంది అవుతుంది. వాటిని గుర్తించడం మొదట జరగాలి. ఆ తర్వాత పరిశోధనలు కొనసాగి, ఆ పదం ఏ భాషలోంచి ఏ భాషలోకి ఏ కాలంలో, ఏ సందర్భంలో వెళ్లిందో నిగ్గుతేల్చ గలుగుతాము. ఇందుకు పరిశోధకులు మౌనం వీడి ముందుకు రావాలి. ఈ దిశగా ఆలోచన చెయ్యాలి.

1. సుమేరియా పదాలు ఇంతకాలం ఇండో ఆర్యన్ భాషా కుటుంబానికి చెందినవిగానే భావిస్తూ వచ్చారు. ఇటీవలి కాలంలోనే అవి ద్రావిడ పదాలని ఋజువయ్యింది.

2. ఆఫ్రో ఆసియాటిక్ భాషా కుటుంబానికి చెందిన అనేక భాషల్లో పూర్వద్రావిడ భాషా పదాలున్నాయనే వాదన వెలుగులోకి వచ్చింది ఈ ఏడెనిమిదేళ్ల కాలంలోనే!

3. గువాంచి, ఎట్రుస్కన్ లాంటి భాషల్లోనూ అమెరికన్ ఇండియన్ భాషల్లోనూ పూర్వద్రావిడ భాషా రూపాలను అన్వేషించడం మొదలయ్యింది కూడా కేవలం మూడు లేక నాలుగేళ్ల క్రితం నుంచే! ఇవన్నీ అత్యంత తాజా పరిశోధనలు.

4. బహుశా 5,000 ఏళ్లనాటి చరిత్రకి ఇవి ఋజువులు. "ఆనాటికి తెలుగు వారున్నారా...?" అని హేళన చెయ్యవద్దు. ఆనాటివారు తెలుగువారికి పూర్వీకులు కారని చెప్పగలరా...? పరిశోధకుడు మొదట భావ దాస్యం నుంచి బైటపడగలగాలి!!



4

# పూర్వ తెలుగు ప్రజలకు తెలిసిన తొలి ప్రపంచ నాగరకత 'తమాన'

## ఆఫ్రికన్ సహారా, పూర్వ ద్రావిడ నాగరకతల మాతృకలు

**జలప్రళయం** కథని ప్రాచీన జాతుల పురాణాలన్నీ ప్రస్తావించాయి. అంతటి ప్రాముఖ్యత కల్గిన జలప్రళయం ఈ భూమండలంమీద కొన్ని చారిత్రక పరిణామాలకు తప్పనిసరిగా కారణం అయివుండాలి. జకారియా సిచిన్ (Zecharia Sitchen) అనే పరిశోధకుడు 'వెన్ టైమ్ బిగాన్?'' అనే పుస్తకంలో జలప్రళయం 13,000 సంవత్సరాలక్రితం జరిగివుంటుందనీ, అంటార్కిటికా మంచు పొరలు కరిగి సముద్రం పొంగి లోతట్టు భూమండలాన్ని ముంచెత్తి ఆక్రమించుకొందనీ పేర్కొన్నాడు.

బైబిల్‌లో నోవాకథ, ఇండియాలో మనువు కథ, మత్స్యపురాణం, మెసపొటేమియా క్యూనిఫాం చిత్రలిపిలో జలప్రళయం ప్రస్తావనలు కన్పిస్తాయి. సుమేరియన్ దేవుడు 'ఎంకి' "అత్రహసీన్''కు ఒక పెద్ద పడవని నిర్మించవలసిందిగా ఆదేశించడం లాంటి ఇతివృత్తాంతాలన్నీ పెద్ద జలప్రళయం జరిగినట్టు సూచిస్తున్నాయి. జలప్రళయం అనేది సముద్రమట్టం పెరుగుతున్నకొద్దీ పల్లపు ప్రాంతాలు మునకకు గురి అవుతూ అనేక సంవత్సరాలపాటు జరిగివుండాలి. ప్రజలు హాహాకారాలుచేస్తూ పొట్ట చేత్తో పట్టుకుని మెరకప్రాంతాలకు వలసపోక తప్పని పరిస్థితులు ఏర్పడి వుంటాయి.

ఆ స్థితిలో ప్రపంచంలోని ఎక్కడెక్కడో జలప్రళయ బాధితులు ఆఫ్రికాలోని సహారా మెరక ప్రాంతాల్లోకి చేరుకుని ఆశ్రయం పొందివుంటారని ఒక ఊహ.

అప్పటివరకూ ఆహార సేకరణ దశలో జీవించిన మనుషులు అడవి మొక్కల్ని, అడవి జంతువుల్ని క్రమేణా మచ్చిక చేసుకోవడం (Domestication) ప్రారంభించారు. అంటే, ఆహారోత్పత్తి చేసుకోవడం మొదలుపెట్టి వుంటారు.

ఉత్పత్తి మొదలవగానే, కాలంలో 'వేగం' ప్రారంభం అయ్యింది. నాగరక సమాజం ఏర్పడసాగింది. పాలనావ్యవస్థ ఏర్పడింది. రాజకీయవ్యవస్థ ఏర్పడింది. వ్యక్తులకు సమాజ పరంగా కొన్ని ఉన్నతులు (Social Ranking) ఏర్పడసాగాయి. పరిణతి చూపించసాగాడు వ్యక్తి. ఉత్పాదకత అనేది ఒక సామాజిక అంశం కాసాగింది.

ఈ విధంగా జలప్రళయానంతరం ఏర్పడిన ఈనాగరికతని పూర్వ సహారా నాగరికత Proto Saharan Civilization అన్నారు. Clyde Winters ఈ "మూల సహారా" నాగరికత గురించి అనేక పరిశోధనాత్మక విశేషాలను పరిచయం చేశాడు. వాటి సారాంశం ఇది :-

1. భూగర్భశాస్త్ర పరిశోధనలు, ఇతర ఆర్కియాలజీ శాస్త్రపరమైన అంశాల మీద కాకుండా ఒక అతిప్రాచీన జాతి సంస్కృతి, చరిత్రని వారు మాట్లాడిన భాష ఆధారంగా నిర్ధారించే ప్రయత్నాలు ఇటీవల చాలా ఎక్కువగా జరుగుతున్నాయి.

2. జపాన్ భాషలోనూ, అమెరికన్ స్థానిక భాషల్లోనూ, ఎట్రుస్కన్ భాషలోనూ, హంగేరియన్ భాషలోనూ తొంగిచూసే అనేక ద్రావిడపదాల్ని, అవి తెలుగుపదాలకు చాలా దగ్గరగా వున్న వైనాన్ని మనం స్పష్టంగా గమనించవచ్చు.

3. ఈ ప్రయత్నాలన్నీ భాష ఆధారంగా చారిత్రాత్మకమైన జాతుల సంస్కృతిని పరిశీలించడానికి ఉద్దేశించినవే. అంతర్లీనంగా, తెలుగుభాష మూలాలను వెదకడం కూడా ఇందులో ఒక భాగం. వాస్తవానికి భాషాచరిత్ర పరిశోధనలో ఇదొక కొత్తపుంత. వాటి వివరాలు జన సామాన్యానికి చేరాలనేదే లక్ష్యం.

డా॥ వామోస్ టోత్ బాటర్ (Dr. Vamos Toth Batter) అనే హవాయికి చెందిన పరిశోధకుడు మూలసహారా నాగరికత కాలంలో ప్రజలు మాట్లాడిన భాష ఎలా వుండేదనే విషయం మీద విశేష పరిశోధన చేసినవాడు. ఆఫ్రికన్ మండింగ్,

సుమేరియన్, మూలద్రావిడ భాషల్లో స్పష్టంగా కన్పించే ఎన్నో పదాలు ఆనాటి మూలసహారా నాగరిక ప్రజల భాషలోవున్నాయని ఆయన సోదాహరణంగా వివరించాడు. విశేషం ఏమంటే, ఆయన సూచించిన మూలద్రావిడ పదాలు తెలుగుభాషలో ఈనాటికీ వ్యాప్తిలో ఉన్నవే ఎక్కువగా ఉన్నాయి.

మూల ద్రావిడ భాష ఎలా వుండివుంటుందనే విషయంలో ఎవరి సందేహాలు వారికి వున్నాయి. కానీ, డా॥ వామోస్ టోత్ బేటర్ సూచించిన మూల ద్రావిడ పదాలు పరిశీలిస్తే తెలుగుభాష ఎలా ఉంటుందో మూలద్రావిడ భాష అలా వుండి వుంటుందని చక్కగా అర్థం అవుతుంది.

మూలసహారా ప్రజల భాషాపదాలలో పదేపదే కన్పించే "తమాన" అనే పదాన్ని తీసుకొని ఆ నాగరికతకు 'తమాన' నాగరికత అని పేరుపెట్టాడు డా॥ వామోస్ .

చారిత్రకంగా ఇది గొప్ప పరిణామం.

తమాన పదం వివిధ రూపాలలో ఆఫ్రికన్, సుమేరియన్ ద్రావిడభాషల్లో ప్రముఖంగానే కన్పిస్తోంది. మూల సహారా భాషలో 'తమాన' అంటే స్థిరమైన, స్థిమితమైన అని అర్థం. తెలుగులో తమాయించడం అంటే, శమించడం (లేదా) స్థిమితపడటమే కదా...!

డా॥ వామోస్ అభిప్రాయంలో 'తమాన' - ప్రపంచ నాగరికతల్లో మొట్టమొదటి నాగరకత అనే! "at some time in our distant past, mankind shared a universal culture, just as they spoke a similar proto langage which Linguists call NOSTRATIC" చరిత్రకందని ప్రాచీన కాలంలో అప్పటికి ఈ భూమ్మీద నివసించిన మనుషులంతా ఒకేభాష మాట్లాడారు. అది అన్ని భాషలకూ మాతృక అనదగిన పూర్వభాష. దాన్ని NOSTRATIC భాష అని భాషావేత్తలు పిలుస్తారు. సింధు నాగరకతనీ, సుమేరియన్ నాగరకతనీ, ఈజిప్షియన్ నాగరకతనీ నిర్మించిన - ప్రజలకు ఈ మూల సహారా నాగరికులు పూర్వీకులు అయివుంటారు, అందుకే ఈ మూడు భాషల్లో కలగలుపుగా కన్పించే అనేక పదాలు మూల సహారా భాషలో కన్పిస్తాయి. "Mankind shared a universal culture" అంటాడాయన!

వామోస్‌గారి పరిశీలనలో 5,800 స్థలనామాలు నదీనామాల మధ్య సారూప్యత వివిధ దేశాల్లో కన్పిస్తున్నాయని తేలింది. వీటిలో 3500 పేర్లు యూరేసియా, ఆఫ్రికా,

అమెరికాలలో కన్పిస్తున్నాయి. సింగపూర్ లాగా తెలంగాణాలో సింగాపురం వుండటం లాంటి నామసారూప్యత అన్ని సందర్భాలలోనూ కాకతాళీయం కాదు.

ఆయన లెక్కలో "తమానా" పేరు 24 దేశాలలో వుంది. "తమునా" అనే నది ఉత్తర ఒంటారియోలో వుంది. మన దేశంలో "యమున" అనే పేరు దీనికి చాలా దగ్గరగా వుంది.

నిజానికి 1924 లోనే మావెల్ అనే పరిశోధకుడు "ద చీఫ్ ఎలిమెంట్స్ యూజ్డ్ ఇన్ ఇంగ్లీష్ ప్లేస్‌నేమ్స్" అనే గ్రంథంలో యూరప్‌లో ఎన్నో ద్రావిడ పేర్లు కన్పిస్తున్నాయని మొదటగా గుర్తించాడు. ఆయన తర్వాత "లహోవరీ" అనే పరిశోధకుడు "ద్రవిడియన్ ఆరిజిన్స్ అండ్ ద వెస్ట్" అనే గ్రంథంలో యూరప్ ఆసియా ఖండాల (యూరేసియా) భాషల మధ్య సారూప్యతని ఎత్తి చూపించాడు. డా॥ వామోస్ ఇంచుమించు ఆరువేల పదాలు ఇలాంటివి వున్నాయని నిరూపించాడు.

ఉదాహరణకి యూరప్‌లో ప్రాచీన గ్రామనామాలలో అర్ (లేదా) అరి (ari)ఎక్కువగా కన్పిస్తుంది. ఈ "అర్" (ar) మూలపదంలోంచి area పదం ఏర్పడింది. ఈ 'అర్' మూలపదం మూల ద్రావిడ "ఉర్", సుమేరియన్ "ఊర్" పదాల రూపాంతరమేనంటాడాయన. ఆఫ్రికన్ మండింగ్ భాషలో 'పుర్' అంటే ఊరుమ్మడి ప్రాంతం (Property of a clan) అని అర్థం. "పురము" అనే సంస్కృత పదానికి కూడా మూలం ఇదే కావచ్చు.

జలప్రళయానంతరం ఆహారోత్పత్తిని సాధించడంలో "తమానా" స్త్రీలు ప్రముఖ పాత్ర పోషించారు. అడవి మొక్కల్ని ఆహారయోగ్యంగా మచ్చిక చేయడం ద్వారా వ్యవసాయాన్ని ఆహారోత్పత్తిని మొదటగా ప్రారంభించింది స్త్రీలే! అడవి జంతువుల్ని కూడా ఇలానే పెంపుడు జంతువులుగా ఇంట్లో కట్టిపడేసే రీతిలో మచ్చిక చేసింది కూడా స్త్రీలే!

అందుకని తమానా సంస్కృతిలో స్త్రీకి అత్యంత ప్రాధాన్యత కన్పిస్తుంది. "మా" దేవత నుంచే అందరం పుట్టామని వాళ్ళ మతవిశ్వాసం. అమ్మతల్లిని 'మా' దేవతగా కొలుచుకొన్నారు. ఈజిప్టియన్లు, ఈలమైట్‌లు, ద్రవిడియన్లు, ఆఫ్రికన్ మండింగ్, సుమేరియన్లందరి భాషలోనూ 'మా' పదానికి ఇప్పటికీ అంతే ప్రాధాన్యత ఉంది.

సంస్కృత పదం 'మహ' లో 'మ' కూడా ఇలా ఏర్పడిందే! అన్నింటికన్నా, అందరికన్నా ఉత్తమమైనదాన్ని (the greatest) 'మ' అని పిలిచారు.

తండ్రిని 'ప' 'పాప' అన్నారు. పిల్లల్ని 'దే', 'దీ', 'దూ' అని పిలిచేవారు. ఇక్కడో గమ్మత్తైన అంశం వుంది. ప్రాకృత భాషాపదం "దేకి" అంటే కృష్ణుడి తల్లి! పిల్లల్ని 'దే' అనడం మూలద్రావిడభాషలో కూడా వున్నదనడానికి ఇది సాక్ష్యం. దీన్ని సంస్కృతీకరించి దేవకి అని వుంటారు.

తమానా ప్రజలు తమ నగరాన్ని ఉర్ (ఊరు) అని పిలుచుకున్నారు. నగరానికి బాధ్యుడిని, అభివృద్ధికి కారకుడిని 'సర' అన్నారు. తెలుగులో ఈ 'సరము' అనే మాటకు కష్టపడి అభివృద్ధి సాధించడం అని అర్థం! "శ్రమ" అనే సంస్కృత పదానికి 'సరము' మూలరూపం కావచ్చు.

నలుగురు నడిచేందుకోసం బురద అంటకుండేందుకు రాళ్ళుపరుచుకొంటూ వేసిన బాటని 'సిల' అన్నారు. 'సిలము' అనే తెలుగుమాట ఇదే అర్థంలో కన్పిస్తోంది. దీన్ని సంస్కృత పదంగా భావించి మనం పెద్దగా పట్టించుకోలేదు. కానీ, ఇది ఆఫ్రికన్ భాషల మూలరూపంలోంచి ఏర్పడింది కావచ్చని అర్థం అవుతోంది.

కుటుంబం అంతా ఒకే ఇంట్లో వుండేవాళ్ళు. ఇంటిని "ఉ", "లు" అని రెండు పేర్లతో పిలిచారు. "ఉండు" అనే తెలుగు పదానికి 'ఉ'లో వుండటమే కదా అర్థం. "లు" పదానికి ముందు 'ఇ' చేరిస్తే 'ఇలు' అయ్యింది. ఇలు అంటే ఇల్లే.

భూమిలో వ్యవసాయం చేసేంత భాగాన్ని గ(న్) అన్నారు. "గని" అనే తెలుగుపదానికి చుట్టూ గట్టు కట్టిన మడిచేను అని అర్థం.

తమానా ప్రజలు నావికులుకూడా! సుదీర్ఘకాలం సముద్రం మీద ప్రయాణాలు చేస్తూ వర్తక వాణిజ్యాలు నెరపిన జాతి. వీళ్ళు 'పడవ' (లేదా) ఓడని "కలమ్" అన్నారు. "కలము" అనే తెలుగు మాట నావ, ఓడ, పోతము అనే అర్థాలలో ప్రయోగం వుంది. "కలముపై గీలించి గాలికెత్తిన చూపవోలె మిన్నంతయు బూరటిల్లె" అని మహాభారతంలో ఉద్యోగపర్వంలో ఒక ప్రయోగం కన్పిస్తుంది.

వేట వాళ్ళ ప్రధాన వృత్తి. బాణం, మొరటు ఆయుధాల్ని తమ భాషలో 'కక' అని పిలిచేవారు. ఈ పదం తెలుగు, సంస్కృతాలలో ఎన్నో కొత్త పదాలను సృష్టించింది. ఈ నిరూపణల్ని పరిశీలించండి:

తెలుగు : కక్కరము
ప్రాకృతం : కర్కర
సంస్కృతం : కర్కర

ఈ పదాలు కఠినమైనది అనే అర్థంలో ఏర్పడ్డవే! 'కంకర' పదం కర్కరలోంచే వచ్చివుండవచ్చు. క్రూరమైనది అనే అర్థంలో తమానా. "కక" లోంచి ఏర్పడిన పదం ఇది. ఇలాంటిదే మరో తెలుగు పదం "కక్కసం" కూడా. సంస్కృత 'కర్కశ' కు ఇది మూలరూపం. "కగ్గము" అనే తెలుగు ప్రయోగానికి ప్రాకృత ఖగ్గ, సంస్కృత ఖడ్గము సమానార్థకాలు. అన్నీ సంస్కృతంలోంచే తెలుగులోకి వచ్చాయని ఒక నిర్ణయానికి వచ్చేముందు తెలుగు పదాలు, వాటి మూలాలు, అవి సంస్కృతం పైన కల్గించిన ప్రభావాన్ని కూడా అధ్యయనం చేయాలని భావిస్తున్నాను.

గనులు, లోహపరిజ్ఞానం కూడా వీరికుంది. 'తుల్' అనే పదాన్ని గనుల తవ్వకంలో తొలవడం అనే అర్థంలో వాడేవారు. తూలు అనే పదానికి తొలగించు అర్థం కూడా వున్నదన్న సంగతి గమనార్హం. తొలుచు పదానికి ఇది మూలం కావచ్చు కూడా! ఆఫ్రికన్ మండింగ్ భాషలో "త్యోలో" సుమేరియన్ భాషలో "తుల్" పదాలు కన్పిస్తాయి. తుల్ లేదా తొలు పదానికి 'గు' ప్రత్యయం చేరిస్తే తొలుగు (తొలగించడం) 'చు' ప్రత్యయం చేరిస్తే 'తొలుచు' (తొలవడం Digging) అవుతుంది.

బంగారాన్ని 'తమానా' ప్రజలు 'ఆనీ' అని పిలిచారు. ఆఫ్రికన్ మండింగ్ భాషలో 'సానీ' పదం కన్పిస్తుంది. సోనా, సోనీలకు ఇది మూలం కావచ్చు. మూల ద్రావిడ పదం 'కాణీ' దీనికి సమానార్థకం!!

'మల' అనే తెలుగు పదానికి పర్వతము కొండ అని అర్థాలు. ఇంచుమించుగా అన్ని ద్రావిడ భాషల్లోనూ ఈ పదం ఇదే అర్థంలో కన్పిస్తుంది. దూర ప్రాచ్య దేశాలు (Near east) యూరప్, మెక్సికో భాషల్లో కూడా ఈ 'మల' అనే పదం Mountain, hill or large rough rock అనే అర్థాలలో కన్పిస్తుంది. ఆఫ్రికన్ సహారా మాతృకలో కూడా ఇదే అర్థంలో కన్పిస్తోంది. ఆఫ్రికన్ మగియార్ భాషలో (ఉరదల్ - ఆల్టాయిక్ భాష) "మల్" (Mal) అంటే, Pile, Stack, heap and hill అనే అర్థాలు వున్నాయి.

ఈ నిరూపణలన్నీ పరిశీలించాక మనకు కొన్ని ముఖ్య విశేషాలు మనసులో కొస్తాయి.

1. ముఖ్యంగా దక్షిణ భారతదేశంలో వ్యాప్తిలో వున్న ద్రావిడభాషా కుటుంబంలోకి వర్గీకరించిన 24 ద్రావిడ భాషలు ఇక్కడే రూపు కట్టుకున్నవైనా, ఈ భాషలన్నింటి

మాతృక అనదగిన మూల ద్రావిడభాష (PROTO - DRAVIDIAN LANGUAGE) చాలా ప్రాచీనమైనదని దానికి ఆఫ్రికన్ ప్రాచీన భాషలతో నేరుగా సంబంధాలున్నాయనీ అర్థం అవుతోంది.

2. ఆనాటి "మాతృ ద్రావిడ భాష" ఎలా వుండేదంటే తెలుగు భాషకు చాలా దగ్గరగా వుండేదని నిస్సంశయంగా చెప్పవచ్చు. ఆనాటి మాతృ ద్రావిడ ప్రజలకు తెలుగుభాషని వినిపిస్తే తప్పకుండా అర్థం అయ్యేదన్నమాట!

3. 'తెలుగు భాష' అంటే ఇప్పుడు మనం మాట్లాడుతున్న ఈ విధమైన తెలుగు అని ఎంతమాత్రమూ కాదు. ఈస్టిండియా కంపెనీ పాలనా కాలంలో ప్రజల భాష తెలుగుకీ, రంగాజమ్మ రాసిన నాయకురాజుల కాలంనాటి 16వ శతాబ్దపు ప్రజల భాష తెలుగుకీ, తిక్కన కాలంనాటి 16వ శతాబ్దపు ప్రజల భాష తెలుగుకీ, 6వ శతాబ్దపు శాసనాలలో కన్పించే ప్రజలభాష తెలుగుకీ, ఎంతో తేడా వుంది. అయినా, మౌలికంగా అవన్నీ తెలుగు భాషా స్వరూపాన్నే కలిగివున్నాయి. క్రీ.పూ. కనీసం 10 వేల ఏళ్లనాటి ఆఫ్రికన్ సహారా కాలంలో తెలుగు ఇప్పటి తెలుగులా ఎలావుంటుందీ...? అయినా కొంతమేర మౌలిక స్వరూపాలు ఆనాటి భాషలో ఇమిడి వుంటాయి.

4. అప్పటికే మాతృ ద్రావిడ భాషలోంచి తెలుగు విడివడిందా... అనే ప్రశ్నకు ఇక్కడ అవకాశమే లేదు. ఆనాటి మాతృ ద్రావిడం తెలుగుభాషకు దగ్గరగా వుండి వుంటుంది. అందుకే అతికినట్లు అనేక ఆఫ్రికన్ సహారా పదాలు తెలుగులో ఇప్పటికీ సరిపోలి కన్పిస్తున్నాయి. "ఆఫ్రికన్ సహారా" "తమానా" ఈ పేర్లన్నీ ప్రోటో ఆఫ్రో ఆసియాటిక్ భాషా పరిశోధకులు పెట్టుకున్న పేర్లే!

5. భారతదేశంలోకి తొలి ద్రావిడులు బైటనించి వచ్చినవారే గాని, ఇక్కడ పుట్టిన వాళ్లు కాకపోవచ్చుననే ఎక్కువమంది పరిశోధకులు భావిస్తున్నారు. వ్యవసాయమూ, పశుపోషణలు ప్రధాన జీవనంగా ద్రావిడులు భారతదేశంలోకి ప్రవేశించారని, అప్పటికి, ఆర్యులు సంచార జీవనంలోనే వున్నారనీ చెప్తారు. భాషా సంస్కృతుల విషయంలో ఆనాటి ఆర్యులకన్నా ద్రావిడులు ఎంతో ముందున్నారని అర్థం అవుతుంది. వారి మూలాలు ఆఫ్రికన్ సహారా, సుమేరియన్, ఈజిప్షియన్ నాగరికతల్లో కన్పిస్తున్నాయని తాజా పరిశోధనలు చెప్తున్నాయి. సింధు నగరాలలో కూడా కొంతకాలం జీవనం సాగించి తదనంతర కాలంలో దక్షిణాదిన స్థిరపడి

వుంటారనీ, ఈ మధ్యకాలంలో వివిధ ద్రావిడభాషలు క్రమేణా రూపుకట్టుకుని వుంటాయనీ ఒక ఊహ చేయడానికి ఈ పరిశోధనలు తోడ్పడుతున్నాయి.

6. అలా రూపుకట్టుకున్న భాషల్లో తెలుగు రెండవభాష అనీ మొదటిది బ్రాహుయీ కావచ్చుననీ, తమిళ, కన్నడాలు ఆ తర్వాత ఏర్పడ్డాయని భాషాశాస్త్రవేత్తలు ఘోషిస్తున్నారు.

7. సింధు నగరాలలో ద్రావిడులు జీవించిన కాలంలోనే అంతో ఇంతో తెలుగుకు దగ్గరగా వున్న భాష రూపొంది వుండాలి. ఈ విషయమై తగిన సాక్ష్యాలను "తెలుగే ప్రాచీనం" అనే గ్రంథంలో సోదాహరణంగా వివరించాను. పరిశీలించగలరు.

8. పూర్వపు ఆఫ్రికన్లతో పూర్వద్రావిడులకు, అందులోనూ పూర్వ తెలుగు ప్రజలకి సంబంధాలు వాణిజ్యపరంగా బలపడి అనేక పదరూపాలు ఆదానప్రదానాలు జరిగి వుండవచ్చు.

9. కొందరు పూర్వ (ప్రోటో) ఆఫ్రో ఆసియాటిక్ ప్రజలు గుంపులుగా తెలుగు నేలమీదకు చేరి, స్థిరపడి ఇక్కడి తెలుగువారిలో కలిసిపోయి వుండవచ్చు. ఆవిధంగా కూడా అనేక ఆఫ్రికన్ పదాలు తెలుగువారి వ్యవహారంలోకి వచ్చివుంటాయి. ప్రోటో ఆఫ్రో ఆసియాటిక్ ప్రజలే పూర్వద్రావిడులగా భారతదేశానికి చేరి వుండవచ్చు.

10. ప్రొటో ఆఫ్రో ఆసియాటిక్ ప్రజలకు పూర్వ ద్రావిడులు రక్త సంబంధీకులు, దాయాదులు కావచ్చు. (లేదా) సన్నిహితులు సహజీవనులూ కావచ్చు. అధ్యయనం ఈ దిశగా మరింత జరగవలసివుంది!



# 5

# అమెరికా ఖండాలలో యక్షులు

## 'అమెరికా'లో 'మెరక' తెలుగు అర్థమే

**గుణాఢ్యుడి** 'బృహత్కథ' కాశ్మీరీప్రతి దొరికినప్పుడు, కాశ్మీరానికీ, తెలుగువారికీ గల అవినాభావ సంబంధం ఏమిటో లోతుగా అధ్యయనం జరిగివుంటే బావుండేది. కాశ్మీరీ కవయిత్రి లల్లమహాదేవి పాటల్ని ఇప్పుడు మనం గుర్తించలేకపోయినా, 'లల్లాయి(లల్ల తల్లి) పదాలు' అనేమాట తెలుగునాట అంతగా ఎలా ప్రసిద్ధిపొందిందో కూడా అధ్యయనం జరిగివుంటే బావుండేది. ఎక్కడ కాశ్మీరము? ఎక్కడ ఆంధ్రము?? ఎక్కడిదీ సాన్నిహిత్యము???

బైబిల్ గ్రంథంలో 'ఉర్' నగరం నుంచి వచ్చాడని చెప్తున్న అబ్రహాంతో, ప్రతి గ్రామాన్నీ 'ఊరు' అని పిలుచుకునే తెలుగువారికి ఏయుగంలోనైనా, ఎక్కడైనా ఛాయామాత్రపు సంబంధాలేమైనా వున్నాయేమో కనీసం వెదకడానికి ప్రయత్నించి వుంటే మరింత బావుండేది.

కాశ్మీర్‌లో ఇటీవల ప్రాచీన కాలంనాటి సమాధి ఒకటి బయటపడింది. ఇది జీసస్ సమాధి అనీ, 'శిలువ ఘటన' తర్వాత ఆయన తన మినిస్టర్స్‌తో కాశ్మీర్‌కు వచ్చి అక్కడ స్థిరపడి, తన దైవ సామ్రాజ్యాన్ని పాలించాడనీ గట్టిగా విశ్వసించే క్రైస్తవ పరిశోధకులు రాస్తున్న అంశాలు కూడా గమనార్హమే!

ఏది ఏమైనా, ఆర్యుల రాకతో, స్థానిక జాతులు ఉత్తరాది నుంచి దక్షిణ భారతదేశానికి తరలివచ్చి ద్రావిడులుగా పిలువబడ్డారనే వాదనకి కాలంచెల్లింది. ఉత్తరభారతానికి ఆర్యులు వచ్చేనాటికే ద్రావిడులు అక్కడ సింధు నాగరకతను నెలకొల్పారని, దానితో సమాంతరంగా దక్షిణ భారతదేశంలోనూ ద్రావిడ నాగరికత - క్రమ వికాసాలు పొందిందనీ ఇప్పుడు చారిత్రకవేత్తలు నమ్ముతున్నారు.

మూల ద్రావిడభాష అనేది ఊహాత్మకం. దాని స్వరూపాన్ని పూర్తిగా పునర్నిర్మించలేకపోవడానికి అది ప్రజలభాషే గాని, కావ్యభాష కాకపోవడం ఒక కారణం కావచ్చు. 'బ్రాహుయిాలాంటి భాషలు ఉత్తర మూల ద్రావిడంలోంచి ఏర్పడితే, 'తెలుగు' 'గదబ' 'కుయి' తదితర భాషలు మధ్య మూలద్రావిడం లోంచి విడివడ్డాయనీ, దక్షిణ మూలద్రావిడంలోంచి తమిళం, కన్నడం, మలయాళం వగైరా భాషలు ఏర్పడ్డాయని ప్రఖ్యాత భాషావేత్త ఆచార్య భద్రిరాజు కృష్ణమూర్తి ప్రభృతులు అంటున్నారు.

మూల ద్రావిడ భాషాపదాలు ప్రపంచ నాగరకతల్లో అనేక చోట్ల కన్పిస్తాయి. ఆసియాలోనే ద్రావిడ రాజ్యాలు అనేకం వున్నాయి. పరిశోధకులకు కుప్పలుగా మూల ద్రావిడ పదాలు దొరుకుతున్నాయి. వాటిని పోల్చి చూసుకోవడానికి తమిళానికొక్కదానికే సమగ్రమైన 'లెక్సికాన్' మహానిఘంటువు వుంది. తెలుగు పదాల గురించి ఆంగ్లంలో దొరికే సమాచారం బహు తక్కువ. అందువలన విదేశీ పరిశోధకులు తెలుగుభాష మూలాల గురించి ఏమీ వివరాలు అందించలేక పోతున్నారు. చాలామంది పరిశోధకులు ఈవిధంగా తమ అశక్తతని ప్రకటిస్తున్నారు.

ముఖ్యంగా, 'సుమేరియన్', 'ఇలమ్', 'ఈజిప్షియన్', 'మధ్య ఆఫ్రికా మండింగో' భాషలన్నింటిలోనూ కన్పించే మూలద్రావిడ పదాలను నిరూపించం కోసం పాశ్చాత్య పరిశోధకులు ఈ తమిళ లెక్సికాన్ పైనే ఆధారపడుతున్నారు. వాళ్ళకి సమగ్రమైన సమాచారం అందించేందుకు తెలుగుభాషా వేత్తలు వారికి అందుబాటులో లేకపోవడం ఇంకో కారణం కూడా! దీన్ని అలుసుగా తీసుకొని తమిళ రచయితలు ప్రాచీన ప్రపంచం అంతా తమిళులే వ్యాపించి వున్నట్లు నమ్మించడం మొదలుపెట్టారు.

ప్రాచీన నాగరకతలైన హరప్పా, ఈజిప్ట్, సుమేరియన్, ఇలమ్ నాగరకతలతో పాటు మెక్సికోలోని ప్రాచీన అమెరికన్ రెడ్ ఇండియన్ల భాషలోనూ, ఇటలీలో

ఎట్రుస్కన్, కేనరీ దీవుల్లో గువాంచీ, బ్రిటన్‌లో సెల్టులు, క్రేట్‌లో మినోవన్లు, లెబనాన్‌లో ఫినీషియన్లు, మారిటేనియాలో బర్బరులు... ఇలా ప్రాచీనజాతుల భాషలన్నింటిలో మూల ద్రావిడపదాలు అనేకం కన్పించాయి. తులనాత్మకంగా పరిశీలించినప్పుడు అవి తెలుగుభాషకు అతి సమీపంగా కన్పిస్తున్నాయి.

'నత్తరు' అనే పదం ఆఫ్రికన్ మండింగ్ భాషలో నెత్తురు అనే అర్థంలో కన్పించినప్పుడు మనం పట్టించుకోకుండా వదిలేయాల్సిన అవసరం ఏముందీ? కానీ, మన పరిశోధకులు ఈనాటికీ అటు దృష్టిపెట్టకోకపోవటమే ఇక్కడ విచారించదగిన విషయం.

## యెహ్వాలు అనే యక్షుల పూర్వకథ

క్రీ.పూ.3000 ఏళ్ళకు ముందు యెహ్ (Yueh) అనే ప్రజలు మొట్టమొదటగా దక్షిణ చైనాలో నాగరకతని వ్యవస్థాపించారని చరిత్ర వేత్తలంటారు. ఈ యెహ్వాలు తెల్లని మంగోలాయిడ్ ముఖం కల్గిన ఇప్పటి చైనావాళ్ళు కాదు. నల్లవాళ్ళు శివారాధకులు. నీటిని వ్యవసాయానికి వినియోగించడం నేర్చినవాళ్ళు. మొక్కల్నీ, గొర్రెల్నీ, మేకల్నీ, ఆవుల్నీ మచ్చిక చేసుకొని పెంచడం తెలిసినవాళ్ళు. చైనాలో మొదటి రాజవంశం ఝూన్ డైనాస్టీ ఏర్పడటంలో వీరి పాత్ర వుంది. వీళ్ళ ఆకారం పాలినీషియన్లు లేదా మెలనీషియన్లలా ఉంటుంది. హరప్పా ప్రజలు ఉపయోగించిన కుండలు వగైరా వస్తు సామగ్రిని వీళ్ళూ ఉపయోగించారు. కాలువలు తవ్వి వ్యవసాయం చేశారు. యాంగజ్ (Yangtz), మెకాంగ్ (Mekang) నదీతీరాలలో విస్తరించారు. వరి, గోధుమలు, జొన్నలు పండించారు.

తర్వాతికాలంలో చైనీయులు వీళ్ళని 'కున్‌లన్'లని పిలిచారు. కులీనులనే (మంచి కులంలో పుట్టినవారు) సంస్కృత పదానికి ఇది అతి దగ్గరగా వుంది. ప్రాచీన చైనా భాషలో కున్‌లన్ బానిసల ప్రస్తావన కన్పిస్తుంది. ఈ కున్లన్ ప్రజలు ఆనాడు మాట్లాడిన భాష పూర్వ ద్రావిడ భాష కావచ్చని, వీళ్ళు ఆఫ్రో ఏసియాటిక్ ప్రజలనీ చైనీ చరిత్రకారులు నిర్ధారించారు.

వీరు వ్యవస్థాపించిన 'యెహ్వా' నాగరకత భవిషత్తులో చైనాలో అన్ని నాగరక జాతులు పరిఢవిల్లడానికి కారణం అయ్యిందట! యెహ్వాలు ప్రాకృత భాషలో 'యెక్కులు' గానూ, సంస్కృత సాహిత్యంలో యక్షులుగానూ కన్పిస్తారు.

మెడిటరేనియన్ నుంచి బయల్దేరిన కుషైట్‌లు ఆఫ్ఘనిస్తాన్ మీదుగా కాశ్మీరాన్ని చేరి యక్కులుగానూ, చైనాచేరి యహ్హ్వలుగానూ ప్రసిద్ధిగాంచారన్నది ఈ పరిశోధనాంశాల సారాంశం. కాశ్మీరీ కుషాణులే ఫిలిప్పైన్స్, జపాన్ సింహళంలలో కూడా విస్తరించి సంస్కృతినీ, భాషను కూడా వ్యాప్తిచేశారు.

## నైలు దగ్గర కుర్రు నుంచి బయల్దేరారు

Cologne Sanskrit Dictionary ని ఆన్‌లైన్‌లో పరిశీలిస్తున్నప్పుడు "కురు" ప్రజల గురించి కొన్ని వివరాలు కన్పించాయి. వీళ్ళు ఇండోటర్కిక్ ప్రజలనీ, ఫినీషియన్లు అంటే వీరేనని ఈ ప్రజలు ఒకదశలో ఈ భూగోళాల్ని తూర్పు పడమరలు మొత్తం ఏలినవారనీ అందులో పేర్కొన్నారు.

డా॥ బూదరాజు రాధాకృష్ణ గారు సుమేరియన్ల వైపు మన చూపునాకర్షించిన గొప్ప పరిశోధకుడు. ఆయన పేర్కొన్న అంశాలివి:

1. సుమేరియన్ భాషలో మెరకనేలల్ని 'కుర్రు' అనీ, పల్లపునేలల్ని 'తుర్రు' అని పిలిచారు.

2. తెలుగు నేలమీద ఎలకుర్రు, మొగల్తుర్రు అనే పేరుగల ఊళ్ళు అనేకం వున్నాయి.

3. కుర్రులు కుర్తులుగానూ తుర్రులు తుర్తులుగానూ మారి, కలువకుర్తి, తుంగతుర్తిలాంటి ఊళ్ళపేర్లు కూడా మనకు ఏర్పడ్డాయి.

4. నైలూనదికి ఎగువన కట్టుకున్న సుమేరియన్ రాజధాని నగరాన్ని 'కుర్రు' అన్నారు.

5. కాస్పియన్ సముద్రానికి దగ్గరగా పల్లపుప్రాంతంలో భూముల్ని తుర్రుభూములు అన్నారు.

6. సుమేరియన్ అస్సీరియన్ భాషలో 'కీ' అంటే భూమి 'తుర్రు+కీ'=తుర్కి అయ్యింది. టర్కీ దేశం పేరు ఇలా ఏర్పడింది.

ఈ దృష్టికోణంలోంచి మనం మరిన్ని విశేషాలు పరిశీలిద్దాం. నైలునది దగ్గర 'కుర్రు' నించి విస్తరణ ప్రారంభించిన మెడిటరేనియన్లు లేదా ఫినీషియన్ల భాషలో కసి, కిష్, కుష్ పదాలు ఎక్కువగా కన్పిస్తాయి.

కాశ్మీర్, హిందూకుష్, కిష్కింధ వీళ్ళవలన ఏర్పడ్డవే! కుశద్వీపం వీళ్ళ స్థావరం అని మత్స్యపురాణం చెప్తుంది. వీళ్లు కుషాణులుగా మధ్య ఆసియా అంతా విస్తరించారు. చైనాలో 'K-san' అనే ప్రాచీన నగరం వుంది. టిబెట్‌లో 'కు-షి' నగరం కూడా ప్రాచీనమే!

సంస్కృత 'శిఖ' అంటే 'Chief' అని. తెలుగులో 'తలవరి' అంటారు. 'కష్+శిఖ' పదాలు కలిసి 'కష్శిఖ' అంటే, కుషాణుల 'నాయకుడు' అని అర్థం. 'కౌశిక' అనే పేరుకి ఇది మూలప్రయోగం కావచ్చు. 'కష్శిఖ' లోంచే క్షత్రియ పదం రూపొందింది. క్షత్రియులు భారతదేశంలో ఆనాడు పాలకవర్గం (Ruling Clan). 'ఖ' అంటే భూమి. ఖట్టైట్స్, (హిట్టయిట్స్) ఇలా ఏర్పడిన క్షత్రియులే కావచ్చు. 'షేక్' అనే పర్షియన్ పదం కూడా ఇలా ఏర్పడిందే!

## అమెరికాలో పూర్వ ద్రావిడులు

అమెరికాలోని మెక్సికో తదితర ప్రాంతాలలో విస్తరించిన రెడ్ ఇండియన్లు కూడా మూల ద్రావిడ భాషా కుటుంబీకులేననేది మరో నిరూపణ. ఇప్పుడు అనేక ద్రావిడ భాషా పదాలు వెలుగులోకి వస్తున్నాయి.

అక్కడ 'ఇంకా' 'మయా' అనే రెండు ప్రధాన తెగల ప్రజలు కన్పిస్తారు. రెండు తెగలవారూ మూలద్రావిడ భాషకు సంబంధీకులే! 'ఇంకా' పదానికి యెక్కు (యక్ష) పదానికి సామీప్యతని పండితులు పరిశీలించవలసివుంది. ఎందుకంటే "కిష్" పదం అమెరికాలో బాగా వినియోగంలోవుంది : గమనించండి:

1. KESHUA = 'ఇంకా' జాతీయులలో అగ్రవర్ణ ప్రజలు.

2. KASHITL = అమెరికన్ అజ్టెక్ జాతి ప్రజలు

3. KASHIKEL = 'మయా' జాతీయులలో అగ్రవర్ణ ప్రజలు

4. KASHEKWA = కారిబియన్, ఫ్లోరిడా ప్రాంతంలో నివసించే రెడ్ ఇండియన్‌లు

5. KUMHUU = 'మెక్సికో'లో పాలకవర్గం.

6. KASHONSEE = 'మెక్సికో'లోనే తారస్కాన్ జాతి నాయకులు.

7. KUSS = ఇది అరిజోనా పదం. ధనవంతుడు అని దీని అర్థం.

8. KASSINA = రక్షించే దేవత

9. KOSHIKWE = 'జూణీ' తెగకు చెందిన పాలకవర్గం.

"కిష్" అనేపదం ఇతర ప్రపంచ భాషల్లో అనేకచోట్ల కన్పిస్తుంది. పరిశీలించండి :

కుష్ = ప్రాచీన ఈజిప్ట్ పాలకులు, ఇథియోపియాలో రాజవంశీకులు

కైస్ = ఆఫ్ఘనిస్తాన్ పాలకులు.

కిష్ = పర్షియాలో అనువంశిక పాలకులు

కస్సి = వీళ్ళని 'కస్సైట్స్' అంటారు. ప్రాచీన అస్సీరియా పాలకులు

కస్త్ర = రోమన్ల అనువంశిక పాలకులు

కిష్ = కాశ్మీరీ పాలకులు

కిష్కింధ = తెలుగు ప్రాంతంలో విస్తారమైన భూభాగం.

క్షత్రియ = భారతదేశంలో అనువంశిక పాలకులు

కొస్సాయి = పర్షియా లేదా ఇరాన్‌లలో అధికారగణం

క్షాత్రప్ = తొలి గ్రీకు పాలకులు

కాస్ట్రో = స్పెయిన్‌లో ఒకనాటి పాలకవర్గం. ఫిడెల్‌కాస్ట్రో పేరులో ఈ పదం ఇంకా సజీవంగా ఉంది.

కేజర్ లేదా కీజర్ = దీన్ని (Caesar) సీజర్ అని భ్రష్టరూపంలో పలుకుతున్నారు. కానీ,'కిష్' పదంలోంచే పుట్టింది. క్షత్రియ అనే అర్థంలో షామి రోమన్ ప్రభువుల బిరుదనామం అది.

కైజర్ = జర్మన్ ప్రభువుల బిరుదనామం

జార్ KZAR = రష్యాను సుదీర్ఘకాలం పాలించిన ఆఖరి రాజవంశం. ప్రాచీన ఇండోటుర్కిక్ (కురు) ఫినీషియన్లకు వీళ్లు వారసులు అని తాజా పరిశోధనలు చెప్తున్నాయి.

"Hopin of Mayans Hold the Keys to the origins of American Indians" పేరుతో Gene D. Matlock అనే పరిశోధకుడు అమెజాన్ వెబ్‌సైట్‌లో ఆలోచనా స్ఫోరకమైన ఒక వ్యాసంలో ఈ వివరాలు అందించాడు.

మహాకాశ్యపుడు అయిన సూర్యభగవానుడి పేరున 'కాషి' అంటే, భారత వంశీకులేనని ఈ వ్యాసంలో ఆయన సవివరంగా నిరూపించాడు. జంబూద్వీపే, భరతవర్షే, భరతఖండే అని మనం చెప్పుకునే సంకల్పంలో భరతవర్షం అంటే మధ్యధరా సముద్రం (Meditarenian) (లేదా) కాశ్యప సముద్రం (Cospian) తో ప్రారంభించి చైనా సముద్రం వరకూ విస్తరించిన భూభాగమేననేది ఆయన నిరూపణల సారాంశం.

## తెలుగు నేలమీద అనేక జాతులు కలిసి తెలుగే మాట్లాడారు

యక్షులు కాశ్మీర్, చైనా, మలేషియా, జపాన్ తదితర ప్రాంతాలతోపాటుగా సింహళ ద్వీపం (శ్రీలంక)లో కూడా తొలి నాగరకతని వ్యవస్థాపించినవారిగా సింహళ పరిశోధకులు భావిస్తారు. యక్షుల రాజు కుబేరుడు సింహళంలో రాజ్యస్థాపన చేయడం, సవతి సోదరుడు రావణుడితో అతనికి విభేదాలు ఈ వృత్తాంతం రామాయణంలో వుంది మనకు తెలుసు.

విశేషం ఏమంటే, ఉత్తర అమెరికా ఖండాన్ని QUIVIRA అంటారు. ఇది కుబేర పదంలోంచే ఏర్పడిందని పండితుల భావన. 'కుబేర' ఖైబర్ కనుమలకు మూలరూపం. అంటే, కుబేరపదం తూర్పు పశ్చిమ భూఖండాలు రెండింటా వ్యాపించి వున్నదన్నమాట. ఈ యక్షులతో కృష్ణాతీరంలో తెలుగువారికి గల సంబంధాల గురించి ముఖ్యంగా జైన సాహిత్యంలో చాలా వివరాలు కన్పిస్తాయి.

పల్లవ బొగ్గం లేదా పల్నాడు నుంచి (కృష్ణకు ఆవలి తీరం) మహేంద్రుడు అశోకుడి పక్షాన అనేక వందలమంది తెలుగువారైన యక్షుల్ని, నాగుల్ని వెంటబెట్టుకుని సింహళం వెళ్ళినట్లు మహావంశ తదితర బౌద్ధ గ్రంథాలలో వుంది.

నిర్మాణ కళాకౌశలం కలిగిన యక్షులు, నాగులు సింహళంలో బౌద్ధమత వ్యాప్తికి తోడ్పడ్డారు. దక్షిణాదిన అనేక చైత్యారామాల నిర్మాతలు వీళ్ళేనని, మౌర్యసామ్రాజ్య పతనం తర్వాత క్రీస్తుపూర్వం చివరి శతాబ్దాలలో తెలుగు వారితో సింహళానికి ఎక్కువ సంబంధాలు బలపడ్డాయని India in ceylonies History, Society and culture గ్రంథంలో ఎం.డి. రాఘవన్ పేర్కొన్నాడు. మొట్టమొదటి బౌద్ధస్తూపం, బుద్ధ విగ్రహాలు కృష్ణాతీరం నుంచే సింహళానికి వెళ్ళాయని ఆయన అనేక ఆధారాలను ఈ గ్రంథంలో ఉటంకించాడు.

ఈ నిరూపణలన్నీ పరిశీలిస్తే, మూల ద్రావిడభాష మాట్లాడిన యక్షులు నైలూ నుంచి బయల్దేరి దక్షిణ భారతదేశంలో కృష్ణాతీరం వరకూ విస్తరించి తెలుగు వారిగా స్థిరపడినట్లు కన్పిస్తుంది. ప్రపంచంలో అనేక దేశాలలో వీరి ఉనికిని నిర్ధారించే సాక్ష్యాలు దొరుకుతున్నాయి.

రామాయణంలో యక్షనాయకుడు కుబేరుడి సోదరుడైన రావణుడితో కలిసి "లంక"కు వెళ్ళినట్లు, రావణుడు కుబేరుణ్ణి లంకనించి తరిమేసినట్లు వుంది. తెలుగువారిది బహుళజాతి సమాజం (Multiple Society) యక్షులు, నాగులు తదితర జాతీయులు అందరూ తెలుగు భాషనే మాట్లాడుతూ సహజీవనం సాగించారు. బెలూచిస్తాన్‌లో 'బ్రాహుయి' , ఆఫ్ఘనిస్తాన్‌లో 'పపాయి' కాశ్మీర్‌లో 'శీనా' ఇవన్నీ ద్రావిడ భాషాజన్యమైనవే! వీటిని దార్డిక్ భాషలంటారు. పైశాచి వీటికి సంబంధించినదే! రావణుడు తెలుగుభాషకి వ్యాకరణం రచించాడన్న ప్రచారంలో కొంత నిజం వుండేందుకు అవకాశం తప్పకుండా వుంది!

పైశాచి భాష తెలుగు (లేదా) ఆంధ్రానికి దగ్గరగా వుండివుంటుంది. అందుకే కాశ్మీరంలోని దేశిప్రాకృతాన్ని, అప్పటికే రాజ్యం ఏలుతున్న సంస్కృతాన్నీ వదిలేసి ప్రజలభాష అయిన పైశాచీలో ప్రజాసాహిత్యాన్ని సృష్టించదలినట్లు గుణాఢ్యుడు తన 'బృహత్కథ'లో పేర్కొన్నాడు. దాని కాశ్మీరీ మూలానికి ఇంగ్లీషు అనువాదం ద్వారా ఈ గ్రంథం బాగా వ్యాప్తిలోకి వచ్చింది.

కాశ్మీరానికి యక్షులో, నాగులో లేదా మరెవరో తెలుగువారు తరలి వెళ్లేప్పుడు ఈ బృహత్కథని వెంట తీసుకుని వెళ్లివుండాలి. కుబేరుడు హిమాలయాలకు తిరిగివెళ్ళిపోయినట్లు రామాయణం చెప్తోంది కదా!

## అమెరికాకు అలలుగా సాగిన ఆనాటి వలసలు

రెండు వందల ఏళ్ళక్రితం Alexander Von Humboldt అనే చారిత్రకవేత్త అమెరికన్ ఇండియన్ మహోన్నత నాగరకతకి 'ఆసియా' మూలరూపం అయివుంటుందని మొదటగా ఊహించాడు.

పూర్వకాలంలో ఆసియాదేశాల ప్రజలకి సముద్రం దాటి, అవతలి దేశాలకు వెళ్ళేటంత పరిజ్ఞానం లేదని ఇప్పటికీ వాదించే చరిత్రకారులు లేకపోలేదు. పసిఫిక్ సముద్రాన్ని దాటగలిగిన యంత్రాంగం ఆనాటి ఆసియన్లకు, వారి ఓడలకూ లేదని వీళ్ళనమ్మకం.

Cuara Rubias అనే మెక్సికన్ రచయిత భిక్షూ చమన్‌లాల్ గారి హిందూ అమెరికా గ్రంథానికి ముందుమాట రాస్తూ, ఆసియా నుంచి 15 వేల ఏళ్ళ క్రితం పూర్వద్రావిడులు అమెరికా ఖండాలలోకి అడుగు పెట్టి వుంటారని భావించాడు. అప్పటికి భారత్‌తో సహా ఆసియాదేశాలన్నింటా పాతరాతియుగం నడుస్తోంది. గుహ జీవితంలోంచి సహజీవనంలోకి మనిషి పరిణమిస్తున్న కాలం అది! కుక్కల సహాయంతో వేటాడి జీవిస్తున్నదశ అది. సుఖంగా వేటాడేందుకు అవకాశంవున్న ప్రాంతాల్ని వెదుక్కొంటూ వలస బయల్దేరారనీ, ఆయన పేర్కొన్నాడు.

ఈ వలసలు అలలు అలలుగా సాగాయి. ఒక అల మరొక అలని ఉత్తరానికో, దక్షిణానికో మరో దిక్కుకో నెట్టుతుంది. ఇలా నెట్టుకొంటూ పోతున్నప్పుడు, మూలస్థానంతో సంబంధాలు పూర్తిగా తెగిపోతాయి. ఎక్కడికక్కడ కొత్తజాతులతో సంలీనం చెందుతూ స్వతంత్ర జాతులుగా (Homogenous Races) మారిపోతారు. అమెరికన్ ఇండియన్లు అలానే రూపొందారు. వీరిలో 1. Australoid, 2. Negroid 3. Algonquin, 4. Eskimo, 5. Mongoloid, 6. Melanesian - Polynesian జాతుల మూలాలు కన్పిస్తాయని Glad Win అనే పరిశోధకుడు పేర్కొన్నాడు.

## కేనరీ దీవుల్లో తెలుగుపదాలు విన్పించేవి

ఏడు ద్వీపాలతో, ఏడు సముద్రాలతో ఈ భూమండలం అంతా నిండిఉందని అష్టాదశపురాణాలు, రామాయణ భారతాలు చక్కగానే వివరించాయి. "సప్తద్వీపా వసుంధరా" అని మార్కండేయ పురాణం స్పష్టంగానే చెప్పింది. సప్తద్వీపసాగర సమేతమైన ఈ భూమండలంలో ఒక ప్రాంతం నుంచి మరొక ప్రాంతానికి సాంస్కృతిక, సామాజిక, రాజకీయ వాణిజ్య, భాషాపరమైన సంబంధాలు విస్తృతంగానే నడిచాయి.

మన పురాణాల్లో ద్వీపం అనే పదాన్ని నాలుగువైపులా నీరు కల్గిన ప్రాంతం (Inland) అనే కాకుండా రెండు లేక మూడు వైపులా నీరుకల్గిన (పెనిన్సులార్) ప్రాంతం అని కూడా భావించారు.

ఆసియా ఖండాన్ని జంబూద్వీపంగానూ, "ఆసియామైనర్"ని అంటే "మెడిటరేనియన్ ప్రాంతం ప్లక్షద్వీపంగానూ, ఆఫ్రికా ఖండాన్ని శాల్మలిద్వీపంగానూ, ఐరోపా ఖండాన్ని కుశద్వీపం గానూ, ఉత్తర అమెరికాని క్రౌంచద్వీపం, దక్షిణ అమెరికాని శాకద్వీపంగానూ, ఆస్ట్రేలియా పరిసర ప్రాంతాలన్నిటినీ పుష్కర

ద్వీపంగానూ భావించినట్లు చరిత్రకారులు నిర్ధారించారు. శ్రీ కుందూరు ఈశ్వరదత్తు "ప్రాచీనాంధ్ర చారిత్రక భూగోళం"లో చిత్ర పటాలతో సహా ఈ వివరాలున్నాయి.

ఇవికాక, అనేకలోకాల్ని కూడా చెప్పడం జరిగింది. అందులో 'అతల' లోకం, పాతాళలోకం కన్పిస్తాయి. భిక్షుచమన్‌లాల్ "హిందూ అమెరికా" గ్రంథంలో పాతాళం అంటే అమెరికాఖండాలేనని భావించాడు.

"అరీజియో నూనిస్ దాస్ శాంతోస్" అనే చరిత్రకారుడు "అట్లాంటిస్ ఇన్ ద వరల్డ్" అనే గ్రంథాన్ని 1997లో వెలువరించాడు. ఇందులో 'అతల'అని భారతీయ పురాణాలు చెప్పిన లోకమే 'అట్లాంటిస్'గా పిలువబడే అట్లాంటిక్ సముద్రం లోని కేనరీ దీవులని (Canary islands) నిరూపిస్తూ, ఒక అద్భుతమైన అధ్యాయం రాశాడు.

భారతదేశంలో భాషావేత్తల్ని ఈపుస్తకం ఎంత కదిల్చిందో చెప్పలేనుగాని, ద్రావిడ భాషలమీద విశేషకృషి చేస్తున్న విదేశీ భాషావేత్తలలో ఇది సంచలనాన్ని కలిగించింది.

ఆఫ్రికా ఉత్తర భాగానికి ఆగ్నేయంగా కేనరీ దీవులున్నాయి. 14వ శతాబ్దిలో ఫ్రెంచివారు, 15వ శతాబ్దిలో స్పెయిన్ ఈ దీవుల్ని ఆక్రమించే వరకూ అక్కడ "గువాంచీ" అనే భాష మాట్లాడిన ప్రజలు జీవించేవారు. స్పానిష్ ముష్కరులు వాళ్ళని ఊచకోతకోసి ఆ దీవుల్ని ఆక్రమించారు. అక్కడితో కేనరీ దీవుల్లో గువాంచి సంస్కృతి పూర్తిగా తుడిచిపెట్టుకు పోయింది. పూర్వపు ఈ గువాంచి భాషలో కొన్ని పూర్వద్రావిడ పదరూపాలు కన్పిస్తాయి. అంటే, ఒకప్పుడు అక్కడ తెలుగుపదాలు విన్పించేవన్నమాట.

ప్లినీ' క్రీస్తు శకం తొలిశతాబ్దాలలో ఆనాటి ప్రపంచ దేశాల చరిత్ర రాస్తూ, ఈ దీవుల్లో అత్యధికంగా కన్పించే ఎర్రకుక్కల్ని చూసి లాటిన్ భాషలో 'కేన్స్'అని పిలిచాడు 'కేన్' అంటే ఎర్రకుక్క. అలా ఈ దీవులకు కేనరీ దీవులని, కేనరీస్ అని పేరు స్థిరపడింది. కేనరీదీవులకి, భారతదేశానికీ సంబంధం ఏమిటనేది ఇక్కడ ప్రశ్న!

## అమెరికాలో 'మెరక' తెలుగు అర్థమే!

ఉత్తరం వైపు నుంచి వచ్చే ఋతుపవనాలని గ్రీకులు "బొరియాస్" అన్నారు. బొరియాస్ అనేది "వరాహ" పదానికి గ్రీకు భ్రష్టరూపం అంటాడు అరీజియో నూనిజ్. వరాహ అనేది వాయుదేవత ఆరాధనకు సంబంధించిన పదం. ఈ ఉత్తర ఋతుపవనాలకు దూరంగా వున్న ప్రాంతాన్ని "హైపర్ బొరియన్స్" అంటారు.

గ్రీకులు 'బొరియాస్' అని పిలిచినదాన్ని లాటిన్‌లో 'అక్విలాన్'అన్నారు. "ప్లినీ" ప్రపంచ దేశాల చరిత్రలో హైపర్ బొరియన్స్ గురించి రాసిన విషయాలు ఇక్కడ ప్రస్తావించడం చాలా అవసరం.

"అక్విలాన్‌కు దూరంగా హైపర్ బొరియన్స్ అనే ఒక గొప్పదేశం వుంది. ఇక్కడ మనుషులు సుదీర్ఘకాలం జీవిస్తారు. వీళ్ళని గురించిన ఎన్నో అద్భుత విశేషాలున్నాయి. ఈ ప్రపంచపు ద్వార బందులు, నక్షత్రలోకపు అంచులు ఈ హైపర్ బొరియాలోనే వున్నాయని చెప్తారు. ఈదేశం సూర్యరశ్మిలో స్నానం చేసింది. చక్కని ఆహ్లాదకర వాతావరణం వుంటుంది ఇక్కడ. వ్యాధులనేవే వుండవు. ఈ దేశంలో ఎవరూ సహజంగా మరణించరు. జీవించినంతకాలం జీవించి, ఇంక విసుగొచ్చి ఒక పెద్ద పర్వతం మీదకి ఎక్కి అక్కడినుంచి సముద్రంలోకి దూకి మరణిస్తారు. అలా సునాయాసంగా మరణించాలని వాళ్ళ కోరిక!" ఇదీ ప్లినీ చేసిన బొరియన్ల వర్ణన.

ప్లినీ వర్ణించిన ఈ అపర స్వర్గ భూమి ఏది? వివిధ ప్రాచీన జాతులు స్వర్గతుల్యమైన ప్రాంతాలుగా వర్ణించుకున్న అవలాన్, హైపర్ బొరియా, థువె, తప్రొబనే. ఈడెన్, ప్యారడైజ్, ఇడున్... ఇవన్నీ ఒకే నేలగురించి, ఒకే దేశం గురించి వర్ణించాయంటాడు "అరీజియో నూనిజ్" ఆ ఒకే ఒక నేల ఏది?

విధివశాత్తూ, ఈ అపర స్వర్గలోకం (Paradise) ఒకసారి జలప్రళయంలో మునిగిపోయిందట...! ఈ స్వర్గ వాసులంతా చెల్లాచెదురుగా ప్రాణరక్షణ కోసం పారిపోవలసి వచ్చింది. జుడియో క్రిస్టియన్లు 'నోవా' నాయకత్వంలోనూ, భారతీయ పురాణాలు 'మనువు' నాయకత్వంలోనూ సురక్షిత ప్రాంతాలకు తరలి వెళ్ళినట్లు వర్ణించుకున్నారు. ఈనియాస్, హెర్క్యులస్, ఫొరొనియోస్,... ఇవన్నీ ప్రకృతి వైపరీత్యాల సమయంలో భూదేవిని రక్షించిన మత్స్యావతారం లాంటి యోధులపేర్లే!

జలప్రళయంలోంచి బైటపడిన ఈ స్వర్గవాసులు ఎక్కడికి వెళ్ళారు... ఎలా వెళ్ళివుంటారు అనేవి ప్రశ్నలే! "గువాంచీ"లుగా పిలువబడిన ప్రజలు కేనరీ దీవులకు ఎలా చేరారు అనే ప్రశ్నకు జవాబు దొరికితే, నోవా-లేదా మనువు నాయకత్వంలో అమరులు ఎక్కడికి వెళ్ళారనే ప్రశ్నకు సమాధానం దొరుకుతుంది... అంటాడు "అరీజియోనూనిజ్".

బహుశా ప్రాచీన ఫినీషియన్లు గాని, ఎట్రుస్కన్‌లుగాని, సముద్ర జీవులుగా, నావికులుగా పేరొందిన ఆనాటి మరెవరైనా ప్రజలు గానీ - వీళ్ళని తూర్పునుంచి

పశ్చిమానికి ఆఫ్రికాకు అవతల ఆగ్నేయంగా వున్న కేనరీ దీవులకు చేర్చి వుండవచ్చు. ఈ తరలింపు అంచెలంచెలుగా జరిగి వుంటుందనీ ఒక్కో ఓడనెక్కిన ప్రజలు ఒక్కో సముద్ర తీర ప్రాంతానికి చేరి స్థిరపడి ప్రత్యేకజాతిగా రూపొంది వుంటారనేది నూనిజ్‌గారి భావన.

మారిటేనియాలో బర్బరులు, లెబనాన్‌లో ఫినీషియన్లు, క్రేట్‌లో మినోవన్లు, ఇటలీలో "ఎట్రుస్కన్‌లు", బ్రిటన్‌లో సెల్టులు, ఇలానే స్థిరపడ్డారని ఒక ఊహ. ఇక్కడే ఒక ముఖ్య విషయం చెప్పాలి. కేనరీస్‌లో స్థిరపడిన "గువంచీ"ల భాషలోగాని, ఇటలీలో స్థిరపడిన "ఎట్రుస్కన్"ల భాషలోగాని ద్రావిడ పదాలు అనేకం కన్పించడానికి జలప్రళయంలో జాతులు చెల్లాచెదురు కావడమే కారణం అనే ఆలోచనకు "అరీజియోన్యూనిస్" అంకురార్పణ చేశాడు. వాటిని అందుకొని పరిశీలించవలసిన బాధ్యత మనకుంది!

"ఆల్‌బెరిగో వెస్పుచ్చి" అనే కవి పేరున 'అమెరిగో' అనే పదం క్రమేణా అమెరికాగా మారిందని భావించేవారు. ఇలాంటివే ఇంకా అనేక నిర్వచనాలున్నాయి. సెల్టిక్ భాషలో 'అర్-మోర్'అంటే, "సముద్రానికి ఎగువన" అని అర్థంచెప్తారు. కానీ, ఈ నిర్వచనాలన్నీ పక్కన బెట్టి, "అరీజియో నూనిజ్" అమెరికా అనే పదం ద్రావిడ భాషలో "అర్-మోర్-ఇక" అంటే, సముద్రంలో మునిగిపోగా మిగిలిన భాగం the remaing part of the sub- mersible land అనే అర్థం వస్తుందని పేర్కొన్నాడు. అమెరికా పదానికి తెలుగులో ఈ అర్థాన్ని ఇలా సాధించవచ్చు:

మునగకుండా మిగిలిన భాగాన్ని 'మెరక' అంటారు. తెలుగులో "ఆఱు"అంటే నేల(లేదా)-సీమ. ఆర్-మెరక అంటే, "మెరకనేల" "మెరకసీమ"అని! ద్రావిడ భాషలకు సంబంధించిన ఏ అంశమైనా తెలుగు భాషకు సమీపంగా వుంటుందనడానికి ఇది సాక్ష్యం! ఆరీజియోనూనిజ్ ప్రకటించిన సిద్ధాంతాన్ని ఈ కోణంలోంచి మనం పరిశీలించవలసి వుంటుంది. అమెరికాలోని స్థానికులైన రెడ్ ఇండియన్లు తమదేశంపేరు 'అమెరికా' అని చెప్పబట్టే యూరోపియన్లు ఆ పేరుతో పిలిచారు అంతేగాని, వేరెవరో ఆ పేరుని పెట్టారనడం సరికాదనేది ఇక్కడి వాస్తవం.

## మయుడు ద్రావిడ భాషా కుటుంబీకుడా?

❮ దక్షిణ అమెరికా ఖండంలో "మయా జాతి" నాగరికత గురించి అందరికీ తెలుసు. భిక్షు చమన్‌లాల్ మయాజాతి ప్రజలకు భారతీయులకూ గల సంబంధాల

గురించి "హిందూ అమెరికా" గ్రంథంలో చాలా విశేషమైన చర్చ చేశాడు. 'మెక్సికో' తదితర ప్రాంతాలలో "మయా" ప్రజల నాగరక విశేషాలు ఈ గ్రంథంలో చాలా వున్నాయి. అదనంగా, మరికొన్ని విశేషాలు ముచ్చటించుకోవాల్సినవి వున్నాయి.

నిజానికి ఈ మయా పదానికి, వేదాంత భాషలో చెప్పిన 'మాయ'కూ చాలా దగ్గర సంబంధంవుంది. ఋగ్వేదంలో "రూపం" 'మాయా', అనే రెండుపదాలకూ విశేష ప్రాధాన్యత వుంది.

"అనేక ఋక్కులు 'రూపా'న్ని ఒకనిలకడలేని మాయా రూపంగానే (Deceptive, Transient) భావించాయి. ఋగ్వేదంలో రూపం అంటే స్పష్టమైన ప్రత్యక్షరూపం (Real form) కాదు. 'మాయ' తన అపూర్వ నిగూఢ శక్తితో (Occult Power) రూపాన్ని ధరించడంగానీ, వదిలేయడం గానీ చేస్తుంది..." ఇది మాయ, రూపాలకు వింటర్‌నిజ్ చెప్పిన వివరణ. ఆవెస్తాలో కూడా మాయ అనే పదం ఇదే అర్థంలో కన్పిస్తుంది. "ది వేదిక్ ఏజ్" గ్రంథంలో ఆర్.సి.మజుందార్ ఈవిషయాలు పేర్కొంటూ, మాయ, రూపం అనే పదాలు 'వేదాది'అనీ, వీటిని విస్తరించి వేదాంతం ఏర్పడిందనీ అంటాడు.

ఈ 'మాయ'కు పురుషరూపమే మయుడు. ఇతను నాగరకతను వివిధ ఖండాలలో వ్యాప్తిచేసినవాడుగా రామాయణ భారతాలలో కన్పిస్తాడు. లంకానగర నిర్మాత ఇతనే! భారతంలో మయుడు నిర్మించిన ఒక అపూర్వ సభాభవనం ఎలాంటి మలుపులకు కారణం అయ్యిందో మనకు తెలిసినదే! ఈ మయుడే వేదకాలంనాటి కొందరు ప్రజలు అమెరికాలో స్థిరపడటానికి కారణమయ్యాడని భిక్షుచమన్‌లాల్ నుంచి అరీజియో నూనిజ్ వరకూ చాలా మంది చరిత్రకారులు పేర్కొన్నారు. అయితే, అనేక ప్రాచీన జాతులు ఈ మయుణ్ణి రకరకాల పేర్లతో పిలిచాయి. అతి ప్రాచీన ఫినీషియన్ల నాణాలమీద కన్పించే హెర్క్యులియన్ స్తంభాలు మయుడి ఆరాధనకు సంబంధించినవేనంటాడు అరీజియో నూనిజ్. మయుడు ద్రావిడ భాషా కుటుంబీకుడేననేది ఆయన ప్రతిపాదన.

## ద్రావిడులు క్షత్రియులా?

భారతీయ సమాజంలో కన్పించే చాతుర్వర్ణ్య వ్యవస్థ కేవలం ఇక్కడ మాత్రమే పుట్టిపెరిగిన విషవృక్షం కాదు. ఇది ప్రపంచ వ్యాప్తంగా విస్తరించిందే! అలా విస్తరింపచేసిన చారిత్రక పరిణామాలను నిష్పక్షపాతంగా అధ్యయనం చెయ్యగలగాలి.

బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్ర విభజనతోపాటు తెలుపు, ఎరుపు, పసుపు, నలుపు అనే నాలుగు రంగుల్లో వుండే మనుషుల్ని చాతుర్వర్ణ వ్యవస్థగా ఋగ్వేద కాలంలో చిత్రించడం జరిగింది.

ఆర్యులు తమని తెల్లని వారుగా చెప్పుకొని బ్రాహ్మణులు (Priests)గా చెప్పుకున్నారు. మిగిలిన ఎరుపు, పసుపు, నలుపు మనుషులు నిస్సందేహంగా ఆర్యేతరులైన ప్రజలే అనేది స్పష్టం.

బైబిల్‌లో నోవా, అతని ముగ్గురు కుమారుల కథకూడా ఈ నాలుగు రంగుల మనుషుల్ని ప్రస్తావిస్తుంది.

ఫినీషియన్ల పేరు గ్రీకు భాషలో ఫొయినిక్స్ (ఫినిక్స్). (Phoinikes) అంటే 'ఎరుపు'. ఈజిప్షియన్లు తమని ఖామిస్, ఖేమిస్ అని పిలుచుకున్నారు. ఖమ్, ఖేమ్ పదాలు ద్రావిడ భాషాపదాలంటాడు అరీజియోనూనిజ్. ఇవే క్షత్రియ పదంగా రూపొందాయంటాడు -

చాతుర్వర్ణ వ్యవస్థలో ఎర్రరంగు కల్గిన క్షత్రియులే ద్రావిడ భాషమాట్లాడిన ప్రజలు అనేది అరీజియోగారి భావన. కేనరీస్ పేరులో కన్పించే ఎరుపుకూడా దీనికి సంబంధించినదేనని ఆయన అభిప్రాయం. కేనరీ దీవుల్లో 'గువన్-చి' అనేపదం 'ఖమ్-చి'అనే అర్థంలోంచి ఏర్పడింది. ఎర్రని క్షత్రియుల దేశం అని అర్థం...." అనేది అరీజియోనూనిస్ గారి నిరూపణ.

జలప్రళయం అనేది ఇండోనేషియా ప్రాంతాల్లో జరిగి వుంటుందంటాయన. అందులోంచి బైటపడి, చెల్లా చెదురై తలా ఒక దిక్కుగా ప్రయాణించిన ప్రజలు ప్రపంచం నలుమూలలా విస్తరించారు. కేనరీ దీవుల్లోనూ, అమెరికాఖండంలోనూ చేరింది వీరేనని స్థూలంగా అరీజియో నూనిస్ గారి పరిశోధనా సారాంశం. ఈ ప్రజలు మాట్లాడిన గువంచి భాష ద్రావిడభాషే! అయితే, ఆ భాషని మాట్లాడే ప్రజలు ఇప్పుడు ఒక్కరు కూడా లేకపోవడంవలన స్పష్టమైన నిరూపణ కష్టసాధ్యమే అవుతుంది. అయినా, అరీజియో నూనిజ్ అనేక ద్రావిడ భాషా పదాలను ఏరి చూపించగలిగారు. అవి తెలుగు భాషకు ఎంత దగ్గరగా ఉన్నాయో మనం గమనించవచ్చు.

గువంచి భాషాపదానికి తెలుగు పదాలకు శబ్ద సాదృశ్యంతోపాటు, భావసాదృశ్యం కూడా ఈ పట్టికలో మనం గమనించవచ్చు.

# గువంచి భాషలో తెలుగు పదాలు

| | గువంచి పదం | ఇంగ్లీషుఅర్థం | ద్రావిడపదం | తెలుగు సమానార్థకం |
|---|---|---|---|---|
| 1. | అచ్చుమన్ | Heaven | Ox-am-an | అచ్చి = తల్లి దేవత<br>అచ్చిమనము, అజ్జిమనము = స్వర్గం |
| 2. | అచనొ | year | ajja - no | అజ్జ = సమయం |
| 3. | అచ్చుమేక్ | Mother, grand Mother | Acchi-mayi-ek | అచ్చి = శ్రేష్ఠమైన, స్వచ్ఛమైన, మె = స్త్రీ (ఆమె, ఈమె అన్నట్లు) |
| 4. | అచికో | Leather Shirt | Ayi-kov | రవిక (Breast cover) అవిక లేదా అయిక దీనికి మూలపదం కావచ్చు |
| 5. | అహోరెన్ | Barley-Bread | Av-ari | వరి |
| 6. | అనేప | Royal Staff | Anne-Pal | అన్ అంటే 'పెద్ద'. అన్న ఇందులోంచే వచ్చింది. రాజు, పాలకుడు కూడా |
| 7. | అర | Goat | Ar | ద్రవిడియన్ ఎటిమొలాజికల్ డిక్షనరీలో AAV అంటేమేక అని ఉంది.<br>తెలుగులో అరువు అంటే పశువు. అరువు ద్రిక్క = పశువుల వ్యాధి |
| 8. | అర్మైన్ | Grassland | Aram-meyni | అఱ = స్థలము (తెలుగు) (ఉదా॥ అఱచెయ్యి. అఱకాలు)<br>అఱుము = అభివృద్ధి, అఱుగు = వేదిక |
| 9. | బనోట్ | Javelin | Ihpa-not | బల్లెము |
| 10. | బెనాస్మెన్ | Crop | PANNA-AS-MEN | ద్రవిడియన్ ఎటిమోలాజికల్ డిక్షనరీలో పన్న = To become |

| | | | | |
|---|---|---|---|---|
| | | | | ripe అని తెలుగు అర్థంగా పేర్కొన్నారు. |
| 11. | ఎరి | Pond | Eri | ఏరు |
| 12. | గనిగొ | Pot, Jar | Kann-IKU | కన్ననం = కుండ |
| 13. | గొఫియో | Bread | Guvi-U | యవాగువు = యవధాన్యపు జావ |
| 14. | గువన్ | Man | GAND | గండడు |
| 15. | గ్వనామెని | Prophet, Seer | Kan-Amani | కన్నయు, కణ్వ |
| 16. | గన్వర్ -టెమి | King of the Nation | Gan(d)-ak-Tempe | గండడు, గండర గండడు |
| 17. | హచిచేయ్ | Peas, Beans | a-chick-kay | చిక్కుడు కాయ |
| 18. | ఇరిచెన్ | stain | Jiz | వరి, అరిసి |
| 19. | మగెక్ | God | Mangen (Bull-shiv) | మంగళ = పార్వతి |
| 20. | సిగోణి | Captain | CEK-KON | చేక్కరవర్తి |
| 21. | జెర్కొ | Sandals | Cherpu | చెప్పులు |
| 22. | జకొ | Mummy, corpse | CHACCHU | చచ్చు |
| 23. | అగువరి | Paradise (valley) | Akan-e (Celestial Heights) | ఆకరము (పుట్టుచోటు - పితృలోకం) |

ఈ నిరూపణలన్నీ నిస్సందేహంగా మనలో కొత్త ఆలోచనల్ని రేకెత్తిస్తాయి. ప్రపంచ నాగరకతకు మూలాలను వెదికితే అందులో తెలుగు భాషకు సంబంధించిన పేర్లు కూడా కనిపిస్తాయి. చరిత్రని, చరిత్ర నేర్పుతున్న పాఠాల్ని మరిచిపోయిన వారే నన్నయతో తెలుగు భాషను ప్రారంభిస్తారు. అరీజియో న్యూనిజ్ పరిశోధనలు భారతదేశంలో వైదిక యుగంలోనే ద్రావిడులు నిర్వహించిన పాత్రని సూచిస్తున్నాయి. ఆర్యద్రావిడ మిశ్రమ సంస్కృతి ఏదో అమెరికాఖండాన్ని చేరినట్లు ఈ నిరూపణలు సాక్ష్యం ఇస్తున్నాయి.



# 6
# ప్రాచీన సుమేరియన్లకు తెలుగువారితో పోలికలు

## దక్కన్‌లో మొదటి నాగరక మానవుడు

**పూర్వద్రావిడ** భాష అనేది ఒక ఊహాత్మకం. అది ఎలా వుంటుందో కచ్చితంగా తెలీదు. కానీ, అది తెలుగుకు చాలా దగ్గరగా వుంటుందనీ, పూర్వద్రావిడులు మన తెలుగువారిలాగే వుండేవారనీ, సుమేరియన్లూ, అత్యంత ప్రాచీనులైన ఆఫ్రికన్లు కూడా తెలుగువారి పోలికల్లోనే వుండేవారనీ స్పష్టంగా పేర్కొంటున్న పరిశోధనలు అనేకం వున్నాయి. వాటిని తెలుగువారికి తెలియజేయడంలో ఇంతకన్నా జాప్యం జరగకూడదు, ఒకనాడు తెలుగుజాతి ప్రాచీనత విశ్వవ్యాప్తంగా విలసిల్లిందనే వాస్తవాన్ని ప్రజలకు చాటిచెప్పాలి.

నిజానికి మూలద్రావిడులు (Proto Dravidians ) సింధు నాగరకతనే కాదు. ఈజిప్ట్, సుమేరియన్ నాగరకతలక్కూడా నిర్మాతలేననే సత్యాన్ని 1920 నాటికే స్వదేశీ పండితులు కొందరు గుర్తించారు. కానీ, ఆర్యులదాడి (Aryan Invasion Theory ) సిద్ధాంతం వీరి గొంతునొక్కేసింది.

1925లో టి.ఆర్. శేష అయ్యంగార్ కేంబ్రిడ్జ్ "హిస్టరీ ఆఫ్ ఇండియా" గ్రంథంలో సుమేరియన్లకి ద్రవిడియన్లతో ఎక్కువ సంబంధంవుందని పేర్కొన్నాడు. అదే రోజుల్లో డా॥ చటర్జీ ద్రవిడియన్లు మెడిటరేనియన్లు ఒకే పోలికలో వుండేవారని ప్రకటించాడు.

1929లో ఎల్.ఎ. వాడెల్ "ది మేకర్స్ ఆఫ్ సివిలిజేషన్" గ్రంథంలో విశ్వామిత్రుడి నించి శ్రీరామచంద్రుడి వరకూ ఎందరో రాజులు, రాజర్షులు, మహర్షుల చరిత్రలు సుమేరియా తదితర ప్రాంతాలలోని త్రవ్వకాలలోంచి విశ్లేషించి చూపించాడు.

రిమ్ - సిన్ II (లేదా) బుర్-సిన్ II అనే చక్రవర్తి అగుడు రాజ్యాన్ని పాలించేవాడు. ఈ రిమ్‌సిన్ కథ అయోధ్యపాలకుడు రామచంద్రుడి కథ ఇంచుమించు ఒక లాంటివే! రిమ్‌సిన్‌కి అమర్-సిన్ (హనుమాన్) అనే అనుచరుడున్నాడు.

అలాగే, సార్గన్ అనే ఈజిప్ట్ ఫారో (Pharoah) కథ మన రామాయణ భారతాలలో సగరుడి పేరుతో అచ్చంగా కన్పిస్తుంది. సగరుడు తన కొడుకు అసమంజసుణ్ణి దేశ మహిష్కృతుణ్ణి చేసినట్లే ఈజిప్షియన్ సార్గన్, తనకొడుకు "మెనిస్" అనేవాణ్ణి రాజ్యాధికారం లేకుండా బహిష్కరించాడు. అతనే ఆ తర్వాత ఎగువ, దిగువ ఈజిప్ట్‌లను ఏకీకృతంచేసి 'అహమెనిస్' (Menes - The Great) అనిపించుకొన్నాడు. అహ, మహ అనేవి great అనే అర్థంలో ప్రయోగాలు.

వాడెల్ ఇలాంటికథలు ఋగ్వేదం నుంచి పురాణాలవరకూ ఎన్నింటినించో తీసుకొని సుమేరియన్ నాగరకతలోని మహా పురుషులతో పోల్చి చూపించాడు. సుమేరో ఆర్యన్ ఇంగ్లీషు డిక్షనరీ కూడా ఆయన రూపొందించాడు. అది ఇప్పటికీ దొరుకుతోంది. అయితే వాడెల్ ప్రకారం సుమేరియన్ చక్రవర్తులు ఆర్యులేగాని, ద్రావిడులు కాదు. కానీ, అత్యంత నవీనంగా సాగుతున్న పరిశోధనలు సుమేరియన్ ప్రజలను ద్రావిడులుగా నిరూపిస్తున్నాయి. సుమేరియన్లు ద్రావిడులైతే భారతీయుల పురాణేతిహాసాలలోని ఆర్యులవికావు - ద్రావిడులవేనని తేలినట్లే అవుతుంది.

1.సుమేరియన్ భాషాపదాలలో మూలద్రావిడ పదాలు చాలా కన్పిస్తున్నాయి.

2. సుమేరియా క్యునిఫాం ఇన్‌స్క్రిప్షన్లలోని పదాలు తెలుగులో చాలావరకూ బతికున్నాయి.

3. వీటిలో సంస్కృతంలో కూడా కన్పించేవి కొన్ని వున్నాయి. ఈపదాలు మూల ద్రావిడ లేదా మూల తెలుగులోంచి సంస్కృతంలోకి అరువు పదాలుగా చేరినవికావచ్చు. అది కూడా అధ్యయనాంశమే!

4. అనేక పదాలలో భావ సామీప్యతే కాదు రూప సామీప్యత కూడా సుమేరియన్లకు ద్రావిడులతో గల సంబంధాన్ని నిరూపిస్తున్నాయి. శాస్త్రీయమైన రీతిలో వాటి విశ్లేషణ జరగవలసి వుంది.

సర్‌జాన్ ఇవాన్స్ అనే పరిశోధకుడు సైన్స్ ఆఫ్ మ్యాన్ జర్నల్(1901)లో మొట్ట మొదటిసారిగా ఒక అద్భుత ప్రతిపాదన చేశాడు. 1. Southern India was Probably The Cradle of The Human Race దక్షిణ భారతదేశం నాగరక జాతులకు పుట్టిల్లు.

2. 'Investigations in relation to race show it to be Possible that southern India was once the Passage ground by which the Ancient Progenitors of northern and Meditenanean races Procceeded to the Parts of the globe which they now inhabilt.' "జాతులపరంగా చేసిన పరిశోధనలప్రకారం దక్షిణభారతదేశంలో అత్యంత ప్రాచీన కాలంలో ఉత్తరదేశాలలోని ప్రాచీనజాతులు మరియు మెడిటరేనియన్ జాతుల మూలపురుషులు నివసించేవారు. వీళ్ళు దక్షిణభారత దేశంనుంచే ప్రపంచమంతా విస్తరించి స్థిరపడ్డారు."

సర్‌జాన్ ఇవాన్స్ 1901లో చెప్పిన ఈ విషయాలు వందేళ్ళ తర్వాత కూడా సాక్ష్యానికి నిలిచాయి.

1925లో టి.ఆర్ శేష అయ్యంగార్ "ది ద్రవిడియన్ ఇండియా" అనే గ్రంథంలో డా॥ సి. మక్లీన్స్ రూపొందించిన మాన్యువల్ ఆఫ్ అడ్మినిస్ట్రేషన్ ఆఫ్ ది మద్రాస్ ప్రెసిడెన్సీ గ్రంథాన్ని ఉటంకిస్తూ ఒక అద్భుత విషయాన్ని వెలుగులోకి తెచ్చాడు'. "చరిత్రకు అందని అత్యంత ప్రాచీనకాలంలో పరమ నాగరకులైన ప్రజలు బంగాళాఖాతం తీరంలో నివసించారు. వాళ్ళు సమస్త ప్రపంచాన్నీ ప్రభావితం చేయగలిగిన మహోన్నత స్థితిలో వున్నవారే....." అన్నాడు.

మొత్తం మీద సింధు నగరాలకన్నా పూర్వమే దక్షిణ భారత దేశంలో నాగరకత వుంది. నగరాలు వున్నాయి. నావికులు ఉన్నారు. ఎగుమతులు దిగుమతులు వ్యాపార లావాదేవీలున్నాయి. భాష వుంది, సంస్కృతి వుంది. దేవతలున్నారు.... అనేది దీని సారాంశం.

పైకి ఇది ఊహాత్మకమైన హైపోథీసిస్‌గా కన్పించే మాట వాస్తవం. పైగా 1925లో ఇలా చెప్పడానికి తగిన ఆధారాలు లేవనికూడా వ్యాఖ్యానించవచ్చు.

భారతీయ చరిత్రని అధ్యయనం చేయడానికి ఆధునిక యుగంలో డా॥హెచ్.ఆర్.హాల్ అనే సుమేరాలజిస్ట్ రాసిన "ది ఏన్షియంట్ హిస్టరీ ఆఫ్ ది నియర్ ఈస్ట్" గ్రంథం కొత్త దృష్టి కోణాన్ని ఇస్తుంది. ఇందులో, సంచలనాత్మకంగా ఆయన చెప్పిన అంశాలు కొన్ని వున్నాయి. పరిశీలించండి!

1. "... that sumerian civilization first arouse in India and was associated Probably with the Primitive Dravidians..." ఆ సుమేరియన్ నాగరకత మొదట దక్షిణ భారతదేశంలోనే ప్రారంభం అయ్యింది. అది బహుశా పూర్వ (లేదా) మాత్ర ద్రావిడులతో ముడిపడే నడిచి వుండాలి-

2. " The Ethnic type of the Sumerians, so strongly marked in their status and reliefs, was as different from those of the races which surrounded them as was their Language from those of the semites, Aryans of others, they were decidedly Indian in type." అక్కడ దొరికిన విగ్రహాలు తదితర పురావస్తు సంపదని పరిశీలించినప్పుడు సుమేరియన్ల స్పష్టమైన రూపురేఖా విలాసాలు కన్పిస్తాయి. అవి సుమేరియన్ల చుట్టూ జీవిస్తున్న ఇతర జాతులు సైమైట్స్ ఆర్యన్స్, ఇంకా ఇతరుల కన్నా భిన్నంగా అన్పిస్తాయి. ఈ సుమేరియన్స్‌ని కచ్చితంగా ఇండియన్ టైప్ గానే భావించాలి.

3. The face type of the average Indian of today is no doubt much the same as that of his Dravidian race - ancestors thousands of years ago. సగటు భారతీయుడి ముఖకవళికలు వేల సంవత్సరాలనాటి పూర్వ ద్రావిడుల పోలికల్లోనే వున్నాయి.

4. And it is to this Dravidian ethnic type of India that the ancient Sumerian bears most resemblance, so far as we can Judge from his monuments. He was very like a Southern Hindu of the Deccan. (who still speaks of Dravidian Languages). భారతీయులైన ద్రవిడియన్ల రూపురేఖల వరకూ చూసినప్పుడు ప్రాచీన సుమేరియన్లు అచ్చం ఇండియన్ల మాదిరేవున్నట్లు అక్కడ త్రవ్వకాలలో దొరికిన విగ్రహాలు సాక్ష్యం ఇస్తున్నాయి. ఆనాటి సుమేరియన్ నిస్సందేహంగా దక్కన్‌లో ఇప్పటికీ ద్రావిడభాష (తెలుగు) మాట్లాడుతున్న ప్రజల మాదిరి వుండివుంటాడు.

డా॥ హాల్ గారి మాటల్లో ఈ చివరి వాక్యం మనకు చాలా ముఖ్యమైంది.. తెలివాహానదీ తీరాన అంధక పురంలో తొలి తెలుగు రాజధాని ఏర్పడిందని సిరిణిజ జాతకగ్రంథంలో చెప్పిన అంశానికి, కృష్ణా గోదావరీ పరీవాహక ప్రదేశమైన దక్కన్‌లో మొదటి నాగరక మానవుడు నివసించాడని డా॥ హాల్ ప్రభృతులు పేర్కొన్న .

అంశానికీ చాలా దగ్గరి సంబంధమే వుంది. నేటి ఆంధ్రప్రదేశ్ "పూర్వ ద్రావిడులు నివసించిన నేల" అనేది ఇక్కడి ముఖ్య అంశం.

సుమేరియన్ నాగరకతకు సమాన కాలంలోనే సింధునాగరికత ఏర్పడింది. సుమేరియన్లకూ, సింధువులకూ దగ్గర సంబంధాలు నడిచాయి. ఇద్దరూ ఇంచుమించు ఒకే రకమైన భాష మాట్లాడారు. సుమేరియాలో దొరికిన సీల్స్ సింధు నగరాలలో దొరికిన సీల్స్‌తో పోలుస్తూ ఎల్.ఎ. వాడెల్ ఇచ్చిన వివరణని పరిశీలించండి:

సింధువులు, సుమేరియన్లు ఒకే సంకేతాన్ని Sign అక్షరం (లేదా) పదంగా ప్రయోగించినట్లు స్పష్టంగా కన్పిస్తోంది. అది ఆర్యుల వేదభాష పదరూపం కావచ్చని వాడెల్ అభిప్రాయం.

వాడెల్‌ని వ్యతిరేకిస్తూ, ఇవి ఆర్య శబ్దాలు కావనీ, ద్రావిడ భాషాపదాలని తాజా పరిశోధనలు నిరూపిస్తున్నాయి. డా॥ హాల్ గారి ప్రకారం "Sumerians Might be a Branch of the Indian Dravidians సుమేరియన్లు, ఇండియన్ ద్రవిడియన్లలో ఒక శాఖ అంతే!!

***Seal of Aha, son of Shagani, The Pharaoh at Edin Land***

**This seal, No. 10 in Plate X, reads :—**




**Reads : UMUN-MAN A-HA MAR SHA-GA-NI[1] BARA[2] GU-EDIN-AS**

**Transl. : Lord-Companion AHA, the son of SHAGANI, The *Pharaoh* in Edin Land.**

సగరుడి కొడుకు అసమంజసుడి బిరుదునామం సీల్ ఇది. షగరి (సగర) కుమారుడు 'అహ' ఎడిన్ భూమికి పాలకుడు అని దీని అర్థం. "గార్డెన్ ఆఫ్ ఈడెన్" అనేది సింధు నగరాలలోనే వున్నదని కొందరు చరిత్రకారుల అభిప్రాయం. సుమేరియా, సింధు నగరాలలో దొరికిన సీల్స్ ఒకే అర్థంలో, ఒకే రకంగా వుండటాన్ని ఎల్.ఎ. వాడెల్ విశ్లేషించి చూపించాడు.

కొత్త రాతియుగం (Neo Lithic age) భారత దేశంలో 20వేలఏళ్లక్రితమే మొదలయ్యింది. అప్పుడే దేశవ్యాప్తంగావున్న జీవనదులన్నింటి వెంబడి మానవాళి విస్తరించారు.

ఉత్తర భారతదేశంలోనే నాగరికులున్నారనీ దక్షిణ భారతదేశంలో అడవులు, ఆటవికులైన ప్రజలే వుండేవారని ఇంకా ఎక్కువకాలం మనల్ని మభ్య పెట్టాల్సిన పనిలేదు. ఎందుకంటే క్రీస్తు పూర్వం 10,000 ఏళ్లనాటికే వరి, జొన్నలాంటి ధాన్యాలను తెలుగునాట నివసించిన ఆనాటి ప్రజలు వండుకొని తిన్నారు.

సింధు నాగరకత కాలంలో కూడా సమాంతరంగా తెలుగు నేలమీద నాగరకులున్నారు. వారికి సింధువులతో వ్యాపార సంబంధాలు దండిగానే వుండేవి. దీన్ని దక్షిణ సింధునాగరకత అంటున్నారు.

ఆకాలంలో ప్రజలు ఇక్కడ పూర్వద్రావిడ భాష మాట్లాడైనా వుండాలి. (లేదా) పూర్వ తెలుగు (Proto Telugu) మాట్లాడి వుండాలి.

రావణాసురుడు తెలుగు భాషకు వ్యాకరణం రాశాడనే వాదన ఒకటివుంది. ఒకవేళ రాసివున్నా ఆశ్చర్య పడవల్సిందేమీలేదు. రాముడేకాదు, సుమేరియా నాగరకతలో "అగుడు" రాజ్యపాలకుడైన రిమ్‌సిన్, సరయూ తీరంలో అయోధ్య, రాజపాలకుడైన రామచంద్రుడు కూడా మూలద్రావిడంగాని, దానికి దగ్గరగావున్న తెలుగుభాష గాని మాట్లాడిన వారేనంటే ఆశ్చర్యం లేదు.

ఆధునికంగా జరిగిన పరిశోధనల ప్రకారం సుమేరియన్ సంకేత లిపిలో పూర్వద్రావిడ పదాలు కన్పించినట్లే, ఆఫ్రికన్ ప్రాచీన భాషలలోకూడా పూర్వద్రావిడ భాషా పదాలు కుప్పలుగా దొరుకుతుండటంతో చరిత్రవేత్తల దృష్టికోణం తప్పనిసరిగా మారవలసివచ్చింది.

వాక్లావ్ బ్లాజిక్, డేవిడ్ మెకాల్పిన్, వామోస్ బేటర్ ఇలా అనేకమంది ప్రముఖ చరిత్రకారులు ఆఫ్రికన్ సుమేరియన్ భాషలో పూర్వద్రావిడ పదాలను ఏరి చూపించడంతో ఆఫ్రో ఆసియాటిక్ భాషా కుటుంబంలోకి పూర్వద్రావిడ భాషను చేర్చడం ఒక అవసరంగా మారింది -

బహుశా సమీప భవిష్యత్తులో 'ద్రావిడ భాషా కుటుంబం' అనేది కనుమరుగై అది ఆఫ్రో ఆసియాటిక్ భాషా కుటుంబంలోకి చేరిపోయి, అందరినీ ఉమ్మడిగా ఆఫ్రో ఏసియన్లని పిలిచే పరిస్థితి వస్తుందేమో! ఈరెండు మూడేళ్ళ కాలంలో

చోటుచేసుకొన్న పరిశోధనల పరిణామం అలాటి అనుమానాన్ని కలిగిస్తోంది!

## వేదయుగంలో ద్రావిడ దేవతలు

ఇక్కడో సున్నితమైన అంశాన్ని గుర్తుచెయ్యాలి. బ్రహ్మ, విష్ణువు, శివుడు వీళ్ళెవరూ ఋగ్వేదంలో పేర్కొన్నబడ్డ దేవతలు కారుగదా.... ఆర్యదేవతలు కానప్పుడు ఆనాటి ద్రావిడభాష మాట్లాడిన ప్రజలు ఆరాధించినవారై వుండవచ్చు. కాలక్రమంలో ఋగ్వేదంలోని ఇంద్రుడు కనుమరుగై బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులు త్రిమూర్తులుగా ప్రధాన దేవతలయ్యారు. సుమేరియాలో ఆ రోజుల్లో బ్రహ్మ, విష్ణు, మహేశ్వరుల ఆరాధకులున్నారని చరిత్ర.

సింధు నాగరకతలో ఊర్ధ్వలింగార్చన, పశుపతినాథుడి పూజ, అమ్మతల్లి ఆరాధన వగైరా ఆధారాలు దొరికాయి. ఇవి ద్రావిడ సంబంధమైన దేవతామూర్తులని చరిత్రకారుల భావన.

బైబిల్‌లో పేర్కొన్న 'అబ్రహామ్' జెరూసలేమ్‌కు ఉర్ (Ur of Chaldeans) నుంచి వచ్చినట్లు కన్పిస్తుంది. అతని తండ్రి తేరా (Terah) భార్య పేరు సరాయ్. భారతీయ దేవతా త్రిమూర్తులలో బ్రహ్మ మొదటివాడు. అతని భార్య సరస్వతి. ఇద్దరిమధ్య వున్న పోలికల గురించి బైబిల్ మీద పాశ్చాత్యులు చేస్తున్న పరిశోధనల్లో తెలుస్తున్న విషయాలు ద్రావిడ భాషా మూలాలను ముఖ్యంగా తెలుగువారి మూలాలను తేటతెల్లం చేస్తున్నాయి.

మెక్సికన్ రచయిత టోమాస్ డొరెస్టే ఈ విషయాన్ని ప్రస్తావిస్తూ, అనేక మంది భారత వేదాంతులు బోధకులుగా ప్రపంచం అంతా పర్యటిస్తూ బయలు దేరారనీ వీళ్ళే "బ్రహ్మ"ని వ్యాప్తిచేశారనీ పేర్కొన్నాడు.

పర్షియాలోనూ, యూఫరేట్స్, టైగ్రిస్ నదీ ప్రాంతాల్లోనూ, బాక్ట్రియా లోనూ వీళ్ళు బ్రహ్మని బాగా ప్రచారం చేసినట్లు ఆయన నిరూపించాడు.

బాక్ట్రియా అనేది క్రీస్తుపూర్వకాలంనాటి యూదుల బలమైన స్థావరం. దాన్ని 'జుహుడా' లేదా 'జగుడా' అనేవాళ్ళట. దీనికే ఉర్-జగుడా అనే పేరు కూడా వుంది. 'ఉర్' అంటే నివాసస్థానం. 'జగుడ ఊరు' అని దీని అర్థం. బహుశా అబ్రహామ్ ఈ 'ఉర్' నుంచి వచ్చి వుండవచ్చునంటూ ఆయన మరికొంత కొత్త ఆలోచన అందించారు.

ఈ విషయాలు సున్నితమైనవి కాబట్టి సావధానంగా ఆలోచించవలసి వుంటుంది.

అరిస్టాటిల్ పండితుడు ఒక సందర్భంలో యూదుల (Jews) గురించి చెబుతూ వీళ్ళు భారతీయవేదాంతులనీ భారతదేశంలో వీళ్ళని 'కలనీ' లంటారనీ పేర్కొన్నాడట. "వేదాంతుల్ని భారతదేశంలో కలనియన్లనీ, సరియాలో 'జ్యూస్'అనీ పిలుస్తారంటూ మరికొందరుకూడా పేర్కొన్నారు. Anacalypsis (Gold Frey Higgins) అనే గ్రంధంలో (Vol I, P.400) మెగస్థనీస్ భారతదేశం గురించి రాసిన విషయాలమీద వివరణ వుంది. అందులో కలనిన్స్ అనేవారు భారతదేశంలో ఒక ఆదిమతెగగా విశ్లేషణ కన్పిస్తుంది.

ఇప్పుడు అసలు విషయంలోకి వద్దాం.

అబ్రహాం "ఖాల్డీన్స్ (Chaldeans) కు చెందిన "ఉర్" నుంచి వచ్చాడని బైబిల్ ఆధారం. ఈ ఖల్-డీన్స్ పదానికి బైబిల్ విశ్లేషకులు 'కాల్-దేవ' (Holy` Kauls) అనే అర్ధం చెప్పారు. పైన పేర్కొన్న కలనీలు కాల్దేవులు ఒకరేనా? ఇది కొంత పరిశీలన చెయ్యవలసినఅంశం. కాల్దేవ్లు ద్రావిడ ప్రజలలో పురోహిత వర్గానికి చెందినవారు కావచ్చు. జెసూట్ మిషనరీలకు చెందిన బైబిల్ పరిశోధకులు ఈ విషయమై చాలా విశేష పరిశోధనలు చేశారు. పర్షియన్లు కొలిచే ఇబ్రహీమ్, యూదులు కొలిచే అబ్రహామ్, హిందువులు కొలిచే బ్రహ్మ - ఈ ముగ్గురూ ఒకే ఆరాధనా సాంప్రదాయంలోంచి బయల్దేరినవారు కావచ్చునేది ఈ పరిశోధనల సారాంశం!

భారతదేశంలో ఒకప్పుడు సరస్వతీ నది వుండేది. దాన్ని ఘగ్గర అనేవాళ్ళు. హక్ర అనేది దాని ఉపనది. అబ్రహాం భార్య సరాయ గారి చెలికత్తె పేరు హగర్. ఈమె ఈజిప్షియన్ రాజకుమార్తె! ఈ హగర్ కుమారుడే ఇస్మాయిల్.

ఇజాక్ Ishaak (హిబ్రూ)= ఈశ+అక్క = పెద్ద ఈశ్వరుడు (మహేశ్వరుడు)

ఇస్మాయిల్ Ishmael (హిబ్రూ)= ఈశ+మహా = గొప్ప ఈశ్వరుడు (మహేశ్వరుడు).

అంతేకాదు, సరయూనదీ తీరాన శ్రీరాముడి రాజధాని అయోధ్యవుంది. ఈ సరయూ, సరస్వతి, సరాయ పదాల మధ్య సారూప్యతకి కారణాల్ని ప్రత్యేకంగా అన్వేషించవలసివుంది. బొమ్మనిచేసి, ప్రాణం పోసే దేవుడిగా బ్రహ్మ హిందూ పురాణాలలో ప్రసిద్ధుడు. ఇంతకీ 'బొమ్మ' అనేది ద్రావిడపదమే! కన్పిస్తుంది.

ఋగ్వేదంలో విగ్రహారాధన లేదు. బ్రహ్మ దానిని వ్యాప్తిలోకి తెచ్చినవాడు కావచ్చు. బ్రహ్మకు బొమ్మ' 'వికృతి' కూడా!

| | | |
|---|---|---|
| పర్షియన్ | బ్రహ్మ= | పవిత్రమైన |
| లాటిన్ | బ్రహ్మణి | = పవిత్రమైన |
| రష్యన్ | రచ్మణి | = పవిత్రమైన |
| ఉక్రేనియన్ | రచ్చ్మణ్యా= | పురోహితుడు. |

ఈ నిరూపణలన్నీ కొన్ని విషయాల్ని స్పష్టపరుస్తున్నాయి.

1. మూల ద్రావిడ నాగరకతే ఆర్య సంస్కృతినీ, ఆర్య నాగరకతనీ, ఆర్య దేవతలనీ, ఆర్య దేవతారాధన విధానాలనీ కబళించి అన్నింటా ద్రావిడ మూలాలను ప్రవేశపెట్టి వుంటుంది!

2. హిందూ పురాణాలలోనూ, ఇతిహాసాలలోనూ కన్పించే వ్యక్తులు ద్రావిడ ప్రజలే కావచ్చు. అంటే రాముడు, కృష్ణుడూ వీళ్ళంతా తెలుగు దేవుళ్ళు కావచ్చు.

3. బైబిల్‌లో పేర్కొన్న ప్రధాన పాత్రలు కొన్ని భారతదేశంతో ముడిపడినవి కన్పిస్తాయి.

4. 'ఉర్' నుంచి వెళ్ళిన అబ్రహామ్ 'ఏ' 'ఊరివాడు?' అని ప్రశ్నిస్తే మాఊరివాడని ప్రతి తెలుగువాడూ, ద్రావిడుడూ సగర్వంగా చెప్పుకోవచ్చు.

5. ద్రావిడులు ప్రవేశపెట్టిన బొమ్మపూజ (విగ్రహారాధన) లేదా లింగార్చన విధానాల్ని వ్యతిరేకించి 'అ-బ్రహ్మ'గా అబ్రహామ్ తనను వ్యవహరించుకొని కూడా వుండి వుండవచ్చు. లేదా బ్రహ్మ ది గ్రేట్ - 'అహ - బ్రహ్మ' అని పిలుచుకొని వుండవచ్చు.

ఏమైనా తెలుగు జాతి ప్రాచీనతను తట్టిచెప్తున్న ఈ నిరూపణల్ని మతదృష్టితో కాకుండా భాషా సాంస్కృతిక-చారిత్రక దృష్టితో పరిశీలించవలసి వుంటుంది.!

## తెలుగు ప్రాచీనతకు సుమేరియాలో ఆధారాలు :

1929లో ఆర్.ఎస్. వైద్యనాథ్ "మిథిక్ సొసైటీ జర్నల్" లో అనే వ్యాసంలో ద్రవిడియన్ల నుంచి సుమేరియన్లు, హిట్టయిట్ల నుంచి ఆర్యన్లు రూపొందినట్లు నిరూపించే ప్రయత్నంచేశాడు. 1932 మిథిక్ సొసైటి క్వార్టర్లీ జర్నల్‌లో సుమేరియో ద్రవిడియన్ ఎఫినిటీస్ పేరుతో ఎ.ఎస్. త్యాగరాజు అనే తెలుగు పరిశోధకుడు

అనేక సుమేరియా పదాలు ఇప్పటికీ తెలుగుభాషలో సజీవంగా ఉన్నాయని నిరూపిస్తూ మొదటిసారిగా ఒక వ్యాసం ప్రచురించాడు. కానీ, తెలుగుభాషావేత్తలు వీటిని పట్టించుకోకుండానే విస్మరించారు.

ఎల్.వి. రామస్వామి అయ్యర్ 1929లో సుమేరియన్ పదాలను తెలుగు తమిళ పదాలతో పునర్నిర్మించే ప్రయత్నం చేశాడు. ఈ ఉదాహరణలు గమనార్హం.

1."ar" (plough, bond uplift) ఈ సుమేరియన్ పదం వ్యవసాయానికి సంబంధించినది. 'అరక' (దున్నడానికి సిద్ధంగా వున్న నాగలి) అనే తెలుగు పదం దీనికి ఎంతో దగ్గరగావుంది. "ఏరు" అన్న ఇదే అర్థం, ఏరు అంటే తెలుగులో ఎద్దులు కట్టి సిద్ధంగా వున్న నాగలి అనే! ఏరువాక సాగింది అంటాం మనం జలాశయానికి నదులకు కూడా 'అర్' అనే రూపం కన్పిస్తుంది. మన గోదావరిలో "అర్" అనే రూపం వుంద గమనించండి.

2. సార్గన్ అనే ప్రభువు అక్కాడ్ చక్రవర్తి. క్రీ.పూ. 2800 నాటివాడు. సుమేరియన్ల నుంచి అక్కాడియన్లు నాగరికతను స్వీకరించారు. ఈ సార్గన్ ప్రభువు సగరుడుగా భారతీయ ఇతిహాసాలలో మనకు కన్పిస్తాడు.

రామస్వామి అయ్యర్ ఈ 'సార్గన్' ప్రభువు పేరుని ఇలా విశ్లేషించాడు.

సరి = Straight (సరి అయిన)

కొన = Highest of the high

సరికొన (సరి అయిన చక్రవర్తి) అనే తెలుగు పదమే సార్గన్ అయ్యిందనేది ఆయన నిరూపణ.

3. చిన్నర్=(సుమేరియాలో ఒక గ్రామం పేరు)

చిన్న + అర్ = చిన్న ఏరు అని దీని తెలుగు అర్థం.

4. బాంబుర్ : (సుమేరియాలో ఇంకో ఊరు పేరు)

పాము (ంబు) + ఉరు = పామూరు (నాగపట్నం) (పాంబూరు)

కృష్ణా జిల్లాలో పామర్రు అనే గ్రామం వుంది. శాసనాలలో ఇది పాంబర్రుగా కన్పిస్తుంది. ఇది సుమేరియన్ బాంబుర్ లాంటి పేరే! ఇవన్నీ 70-80 ఏళ్లనాడే పరిశోధకులు చేసిన విశ్లేషణలు. వీటిని భాషాచారిత్రకవేత్తలు తర్వాతి కాలంలో ఎలా విస్మరించగలిగారో ఆశ్చర్యం అనిపిస్తుంది. 1927లో ఎల్.ఎ. వాడెల్

రూపొందించిన సుమేర్ ఆర్యన్ డిక్షనరీలో సుమేరియన్ పదాలకు బాగా దగ్గరగా వున్న తెలుగు పదాలను కొన్నింటిని ఇక్కడ ఉదహరిస్తున్నాను.

| సుమేరియన్ పదం | ఆంగ్లం | తెలుగు |
|---|---|---|
| 1. aba | off, after, behind | ఆవల, అవతల (ఉదా॥ ఆవల ఎల్లుండి=ఎల్లుండి తర్వాత) |
| 2. ad, at, adda | father, mother | అత్త |
| 3. aka | cry, howl, pain | అకటా, అయ్యో |
| 4. ala, alal | all, full, totality | ఎల్ల(everything)ఎల్లరు(సమస్తమైనవారు) |
| 5. ame, eme | mother, love, grac | అమ్మ, అమ్మి |
| 6. ar, ara | plough, bond uplift | అరక, ఏరు = ఎద్దులు కట్టి సిద్ధంగా వున్న నాగలి |
| 7. bad, bat | stave, wooden tool | బద్ద |
| 8. bad, bat | strike, destroy, kill | బాదు |
| 9. bir | break, tear, cent off | విరుచు, విరుగు |
| 10. bur, bu, burn | worm, serpent | పురుగు |
| 11. dab, dib | dwelling, surround | దిబ్బ |
| 12. dara, daru | fetter, band, net | దారము |
| 13. dim | pillar, port, bar | దిమ్మ |
| 14. dim | overnholm, crush Down, cut | దిమ్మిస (నేల చదును) (దిమ్మెస = దిమ్మిస చేసే సాధనం) |
| 15. dim, dimma | weak in body & mind | దిమ్మరి (మత్తు గల వాడు / గలది దిమ్మ (తెలివి, దిబ్బ, భ్రమము వర్గము) |
| 16. dirig | bend, bow down, dark | తిరుగు |
| 17. du | go, come | దూకు, దుముకు |
| 18. dur | prince, king, the great, lofty | దురుసు, దొర |
| 19. edin, etin | plain, field, desert | ఎడారి |
| 20. elim, ilim | ram, leader of the herd | ఏలు, ఏలుబడి (to rule) |
| 21. er, eri, uru | fortified city | ఊరు |
| 22. firiq, piriQ | frightful, kill, srief | పిరికి |

సుమేరియన్, అక్కాడియన్, బాబిలోనియన్, ఈజిప్షియన్ రాజవంశాల చరిత్రలు రకరకాల కథలుగా మన పురాణేతిహాసాలలో రికార్డయి వున్న మాట వాస్తవం. బౌద్ధ జాతక కథల్లోనూ, జైన సాహిత్యంలో కూడా అనేక విశేషాలు కన్పిస్తాయి. కానీ, పురాణేతిహాసాలు మాత్రమే ప్రాచీన, అతిప్రాచీన భారతదేశ చరిత్రకు సాక్ష్యాలనే ఒక అపోహ మనలో బలంగా ఉండి, జైన బౌద్ధ గ్రంథాలలో పేర్కొన్న విషయాల్ని విస్మరించడం వలన ఎన్నో విలువైన విషయాలను కోల్పోతున్నం.

బాబిలోన్‌లో ZIKKURAT (high place) అనే ఏడంతస్థుల భవనం 300 అడుగుల ఎత్తయినది ఉంది. పాలీ భాషలోని బౌద్ధ జాతక గ్రంథంలో "సత్త భూమక పాసార" (ఏడు అంతస్తుల ప్రాసాదం) ప్రస్తావన కన్పించింది. అంటే, బాబిలోనియాతో చరిత్ర పూర్వయుగంలో మనకి సముద్ర మార్గాన రాకపోకలు ఉండేవని దీన్ని బట్టి అర్థం చేసుకోవచ్చు.

సుప్పరక జాతక కథ (పాళీ నెం. 463) లో ఆనాటి నావికుల పేర్లు కొన్ని తెలుస్తాయి. ఖరమల, అగ్గిమల, దధిమల, కూసమల, నలమల, వలభముఖ ఈ నావికులు ఒక బృందంగా బయల్దేరి, ఆఫ్రికా, అరేబియా, బాబిలోనియా, మెడిటరేనియన్ ప్రాంతాలను సందర్శించినట్లు ఈ జాతక కథలో వుంది. భయంకరమైన జలప్రళయంలో వీరి నావ చిక్కుకున్నప్పుడు సుప్పరకుడు అంధుడైనప్పటికీ నావని సురక్షితంగా భరుకుచ్ఛ తీరానికి చేరుస్తాడు. ఈ "సుప్పరక", శూర్పణఖ అనే పేరుకు దగ్గరగా వుంది. నిస్సందేహంగా ఇది దక్కన్ ద్రావిడ సంస్కృతికి సంబంధించిన కథే అయి వుండాలి.

అలాగే బాబిలోనియాలో.వ్యాపార విశేషాలను బావేరు జాతక కథ (పాళీ నెం: 330) తెలియజేస్తుంది. కాకుల్ని తీసుకెళ్లి అవే నెమళ్లని నమ్మించి అమ్మడం లాంటి వ్యాపార చిట్కాలు ఇందులో కన్పిస్తాయి. బావేరు అనేది బాబిలోనియాకు పాలీ భాషలో పేరు.

దక్కన్ - సుమేరియా (లేదా) బాబిలోనియాల మధ్య విస్తరించి నడిచిన వాణిజ్య సంబంధాలకు అక్కడ మిగిలిన సాక్ష్యం ఒక చిన్న టేకు ముక్క! ఇది ఈ ఒకే ఒక్క టేకు ముక్క 'మలబారు' తీరానికి సంబంధించినది కావచ్చని పండితులు పేర్కొన్నారు. కానీ, ఆ ఘనతని కేరళకు దక్కనీయకుండా అప్పటి మలబారు

తమిళ రాజ్యంగానే ఉందని, ఈటేకు తమిళ టేకుముక్కేనని తమిళులు రాసు కొంటున్నారు.

ఆనాటి "మమ్మీ" శవాలను భారతీయులు నేసిన నూలు వస్త్రం (మస్లిన్) తో చుట్టివుంచే వాళ్లని బాబిలోనియాలో దొరికిన ఒక రికార్డు చెప్తోంది. ఈ నూలుబట్టని "సింద్" అని పిలిచే వాళ్లట.

'సింద్' అనగానే సహజంగా దృష్టి సింధునాగరికత వైపు వెడ్తుంది. అలాగే వెళ్లిందికూడా. శవాన్ని చుట్టి వుంచడానికి సింధు నగరాల నుంచి ఎగుమతి అయిన వస్త్రాన్ని ఉపయోగించేవారని భావించారు.

జి. బ్రొన్నికోవ్ రూపొందించిన ద్రవిడియన్ ఎటిమాలజీలో మధ్య ద్రావిడ పూర్వరూపం (సెంట్రల్ ప్రోటో ద్రవిడియన్) "send" వస్త్రం (cloth) అనే అర్థంలో కన్పిస్తుంది. ఈ మధ్య ద్రావిడ పూర్వరూపంలోంచి తెలుగు విడివడిందని భాషావేత్తలు చెప్తారు. కాబట్టి "పూర్వ తెలుగు" పదానికి సంబంధించిన ఈ వివరణని చూడండి:

***Proto Central Dravidian :*** send = cloth

***Proto Telugu :*** send - r

***Telugu Protoform :*** send - r

***Kolami Gadba Protoform :*** send - r

***Gondwan Protoform :*** send - r

సెంద్ రూపం తెలుగు భాషలో "చందురు" అనే పదంగా మార్పు నొందింది. ఎర్రని వస్త్రం అని దీనికి అర్థం. కావి, కావి పుట్టము, తోపు, చందురు కావి, బొమ్మంచులు - ఇవన్నీ ఎర్రని వస్త్రానికి తెలుగు పేర్లని సంస్కృతాంధ్ర పదార్ణవంలో వుంది.

'సెంద్' అనే పూర్వ ద్రావిడ పదమే సింద్ అనే పేరుతో ఎర్రని వస్త్రం అనే అర్థంలో ఆరోజుల్లో బాబిలోనియాలో వ్యాప్తిలో ఉండివుంటుందని ఈ నిరూపణ తెలియజేస్తోంది. అంతేగాని, సింధు నగరాల నుంచి వచ్చింది కాబట్టి 'సింధు' అని పిలిచారనడం వాస్తవం కాకపోవచ్చు.

ఆఫ్ఘనిస్తాన్ నుంచి నర్మదా నదీ తీరం వరకూ ఎన్నో నదుల మధ్య విస్తరించిన నాగరికతని సింధు నాగరికత పేరుతో మనం ఈనాడు వ్యవహరిస్తున్నాం గాని, ఆ రోజుల్లో ఈ నాగరికతని వాళ్లు సింధు నాగరికతగా పిల్చుకొన్నారంటారా?

అది నిస్సందేహంగా తెలుగుపదమే! తెలుగుజాతి ప్రాచీనతకు, తెలుగుభాష ప్రాచీనతకు 'సుమేరియా' శిథిలాలలో దొరికిన శిలాఫలకాలే సజీవ సాక్ష్యంగా మిగిలివున్నాయి!!



# 7

# ఇలమ్-ద్రవిడియన్ భాషాకుటుంబం

## దగ్గరగావున్న తెలుగు పదాలు

**మధ్య** ఆసియా, దక్షిణాసియా, ఆఫ్రికాదేశాలలో అతి ప్రాచీన కాలంలో వర్ధిల్లిన అనేక నాగరకతలతో మూలద్రావిడులకు సంబంధాలు పటిష్టంగా వుండేవి. అందుకు తార్కాణంగా ఎన్నో మూలద్రావిడ శబ్దాలు అనేక భాషలలో అవే అర్థాలతో కన్పించడంతో భాషాచారిత్రక వేత్తలకు చేతినిండా పనిదొరికినట్లయ్యింది. వాటిలో ఎక్కువభాగం ఈనాటి మన తెలుగు పదాలకు దగ్గరగా వుండటం ఒక విశేషం.

ముఖ్యంగా క్రీ.శ. 2000కు కొద్ది ముందు నుండి ఈ పది, పన్నెండు సంవత్సరాల కాలంలో అంతకుమునుపు కనీసం ఊహకైనా అందని అనేక కొత్త భాషాచారిత్రక ప్రతిపాదనలు రావడం మొదలైనాయి.

క్యూనిఫామ్ శాసనాలు కలిగిన ప్రాచీనభాషల్ని సెమెటిక్ భాషాకూటమి (అక్కాడియన్, ఉగారిటిక్ మొదలైన భాషలు) ఇండో యూరోపియన్ భాషాకూటమి (హిట్టయిట్, అనతోలియన్ భాషలు), కాకేషియన్ భాషాకూటమి (హుర్రో, ఉర్రేటియన్, హట్టి మొదలైన భాషలు) ఇలా ఎన్నో కూటములుగా ఆ భాషలను విభజించి, వాటిమధ్య సామ్యతను భాషావేత్తలు అనేక కోణాలలోంచి విశ్లేషించడం ప్రారంభించారు.

**ఇలమైట్ భాష క్యూనిఫాం లిపిలో**

ఇలమ్ భాషని ఇలమిడ్స్ అనికూడా అంటారు. ఇది ఇరాన్ లో క్రీ.పూ. 6వ శతాబ్ది నుంచి 4వ శతాబ్దిదాకా నడిచిన పర్షియన్ రాజవంశీకుల అధికార భాషగా కూడా వుండేది. అలెగ్జాండర్ దండయాత్ర వరకూ ఇది అంతో ఇంతో సజీవంగా వుందనే చెప్పవచ్చు.

క్రీ.పూ. 3100-2500 కాలానికి సంబంధించి ఇరాన్‌లో అనేకచోట్ల శాసన ఫలకాలు మట్టివి (Clay Tablets) దొరికాయి. వాటిమీద వున్న అక్షరాలను పాత (మూల) ఇలమైట్ భాషగా భావించారు. వాటిలో కనీసం 1000 గుర్తులు (signs) వరకూ గుర్తించ గలిగారు.

క్రీ.పూ. 2500-331 వరకూ నడిచిన కాలానికి సంబంధించిన ఫలకాలు ఇతర శిలా శాసనాలలో ఇలమైట్ భాష అక్కాడియన్ లిపి ప్రభావంతో క్యూనిఫాం రూపంలో కన్పించింది. దీన్ని ఇలమైట్ క్యూనిఫామ్‌గా పేర్కొన్నారు.

ఈ రెండింటికి పూర్వం వున్న ముతక ఇలమైట్ భాషా స్వరూపాన్ని ప్రోటో ఇలమైట్ భాషగా పేర్కొన్నారు.

ద్రావిడ భాషా కుటుంబంతో ఇలమ్ భాషకు ఈ ముతక స్థితిలో వున్నప్పుడే సంబంధాలుండేవని, అవి ఆ తర్వాతి కాలంలో కూడా కొనసాగివుంటాయని భావిస్తున్నారు. ఇలమ్ నుంచి ఇండియాకు తూర్పుదిశగా ద్రావిడుల నడక (వలస) సాగివుంటుందని ఒక అంచనా. "ఈస్ట్‌వర్డ్ మైగ్రేషన్" అంటారు దీన్ని. వాక్లావ్ బ్లాజెక్ పూర్వ ద్రావిడులకు ఈ దశలోనే ఆఫ్రికన్ భాషా కుటుంబంతోకూడా సంబంధాలు నడిచి వుంటాయని భావించాడు.

ఈనాటి భౌగోళిక స్వరూపం రీత్యా ఆనాటి జాతుల మధ్య సంబంధాన్ని ఊహించడం కష్టం.

'ఇలమ్' అనేది ఇరాన్‌లోని ఖుజెస్తాన్ భూభాగంగా చారిత్రక వేత్తలు గుర్తించారు. ILAM Province అంటారు దీన్ని. ఇలమ్ అంటే మెరకభూమి. ప్రాచీన పర్షియన్ భాషలో ఖుజెస్తాన్ అంటే ఇదే అర్థం.

అయితే, ప్రాచీన ఇరాన్ పరిసర ప్రాంతాలలో చరిత్రకందని పూర్వకాలంలో ఇలమైట్ భాష. దాని సమీపానవున్న ప్రాచీన సుమేరియా భాష ఈ రెండు భాషలూ పైన చెప్పిన ఇరుగుపొరుగు ఆర్యభాషా కూటములతో సంబంధంలేని ప్రత్యేక భాషలుగా పరిశోధకులకు కనిపించాయి.

ఈ పరిస్థితుల్లో ఇలమో ద్రావిడియన్ సిద్ధాంతం వెలుగులోకి వచ్చింది. ఇరాన్ పరిసరాలలో ప్రాచీన ఇలమ్‌భాష మాట్లాడిన ప్రజలు, మూలద్రావిడ భాష మాట్లాడిన ప్రజలకు సంబంధీకులు కావచ్చనేది, దాని ముఖ్యసారాంశం. ఇలమ్ భాషలో శబ్దాలకు మూలద్రావిడరూపాలు అతి సమీపమైనవిగా కన్పించడమే ఇందుకు సాక్ష్యం!

అటు ఇలమ్ భాషగానీ, ఇటు మూలద్రావిడభాష గానీ, యథాతథ స్థితిలో నేడు వినియోగంలోలేవు. అంతరించిపోయిన ఈ రెండు భాషల స్వరూపాన్నీ, శబ్దాల్నీ, వ్యాకరణాన్ని వాక్యవిన్యాసాన్ని పునర్నిర్మించేందుకు భాషాచారిత్రక వేత్తలు చేస్తున్న కృషి నిరుపమానమైంది. ఇందుకు Phonological re-contruction, Lexical Camparision అనేవి రెండూ కత్తిమీద సాము లాంటివే.

డేవిడ్ డబ్ల్యు. మెకాల్పిన్, మొదటగా ఇలమో ద్రావిడియన్ భాషా సంబంధాన్ని వెలుగులోకి తెచ్చిన ప్రముఖుడు. ద్రావిడ భాషలు మాట్లాడే ప్రజలందరికీ ఆయన ప్రాతఃస్మరణీయుడు. 1974, 75 సంవత్సరాలలోనే ఆయన ప్రోటో ఇలమో ద్రవిడియన్ (PED) సిద్ధాంతాన్ని ప్రతిపాదించాడు. కానీ, అప్పట్లో ఆ సిద్ధాంతాన్ని పెద్దగా ఎవరూ పట్టించుకోలేదు.

1992లో మరో ద్రావిడభాషావేత్త వాక్లావ్‌బ్లాజెక్ ఈ సిద్ధాంతానికి ప్రాణప్రతిష్ట చేసి, మరో అడుగు ముందుకు వెళ్ళాడు. ఈయన తెచ్చిన కొత్త సిద్ధాంతంలో మూలద్రావిడ పదాలు "ఇలమ్‌భాష" లో మాత్రమేకాదు, మరో అతిపెద్ద భాషాకుటుంబం ఆఫ్రో ఆసియాటిక్ భాషల్లో కూడా కన్పిస్తున్నాయని తేల్చిచెప్పడం జరిగింది.

భాషలమధ్య వాక్యనిర్మాణం, వ్యాకరణ సూత్రాలను పక్కనబెట్టి కేవలం శబ్ద స్వరూపాలను మాత్రమే సరిపోల్చి చూసే విధానాన్ని బ్లాజెక్ అనుసరించాడు. ఒక భాషలోని శబ్దం వేరొక భాషలోకి తన శబ్దస్వరూపంతో మాత్రమే వచ్చి చేరుతుంది గాని, దాని వ్యాకరణ నియమాలతో రాదు కాబట్టి భాషల మధ్య సామీప్యతని

నిరూపించడానికి శబ్దాలే సాక్ష్యం అని భావించాడు. ఈ విధంగా ఆఫ్రో ఆసియాటిక్, ఇలమైట్ భాషలలో శబ్దాలమధ్య సామీప్యత సారూప్యతలున్న పదాలను ఒక వందవరకూ ఆయన గుర్తించగలిగాడు.

డేవిడ్ మెకాల్విన్, వాక్లావ్‌బ్లాజెక్‌లు ఇద్దరూ చేసిన పరిశోధనల్ని సమన్వయంచేస్తూ 1997లో "అరీజియో న్యూనిజ్ దాస్ సాంతోస్" అనే పరిశోధకుడు 54 ఇలమ్ భాషాశబ్దాలకు దగ్గరగా వున్న ఇతర భాషారూపాలను వెదికే ప్రయత్నం చేశాడు. నిజానికి ఇది గొప్ప ప్రయత్నం. ఇందులో తెలుగు పరిశోధకులు పట్టించుకోవాల్సిన అంశాలు చాలా ఉన్నాయి.

ఈ ప్రయత్నంలో, మూలద్రావిడ భాషాపదాలు బహుశా ఆయన దృష్టికి రానివి కొన్ని వున్నాయి. వాటిలో కొన్నింటిని ఇక్కడ అందించే ప్రయత్నం చేస్తున్నాను.

అయితే, ముందుగా ఒక అపోహను తొలగించవలసి వుంది. ఆఫ్రికన్ భాషలోనూ, జపాన్ భాషలోనూ ఇలమ్ భాషలోనూ తదితర ప్రాచీన భాషలలో తెలుగు పదాలను వెదుక్కోవడం అనేది అలనాటి అనేక ప్రాచీన భాషల పదాలు తెలుగులో ఈనాటికీ సజీవంగా వున్నాయని చాటిచెప్పడానికే! తద్వారా ఆయా భాషా కుటుంబాలకు చెందిన జాతులతో మూలద్రావిడ భాషలు మాట్లాడిన వారికి గల సంబంధ బాంధవ్యాలు నిరూపితం అవుతాయి. విశేషంగా చూసినప్పుడు ఆ పదాలు తెలుగు భాషకు బాగా దగ్గరగా వుండటాన్ని మనం గమనించవచ్చు. ఇవన్నీ తెలుగు భాషమూలాలను అన్వేషించేక్రమంలో ఒక ప్రయత్నం మాత్రమే!

## Earth (మురున్)

ఇలమ్ భాషలో "ము-రు-ఉన్" అంటే భూమి. మట్టి, నేల అనే అర్థాలతోపాటు చుట్టూవున్న ప్రపంచం అనికూడా అర్థం వుంది.

'ముర్' అనేది ఇలమైట్ మురున్ (మురువున్) శబ్దానికి మూలధాతువుకావచ్చని న్యూనిజ్‌గారి భావన. to put, set in place, to sit అని దీనికి అర్థాలు. దీనికి సమానమైనవి, దగ్గరగావున్నవీ శబ్దాలు ఇతర సమకాలీన ప్రాచీన భాషల్లో కన్పించలేదని ఆయన అన్నాడు. అయితే, డేవిడ్ మెకాల్విన్ "ఉర్" అనే మూలద్రావిడ రూపాన్ని ఇక్కడ ప్రస్తావించాడు. Native Place, Village, Town అనే అర్థాల్లోవున్న ఈ పదమే తెలుగు 'ఊరు'కు మూలంకూడా. మురు, ఉరు సన్నిహితంగా కన్పిస్తున్నాయి. ఇంతవరకూ బాగానే వుంది.

కానీ, పూర్వ ద్రావిడ భాషలో కూడా 'ముర్' అనే రూపం వుంది. మట్టి (dirt) అనే అర్థంలో ఇది కన్పిస్తుంది. ఇది మెకాల్పిన్ గారి దృష్టికి రాని పదం.

దక్షిణ ద్రావిడ పూర్వరూపం = ముర్-ఇ

తెలుగు పూర్వరూపం = ముర్-వెక్

కొలమి - గదబ పూర్వరూపం = ముర్

గోండ్ భాషా రూపం = ముర్-కె

ఈ "ఆఫ్రో ఆసియాటిక్" రూపం "మురున్" తెలుగులో మురికి, మురుగు శబ్దాలుగా ఇంకా సజీవంగా వుంది.

## Eat (మక్)

ఇలమ్ భాషలో 'మక్' అంటే భుజించడం. దీనికి సరిసమానమైన పదాలు ఇతర ప్రాచీన భాషల్లో కొన్నింటిని అరీజియో న్యూనిజ్ పేర్కొన్నారు.

ప్రొటో అల్టాయిక్ = ము-క్-ఎ (to Suck)

ప్రొటో మంగోలియన్ = మెకె (to suck)

ప్రొటో తుంగుస్ = ముకు (to fill mouth with liquid)

ప్రొటో కొరియన్ = మెక్ (to eat, to drink)

ప్రొటో జపనీస్ = మకనపి (to feed)

ఇలమ్ 'మక్'కు సమాన క్రియా రూపాన్ని వెదకడానికి న్యూనిజ్‌గారు చాలా శ్రమపడినట్లు ఈ నిరూపణలు సాక్ష్యం ఇస్తున్నాయి. అయితే, ద్రవ పదార్థాన్ని తీసుకునేందు సంబంధించినవే వీటిలో ఎక్కువ వున్నాయి గమనించండి. ఇక్కడ న్యూనిజ్‌గారి దృష్టికిరాని పూర్వ ద్రావిడ పదం 'mq' ని నేను సూచిస్తున్నాను. ఇది ఇలమ్ భాషాపదం మక్ (Mak) కి చాలా సమానంగా కన్పిస్తుంది. తెలుగులో 'మెక్కు', 'బొక్కు' శబ్దాలు దీనిలోంచే ఏర్పడ్డాయి. జి. బ్రెన్నికోవ్ " ద్రవిడియన్ ఎటిమాలజీ" గ్రంథంలో తెలుగు 'మెక్కు'కు మూల ద్రావిడ రూపం మెల్(క్) = మెల్ లేదా మెక్ మూల రూపంగా పేర్కొన్నాడు.

ఇలమ్‌లో "మక్క్" తెలుగులో " మెక్కు" అయ్యిందన్నమాట. వీటిలో క్రియా సామ్యత కూడా కన్పిస్తుంది. రూఢ్యర్థంలో ఇవ్వాళ ఈ పదాల్ని అతిగా తినడం అనే అర్థంలో వాడుతున్నాం. కానీ, ఒకప్పుడు 'తిను' అనే అర్థంలోనే వాడివుంటారు.

తెలుగు = మెక్కు, బొక్కు (eat sheedily, stutf the mouth, gobble)

తమిళం = ముక్కు, ముక్కి, ముక్కుని, ముక్కులి (to over feed )

మళయాళం = మోకుక, మొంతుక (to drink, to Sip మోచి (to eat)

మాంతు (మాంతి) = (to eat, drink experience, enjoy)

## Green (హుల)

ఇలమ్ భాషాపదం 'హులా-అప్-న' అంటే, ఆకుపచ్చ.

బట్టలరంగుని చెప్పేందుకు ఈ పదాన్ని ఎక్కువగా వాడేవారట.

'హురా' అనేది దీనికి మూలరూపం (to Gloom, become green)

దానికి సమీప పదం ఇతర ప్రాచీన భాషల్లో కన్పించలేదని అరీజియో న్యూనిజ్ రాశారు.

కానీ, వెదికితే ఇందులో ద్రావిడ మూలాలు వున్నాయనిపించింది.

| | |
|---|---|
| ఇలమ్ | = హులావు |
| మూలద్రావిడ | = ఇల్-అజ్ (young) |
| మూలదక్షిణ ద్రావిడ | = ఇల్ - అయ్ |
| తెలుగు మూలరూపం | = ఎల్-వ్ |
| కొలిమి గడబ మూలరూపం | = ఇల్ |
| బ్రహుయీ | = ల్-ఉమ్ |

ఇలాచూస్తే, 'హుల' రూపానికీ, మూల తెలుగు 'ఎలవ్' రూపానికీ, ఏమీ పొంతన కన్పించదు. ఈ క్రింది విషయాలు పరిశీలించండి.

తమిళంలో ఇల, ఇలమ్, ఇలయ్ శబ్దాలకు young, tender, delicate, slight, gentle అనే అర్థాలున్నాయి. తెలుగులో ఇది 'ఎల'గా కన్పిస్తుంది.

ఎల - నాగ = యువతి, లేతవయసులో వున్న స్త్రీ

ఎల - నీరు = (ఎడనీరు) = లేత టెంకాయ (ఆకుపచ్చ బోండాం)లో నీరు.

ఎల - పొర = పల్లవం, చిగురు, ఆకుపచ్చని ఆకు

ఎల - మావి = ఆకుపచ్చని తియ్యమామిడి

ఎలిమి = సంతోషం, దయ, అనుగ్రహం, ప్రేమ, అనురాగం, మనోవికాసం, వివేకం పెంపు, అతిశయం, వృద్ధి, ఉత్సాహం, ధైర్యం.

ఎలరు = అతిశయం

ఎలిగించు = మావిచిగురు తిని కోకిల కూయడం

ఈ 'ఎల' శబ్దంలోంచే 'లేగ' 'లేత' పదాలు ఏర్పడ్డాయికూడా!

ఇలమ్ 'హుల', తెలుగులో 'ఎల'గా నిలిచివుందని రుజువౌతోంది! భాషాశాస్త్ర నియమాలకు అనుగుణంగా విశ్లేషిస్తే వాస్తవాలు వెలుగులోకి వస్తాయి.

## Foot (పాత్)

ఇలమైట్ పదం 'బ-అట్' అంటే పాదం అని అర్థం. 'పా అత్' అని పలుకుతారని ఒక వివరణ వుంది.

| | |
|---|---|
| ఇలమ్ మూలరూపం | = పాఅత్ (foot) |
| మూల ఇండోయూరోపియన్ (లాటిన్) | = పెడ్ (Foot) |
| మూలద్రావిడ | = పాట్ (త్) (foot) |
| మూల అల్టాయిక్ | = పగ్డి (foot) |
| ఆఫ్రో ఆసియాటిక్ | = పద్ -ను (way, path) |
| అరెబిక్ | = వఫాదా (to come) |
| ప్రాచీన ఈజిప్షియన్ | = పెప్డ్ (Knee) |
| తూర్పు ఛాదిక్ | = పు.ఉది (thigh) |
| మూలదక్షిణ ద్రావిడ | = పద్-మ్ |
| మూల తెలుగు | = పదము (way, path) |
| | = పాదము (foot) |

పాట్ (త్) అనే ఇలమైట్ రూపం తెలుగు "పాదము" గానూ, 'పద్-ను' అనే ఆఫ్రో ఆసియాటిక్ రూపం "పదము" గానూ, తెలుగులో సజీవంగా వున్నాయి. ఇంతకీ 'పాదం' సంస్కృతంలోంచే తెలుగులోకి వచ్చిందని ఇంకా మనం అనుకోవాల్సిన అవసరం వున్నదా...? సంస్కృతంలోకి 'పాదం' చేరడానికి తెలుగు సహకరించి వుంటుంది!! ఎందుకంటే పూర్వ ద్రావిడ భాషలోనూ "పాత్" (=పాదం) అనే పదం వుంది కాబట్టి!

## Dry (జిటిక)

ఇలమైట్ పదం జి-టి-కా (dried) పదాన్ని ఆరోజుల్లో ఎండు ద్రాక్ష - ఎండుచేప ఇలాంటి వాటిని సూచించడానికి వాడేవారట! 'జి-ఉట్' అంటే ఎండిన ఆహారపదార్థం అని!

"జి-టి-కా" శబ్దానికి సమానమైన శబ్దాలు ఇతర భాషల్లో పెద్దగా కన్పించలేదని అరీజియోన్స్యానిజ్ రాశారు.

కానీ, మూలద్రావిడ భాషలో "వాటు", "వాటి" అంటే to Cause to dry అని!

దీన్నిబట్టి ఏర్పడిన పదాలు ఇవి:

| | |
|---|---|
| కన్నడ | = బాడు (grow dry) |
| తుళు | = బాదుని (to fade) |
| మళయాళం | = వాటుక, వాటక్కా (dry) |
| తెలుగు | = వటుకం, వడ, వడియం, వాడు, వడగాలి |

## Know (తుర్)

ఇలమ్ భాషాశబ్దం తుర్ (లేక) తుర్న అంటే ' తెలియు' అని అర్థం. ఇదే శబ్దం అనేక ప్రాచీన భాషల్లో కన్పిస్తుంది. పరిశీలించండి

| | |
|---|---|
| మూల తుర్కీ | = తెర్కొ (to observe, research) |
| మూల మంగోలియన్ | = తరకి (Brain, mind, head) |
| మూల తుంగుస్ | = తెర్గె (to think) |
| మూల ద్రావిడ | = తెరి (to be clear, evident) |
| మూల దక్షిణ ద్రావిడ | = తెర్ - ఇ (to know) |
| మూల గోండ్ | = తిర్ |
| బ్రహుయి | = తిర్ |

పై వివరణలో మూల దక్షిణ ద్రావిడ శబ్దం 'తెర్- ఇ(తెరి) శబ్దం తమిళం, తెలుగు భాషల్లో పొందిన రూపాలు గమనించండి.

తమిళం = తెరివి = to explain, pointout, show

తెలుగు

తెరువు = దారి, మార్గము

తెఱపు= తెరపయినది (తెలిసినది)

తెఱకువ = బుద్ధి, వివేకము

తెఱచు = విప్పి చూపించు

తెఱవ = రహస్యం దాచలేని స్త్రీ

ఇక్కడో ముఖ్య విషయం చెప్పాలి. 'తెలివి', తెలియు అనే పదాలు మూలద్రావిడ 'తెల్' శబ్దంలోంచే రూపొందాయి "తెలుగు" అనే పదంకూడా ఇందులోంచే ఏర్పడింది. పైన చెప్పిన తెరి శబ్దంతో దానికి సంబంధం లేదు. "తెరి" Knowledge నీ, "తెల్" Wisdom నీ సూచిస్తున్నాయి. ఈ తేడాని గమనించాలి!

## Heart (మున్)

ఇలమ్ భాషాశబ్దం 'బు-ని' అంటే గుండె. 'బు' శబ్దం ఇలమైట్ భాషలో చాలా అరుదుగా కన్పిస్తుందని అరీజియో న్యూనిజ్ రాశారు. ఇది మొదట 'ము-ని'గా వుండేదనీ, తర్వాతి కాలంలో 'బు-ని' గా మారిందని 'మ' కారం 'బు' కారం అయివుంటుందనీ పేర్కొన్నాడు.

ఈ 'ము-ని' శబ్దానికి దగ్గరగా వుండేవి, 'గుండె' అనే అర్థంలో చాలా భాషల్లో అనేకపదాలు కన్పిస్తాయి మనకి.

1. నోస్ట్రాటిక్ = మి-ఒ-న్-ఉ = Heart, breast
2. ప్రాటోతుంగుస్ = మియన్ - అమ్
3. ప్రాటో కొరియన్ = మ-ఉన్ - అ-ఉమ్ = Heart
   ము-న-ఇ = breart
4. ప్రాటో ఆఫ్రో ఆసియాటిక్ = మున్ = heart, liver
5. ప్రాటో సొత్కుషిటిక్ = మున్ = Heart
6. సైనో కాకేషియన్ = మ్న్క్ = Breast, Broom

ఇవన్నీ 'ముని' ఈలమ్ భాషా శబ్దానికి దగ్గరగా వున్న రూపాలు. ముని-బుని ఎలా అయ్యిందనేది ప్రశ్న.

'వక్లావ్ బ్లాజెక్' - ప్రోటో ఆసియాటిక్ శబ్దం 'బ్ (ఉ)న్'ని ఈ సందర్భంగా ప్రస్తావించాడు.

అక్కాడియన్ : అబున్నతు (మ్) = Navel, Umblical Card దీన్ని బట్టి 'మన్' అనే శబ్దం ఆఫ్రికన్ భాషల్లో 'బున్'గా మారినట్లు స్పష్టం అవుతోంది.

అయితే, 'మున్' అనే శబ్దం తెలుగుభాషలో ఏరూపంలో వ్యవహారంలో వుందోచూద్దాం:

| | | |
|---|---|---|
| దక్షిణ ద్రావిడ మూలరూపం | = | మున్ (Front) |
| తెలుగు మూలరూపం | = | మున్ |
| కొలమి - గదబ మూలరూపం | = | మున్ |
| గోండుభాషారూపం | = | ముండ్ |
| బ్రహువీ | = | మ్న్ |

అచ్చ తెలుగు భాషలో 'మున్' అనేరూపం సజీవంగా వుంది. 'మును' లేక 'ముని' అంటే First, Former, front, Precsious అని అర్థం. మునుముందు, మునిమాపు, మునిచీకటి, మునివేళ్ళు, మునుకోలు (ముందు), మునుపు, మున్నుడి ఇలా చాలా పదాలలో కన్పించే 'మున్' శబ్దానికి ముందు, మొదలు, తుది అని అర్థాలు.

హృదయభాగం (Frontside) అనే అర్థంలో ఈ రూపం ద్రావిడ భాషలో స్థిరపడి వుండవచ్చు.

తమిళంలో మున్ని (TIP), మున్ని (infront of )మూనె (Head) శబ్దాలుకూడా ఈ అర్థాన్నే ఇస్తున్నాయి.

## Fire, Burn (లిమ్మ)

ఇలమ్ భాషలో 'లి-ఇమ్-మ' అంటే, తగులబడటం లేదా కాలడం. 'లి-ఇమ్' అంటే అగ్ని లేదా మంట (fire)

దీనికి సమానమైన మూలరూపం ఆనాటి సమకాలీన భాషల్లో దేనిలోనూ కన్పించలేదని న్యూనిజ్ రాశారు.

అయితే, 'మెజ్' (లేదా) మే (to Praise, admire, be Pleased with) అనే శబ్దం మూల ద్రావిడ భాషలో కన్పిస్తుంది. నిప్పు, మంట అనడానికి, ప్రశంస, పొగడ్త, సంతోష పెట్టడం అనడానికి సంబంధం ఏమిటీ? ఇక్కడో చమత్కారం వుంది.

మూలద్రావిడ పదం మే= గొప్పదైన

ఇలమ్ పదం లిమ్మ = అగ్ని, మంట

ఈ రెండు పదాలూ కలిసి 'మేలిమి' అనే పదం ఏర్పడిందేమో ఒకసారి పరిశీలించండి! బంగారాన్ని కాల్చి, అందులోని దోషాలను, మలినాలను తొలగించగా మిగిలిన స్వచ్ఛమైన బంగారాన్ని 'మేలిమి' అంటారు.

మేలిమి శబ్దానికి 'తప్త కాంచనము' అనే అర్థాన్ని ఆంధ్రదీపికలో చూడవచ్చు. ద్రావిడ మూలరూపం 'మే' శబ్దం లోంచి, మేలు, మేలుకొను, మెచ్చు లాంటి రూపాలు ఏర్పడ్డాయి.

## Finger (పు - ఉర్)

ఇలమ్ భాషలో ఒకవాక్యం ఇలా వుంది... Pu-Ur nw - hu- ban. a-h-Pi- na ha -ra. k-Qa

ఇందులో 'హుంబన్ అహ్పి' అనేది వ్యక్తి పేరు. 'పు-ఉర్' అంటే చేతివ్రేలు గోరు. హరక్క అంటే నొక్కడం. బహుశా సంతకం చేయడం లేదా సీల్ (రాజముద్ర) వేయడానికి హుంబన్ అహ్పి తన చేతివేలి గోటితో నొక్కాడని చెప్పడం దాని భావం. 'పు-ఉర్' అంటే గోరు. అల్టాయిక్ భాషలో 'పర్ప్ ఇ అరి' (పర్పియరి) అంటే వేలు. మూలద్రావిడ భాషలో వెర్-అల్ = (Finger - DEDR 5409)

జి. బ్రోన్నికోవ్ రూపొందించిన ద్రవిడియన్ ఎటిమోలజీ గ్రంథంలో 'వెరల్' అనేది మూల ద్రావిడ రూపంగా పేర్కొన్నారు.

| | | |
|---|---|---|
| మూల ద్రావిడ | = | వెరల్ |
| మూల దక్షిణ ద్రావిడ | = | విరల్ |
| తెలుగు మూలరూపం | = | వ్రేల్ |
| కొలమి-గదబరూపం | = | వెర్-అన్-డ్. |

వ్రేలు (లేదా) వ్రేళ్ళతో (విరల్) విరుస్తాం కాబట్టి విరు, విరుచు, విరుగు పదాలు ఏర్పడి వుంటాయి... తమిళంలో విరల్ అంటే వ్రేలు. దీన్నిబట్టి ఇలమ్ శబ్దం 'పు-ఉర్' మూల ద్రావిడ భాషలో వెరల్‌గాను మూల తెలుగుభాషలో "వ్రేల్" గా మారినట్లు కన్పిస్తోంది. ప్రాచీన ఇలమ్ పదం నేటికీ తెలుగులో సజీవంగావుందని చెప్పడం ఇక్కడ ముఖ్య విషయం. భాషాశాస్త్ర నియమాలలో వాటిని విశ్లేషించవలసి వుంది.

## BIG (ఇరన, ఇరర)

ప్రాచీన ఇలమ్ భాషలో ఇర్-అ-న; ఇర్-అ-అన్,న; ఇర్-అ-ర శబ్దాలు the big one, a great person అనే అర్థంలో కన్పిస్తాయి. జన వ్యవహారంలో 'ri-a', 'ri-a-ar అనే రూపాలుగా ఈ పదాలు మార్పునొందాయి.

ప్రాచీన చైనా భాషలో, ముఖ్యంగా ప్రోటో ఈస్ట్ కాకేషియన్ భాషలో 'ఇర్-వి' అనే రూపం (Big, large, thick) కన్పిస్తుంది.

డేవిడ్ మెకల్పిన్ మూలద్రావిడ 'ఇర్', 'ఎర్' రూపాలు దీనికి సమీపంగా వున్నట్లు పేర్కొన్నాడు. తెలుగులో 'ఈరము' అనేపదం సాంద్రమైన, దట్టమైన, పెద్దదైన అనే అర్థంలో కన్పిస్తోంది! దట్టమైన వెన్నెలని 'ఈరమగు వెన్నెల' అంటారు.

కన్నడంలో ఈర, తమిళంలో ఈరమ్, మలయాళంలో ఈరమ్ పదాలు కూడా ఇదే అర్థంలో వున్నాయి.

ప్రాటో ఆఫ్రో ఆసియాటిక్ భాషలో 'రి(స్)' అంటే నాయకుడు (Chief, head) అని! మూల సెమెటిక్ భాషలో 'రా-ఇ' అంటే Head. ఇది ఈలమైట్ పదానికి మరింత దగ్గరగా వున్నట్లు కన్పిస్తుంది.

## All (కూట్, కుట్)

ఇలమ్ భాషలో Kut- Tin-Na, Kut-Tan, Kut- Tan-Na, Kuut-Ti-Na - ఈ శబ్దాలు all together అనే అర్థంలో కన్పిస్తాయి. దీనికి గిడ్ /గుడ్ (be many) అనే ఆఫ్రో ఆసియాటిక్ పదం మూలరూపం కావచ్చని కొందరు భాషావేత్తలు భావించారు. కానీ, 'కూట్' అనే మూలద్రావిడ రూపంలోంచి ఇలమ్ భాషలో 'కూటిన' అనే పదం (అందరూ కలిసి) ఏర్పడిందని అరీజియో న్యూనిజ్ ఊహించాడు.

కుట్, కూట్ (సంఘటితం, అందరూ కలిసి) అనే ఇలమ్ రూపానికి సమానంగా తెలుగు కూటమి (కూడు), తమిళం "కూటం", కన్నడం "కూట" పదాలు సజీవంగా కన్పిస్తున్నాయి.

లైంగిక సంబంధాన్ని కూడా కూటమి అంటారు. "సంతల కూటములు" అని ఆముక్త మాల్యదలో రాయలు ప్రయోగించాడు. ఆంధ్ర భాషార్ణవంలో 'కొఱలు గవయుట, కూడిక, కూటమి, కలయిక యనన్ రతి' అని వివరించారు. ఇలమ్ 'కూట్' పదం తెలుగులో సజీవంగా వుందని చెప్పడమే ఇక్కడ ముఖ్య ఉద్దేశం.

## Hair (ఎయ్-ఈ)

ఇలమ్ భాషాశబ్దం 'ee' అంటే (His hair) అని! ఇది అంత నిశ్చితమైన రూపంగా కన్పించలేదనీ, గొర్రె వెంట్రుకలు (ఉన్ని) అనే అర్థంలో ప్రయోగితమై ఉండవచ్చనీ, దానికి సమీపరూపాలు ఇతర భాషల్లో కన్పించలేదనీ అరీజియో న్యానిజ్ రాశారు. ఇంతకు మించిన లోతైన వివరాలు ఆయన ఇవ్వలేదు. ద్రావిడ భాషలో దీనికి సమానమైన రూపం వున్నదేమో మనం పరిశీలించి చూద్దాం.

మూల ద్రావిడరూపం = Y (ఎయ్ (లేదా) ఈ) (1. Feather, 2. Hair )

తెలుగు మూలరూపం = Y (ఎయ్ (లేదా) ఈ)

గోండుల మూలరూపం = Y (ఎయ్ (లేదా) ఈ)

జి. బ్రోన్నికోవ్ రూపొందించిన ద్రవిడియన్ ఎటిమాలజీలో పై వివరాలున్నాయి:

ఇప్పుడు - 'ఎయ్' లేదా 'ఈ' శబ్దం వివిధ ద్రావిడభాషల్లో ఎలా మార్పుచెందిందో పరిశీలిద్దాం. (DEDR534 )

తమిళం = ఇరాయ్ = Yarn, single twisted thread

మలయాళం = ఇరా = a Single thread, Long hair

తుళు = ఇలె (ఎలె) = hair, fibre

తమిళం = ఇర్క్ = జుట్టు ముడివేసుకోకుండా జారవిడవడం

కొండ దొరల భాష = ఇం-క= మొలవెంట్రుకలు (Pubic hair)

తెలుగులో 'ఈ' 'ఎయ్' లోంచి రూపొందిన వివిధ పదాలు గమనించండి

'ఈక' = పక్షుల వెంట్రుక (Feather)

'ఈరు = (కన్నడం ఈరు, తమిళం ఈర్) ఈరులు,

ఈళ్లు = తలవెంట్రుకలలో పేను గుడ్లు. ఈరు దువ్వగ పేను వచ్చును-అని సామెత.

ఈరుచు = దువ్వెనతో దువ్వడం

ఈరు = అల్పమైన, హీనమైన, వెంట్రుకతో సమానమైన

'ఈ' అనే ఇలమైట్ శబ్దం తెలుగులో ఈ విధంగా పరిణమించి నిలిచివుండటాన్ని మనం స్పష్టంగా గమనించవచ్చు.

## Say (న)

ప్రాచీన ఇలమ్ భాషలో 'న' శబ్దానికి "చెప్పడం" అనే అర్థాన్ని భాషావేత్తలు సాధించారు.

'న - అ' = వాడు చెప్పాడు.

న -అన్‌బె = వాళ్ళు చెప్పారు. ఇలాంటి ప్రయోగాలు ఉండేవని భావించారు.

'న' శబ్దానికి సమానమైన, సమీప రూపం కలిగిన శబ్దం ఆనాటి ఇతర సమకాలీన భాషల్లో కన్పించలేదని అరీజియో న్యూనిజ్ రాశారు. డేవిడ్ మెకల్పిన్ ఇలమైట్ 'న' కు మూల ద్రావిడ 'ఎన్' రూపసామ్యతే కాదు అర్థసామ్యత కూడా కల్గినదిగా ఒక ఊహాత్మక ప్రతిపాదన చేశాడు. ఇలమైట్, మూలద్రావిడ భాషలు ఒకే తల్లిభాషకు పుట్టి వుంటాయనేది ఆయన నమ్మకం. ఆ అసలు తల్లిభాషకి ఆయన ప్రోటో ఇలమో ద్రవిడియన్ భాష (PED) అని పేరు పెట్టాడు. మూలద్రావిడ 'ఎన్' శబ్దం + ఇలమ్ 'న' శబ్దం కలిసి ఈ PED భాషలో 'ఎన్న' అనే శబ్దంగా మారివుంటుందనేది ఆయన ప్రతిపాదన.

అంతదాకా వెళ్లవలసినంత పనిలేదనీ, మూలద్రావిడ భాషలోంచే ఇలమ్ భాషాపదాలు (లేదా శబ్దాలు) రూపొంది వుండవచ్చునీ భావించే అవకాశం కూడా వుంది. ఎందుకంటే, తూర్పు ఛాదిక్, పశ్చిమ ఛాదిక్ భాషల్లో 'అన్' శబ్దమే 'చెప్పుట' (to say) అనే అర్థాన్నిస్తోందని న్యూనిజ్ గారు భావించారు.

జి. బ్రొన్ని కోవ్ రూపొందించిన ద్రవిడియన్ ఎటిమాలజీ గ్రంథంలో.....

| | |
|---|---|
| మూల ద్రావిడ | = జన్ (to Say) |
| మూల దక్షిణ ద్రావిడ | = జన్ |
| తెలుగు మూలరూపం | = అన్ (అనుట) |
| మూల కోలమి గడబ | = ఇన్ |
| మూల ఉత్తర ద్రావిడ | = అన్ |

ఈ ద్రవిడియన్ ఎటిమాలజీ గ్రంథం ప్రకారం మూల తెలుగు 'అన్' ఇలమ్ శబ్దం 'అన్' ఒకేరూపంలో, ఒకే అర్థంలో వున్న వాస్తవాన్ని గుర్తించాలి. తమిళంలో 'ఎన్ (ఎన్ను)' = to say, utter, express ఎన్ కాయ్ = చెప్పడం. తెలుగు 'అను' = to say.

మలయాళం 'ఎన్నుక' = to sound, say, think

కన్నడం ఎన్, ఎన్, అన్ను = to say.

మొత్తం మీద - ఇలమ్ భాషా శబ్దాలు మూల ద్రావిడ శబ్దాలకు దగ్గరగా వుంటాయని నిరూపించడంలో డేవిడ్ మెకాల్పిన్, వాక్లావ్ బ్లాజెక్, అరీజియో న్యానిజ్‌లు విశేష కృషి చేస్తే, ఆ మూల ద్రావిడ శబ్దాలు ఈనాటి తెలుగు పదాలకు మరింత సన్నిహితంగా వున్నవాస్తవాన్ని ఈ వ్యాసంలో మనం గుర్తించ గలుగుతున్నాం. అంటే, మూల ద్రావిడ భాష ఎలా వుండేదని అడిగితే, ఇప్పటి మన తెలుగులా వుండేదని సగర్వంగా చెప్పుకోవడానికి ఈ నిరూపణలు ఉపయోగపడుతున్నాయి. అంతేగాని, ప్రాచీన ఇరానియన్లు తెలుగువారేననే వక్రభాష్యం ఏదీ ఇందులో లేదనేది గమనార్హం.



# 8

# ప్రాచీన జార్జియన్లతో పూర్వ ద్రావిడుల సంబంధాలు

## స్పష్టంగా కన్పిస్తున్న తెలుగు పదాలు

**ప్రపంచంలో** ఏమూలలకు వెళ్ళినా ఒక ప్రాచీన జాతి-లేదా ఒక ప్రాచీనదేశం - లేదా ఒక ప్రాచీననగరంలో మనకు ఎంతోకొంత "తెలుగు మూలం" దొరుకుతుంది.

ఆఫ్రికన్లు, ఈజిప్షియన్లు, సుమేరియన్లు, రెడ్ ఇండియన్లు-వీరి భాషలతోపాటు ఆస్ట్రేలియాలోని ఆదివాసులభాషల్లోనూ, తూర్పున చైనా, జపాన్, కొరియా భాషల్లో కూడా ఈనాటికీ తెలుగులో సజీవంగా వున్న అనేక పదాలు అగుపిస్తాయి. వాటిని 'నడుస్తున్న చరిత్ర' పత్రిక ద్వారా వెలుగులోకి తీసుకురావడం జరిగింది.

పురావస్తు పరిశోధనలు, చారిత్రక పరిశోధనలే కాకుండా భాషా చారిత్రక దృష్టికోణం నుంచి కూడా అధ్యయనంచేస్తే, మన పూర్వులు ఆయాకాలాలలో, ఆయా దేశాలతో పెంచుకున్న సంబంధ బాంధవ్యాలు గానీ, నడిపిన వ్యాపార లావాదేవీలు గానీ, పెంచిన సాంస్కృతిక, తాత్త్విక అనుబంధాలు గానీ వెల్లడి అవుతాయి. అలా అనేక ప్రాచీన జాతుల భాషలలో తెలుగు పదాలు కన్పించి నప్పుడు అవి మూల ద్రావిడభాషా పదాలని, తర్వాతికాలంలో తెలుగుభాషగా పరిణమించాయనీ నమ్ముతున్నాం. అయితే, ప్రాచీన జాతులలో సంబంధాలు తెలుగుభాష విడివడటానికన్నాముందు, విడివడిన తర్వాత కూడ కొనసాగాయి.

చరిత్ర గమనంలో తెలుగు ఏనాడూ వంటరి భాషగా లేదు. ఆమాటకొస్తే ఏ

జాతి, ఏ నాగరికత, ఏ భాష వంటరిగా వికసించే అవకాశమే లేదు. సమకాలీన ప్రపంచంతో పెనవేసుకుని పెరిగిన జాతులే చరిత్రని నిర్మించాయి. అందుకే, ప్రాచీన జాతుల ప్రాచీన భాషలలో కన్పించే తెలుగుపదాలని ప్రోటో తెలుగు పదాలుగా వ్యవహరించవలసిన అవసరం వుందని భావిస్తున్నాను.

సుమేరో అక్కాడియన్ ప్రభువు NARAMSIN నరసింహగానూ, GANISH గణేష్‌గానూ SARGUN సగరుడుగానూ AHAMENES అసమంజసుడిగానూ కన్పిస్తుంటే, చరిత్రకారులు పట్టించుకోకుండా ఎలావుండగలుగుతారు? వీళ్ళు ఆర్యదేవతలని కొందరు, ఆర్యేతర దేవతలు / ప్రభువులని కొందరూ పేర్కొన్నారు.

మొత్తం మీద ఇండోయూరోపియన్ భాషాకుటుంబంతో సమానంగా ద్రావిడియన్ భాషా కుటుంబం కూడా అతి ప్రాచీనకాలంలో అత్యధిక భూభాగాన విస్తరించిందనే నమ్మకం నూతన పరిశోధకుల్లో బాగా బలపడుతోంది. హిందూ పురాణాలలో కన్పించే పురాణ పురుషుల కథలన్నీ సంస్కృతీకరించబడడం Sanskritization వలన అవి ఆర్యగణాలకు చెందినవారి కథలనే అపోహ ఏర్పడిందనీ, నిజానికి వాటిలో చాలాభాగం ద్రావిడ సంస్కృతికిచెందినవి కావచ్చునీ, ఆర్య సంస్కృతి ద్రవిడియన్ల కారణంగా ద్రవిడీకరించబడిందనే వాదనకూడా ఇప్పుడు బాగా బలపడుతోంది.

'సు-మేరు' పదానికి సు = బంగారం, మేరు = కొండ అనే అర్థాలు చెప్తారు. అయితే, జి. బ్రొన్నికోవ్ రూపొందించిన "ద్రవిడియన్" ఎటిమాలజీ గ్రంథం సెంట్రల్ ప్రొటో ద్రవిడియన్ భాషా రూపాలన్నీ ప్రోటో తెలుగు రూపాలుగా ఎలా పరిణామం చెందాయో చక్కగా వివరిస్తుంది. ఈ గ్రంథంలో "మేరు" పదం గురించిన వివరణ ఇలా వుంది.

మూలద్రావిడ = mc Er-i (మేర్ - ఇ = handle of Plough, నాగలికర్ర)

దక్షిణ ద్రావిడ = mc, Er - i (మేర్ - ఇ)

ప్రోటో తెలుగు = mc Ed - i (మేడ్ - ఇ)

ప్రోటో గోండ్ = mc Er - i (మేర్ - ఇ)

"నాగలిదుంప వెనుక నిలిపిన కొయ్య" అనే అర్థంలో తెలుగులో "మేడి" పదం పూర్వద్రావిడ మేర్ - ఇ లోంచి ఏర్పడింది. "సుమేర్" పేరులో 'మేర్' అనేది పూర్వద్రావిడ భాషలో నాగలికి సంబంధించిన పదమేగాని, కొండకు సంబంధించింది

కాదు. కొత్తరాతి యుగంలోంచి కంచు (లేదా) లోహయుగంలోకి సమాజం పరిణమిస్తున్న కాలం అది. కొన్ని అడవి జంతువులను మచ్చిక చేసుకోవడం, కొన్ని అడవి మొక్కల్ని పెంచి ఆహారోత్పత్తికి తోడ్పడం - ఇలాంటి "కృషి" ఎక్కువగా జరుగుతున్న ఆ సమయంలో 'సుమేరు' వ్యవసాయపరమైన పదంగా ఏర్పడడం సహజమైన విషయమే! బంగారుకొండ అని పెట్టుకున్నందువలన కలిగే ప్రయోజనం మాత్రం వాళ్ళకి ఏముంది? సుమేరియన్ నాగరకత ద్రావిడ నాగరకతేననే వాదనకి ఈ విశ్లేషణ బలం చేకూరుస్తుంది. సుమేరియన్ నాగరకతా కాలంలో అక్కడి ప్రజలకు నాగలి వినియోగం పూర్తిగా తెలుగుసుననేది ముఖ్య విషయం!

ప్రాచీన ఈజిప్ట్ నుంచి ప్రాచీన ఇరాన్ దాకా విస్తరించిన ప్రాంతాలన్నింటిలోనూ పూర్వద్రావిడ పదాలు ఇలా ఎన్నో మనకు కన్పిస్తాయి. మిడిల్ ఈస్ట్ అని పాశ్చాత్యులు పిలిచే ప్రాంతాన్ని చుట్టుకొని ఎన్నో ప్రాచీన సంస్కృతులు విలసిల్లాయి. బహరైన్, ఈజిప్ట్, ఇరాన్ (ప్రాచీన పర్షియా), ఇరాక్, ఇజ్రాయెల్, సుడాన్, సిరియా, యునైటెడ్ అరబ్ఎమిరేట్స్, ఏమెన్ మొదలైన ప్రాంతాలలో తెలుగుభాష మూలాలు అనేకం దొరుకుతాయి. అలాంటివి వెదికే చిన్న ప్రయత్నమే ఈ వ్యాసం.

జార్జియా సామ్రాజ్యాన్ని కాకేషియస్ ఇబేరియా, తూర్పు ఇబేరియా అని పిలుస్తారు. ఇబేరియా అనేది లాటిన్ పదం. క్రీ.పూ. 4నుంచి 5వ శతాబ్ది దాకా జార్జియన్ రాజవంశ పాలన సాగింది!

జార్జియన్లు తమదేశాన్ని "కర్తలీ" అనీ, తమని కర్తవేలియన్లనీ పిలుచుకున్నారు. కర్తలోస్ అనే పురాణ పురుషుడి పేరున కర్తలిగా ప్రసిద్ధి పొందింది. "కర్త" అంటే బ్రహ్మ! బ్రహ్మదేవుడి ప్రతిరూపం ఈ కర్తలోస్ కావచ్చు. పూర్వ ద్రావిడుల దేవత ఈ బ్రహ్మదేవుడని అనేక సాక్ష్యాలను ఈ గ్రంథంలోనే అందించాను. పరిశీలించ గలరు.

అంటే, ద్రావిడ మూలాలు ఈ దేశనామంతోనే ప్రారంభం అయ్యాయన్నమాట!

ఇస్లామీకరణ తర్వాత యూరప్‌తో ఈ కాకేషియస్ ఇబేరియా ఎక్కువ అనుబంధాన్ని పెంచుకొంది. అజర్‌బైజాన్, ఆర్మేనియా, జార్జియా లపైన 19వ శతాబ్దిలో రష్యా ప్రభావం కూడా గణనీయంగానే వుంది. తుర్కుమెనిస్తాన్, ఉజ్జెకిస్తాన్, తజికిస్తాన్, కజఖ్‌స్తాన్, కిర్గిజ్‌స్తాన్ మొదలైన దేశాలు ఒకప్పుడు మిడిల్ ఈస్ట్ సంబంధీకులే కాబట్టి, వీటిని ఇప్పుడు యూరప్ + ఏసియా = యూరేసియా

దేశాలని పిలుస్తున్నారు. కొంతకాలం పాటు వీటిని నియర్ ఈస్ట్ దేశాలని, ఇండియాని ఫార్ ఈస్ట్ అనికూడా వ్యవహరించేవారు. ఈ కారణాలవలన ఆధునిక జార్జియన్ భాషపైన యూరోపియన్‌ల ప్రభావం అధికంగా ప్రసరించింది.

ఒకప్పుడు, జార్జియాతోపాటు ఈ దేశాలన్నింటికీ భాషాచరిత్రపరంగా ఇరాన్, ఆఫ్ఘనిస్తాన్ భారతదేశాలతో సంబంధ బాంధవ్యాలుండేవి. అనేక పదాలు ఒకే అర్థంలో ఈ మూడు దేశాల్లోనూ కన్పిస్తాయి. ఈ ఉదాహరణలను పరిశీలించండి.

| **ఇరాన్** | **ఆంగ్లానువాదం** | **జార్జియన్** | **తెలుగు** |
|---|---|---|---|
| సొస్త్ | Week | సుస్త్ - ఇ | సుస్తీ = జబ్బు |
| గొమన్ | Thought, Opinion, Suspicion, Suggestion | గుమాన్-ఇ | గుమాను = అనుమానం (హిందీ పదం) |
| మిజ్ద్, మొజ్ద్ | Price, Payment, Rent | మిజ్ద్ - ఇ | మజూరి |
| సహ్-రాహ్ | Royal way, Widened Road | సర | సరణి = త్రోవ, మార్గము (సరళి అనికూడ వ్యవహరిస్తాం) |

ఇరాన్‌తో భారతీయులకు గల సంబంధాల వలన అనేక పార్శీ పదాలు తెలుగులో చోటుచేసుకోవడంలో ఆశ్చర్యం లేదు. కానీ, తెలుగులోకి వచ్చిన ఇరానీ రూపాలు జార్జియా రూపాలకు ఎంతో దగ్గరగా వుండడం విశేషం "ఆన్‌లైన్"లో జార్జియన్ డిక్షనరీని జాగ్రత్తగా పరిశీలిస్తూ వెదికితే ఇలాంటి పదాలు, వాటిమధ్య సామీప్య సారూప్యతలు అనేకం దొరుకుతాయి. వాటిని భాషాచారిత్రకపరంగా విశ్లేషించాలి. మూలతెలుగు భాష మాట్లాడిన మన పూర్వీకుల పుట్టుపూర్వోత్తరాలు తెలుసుకోవడానికి, మన భాష రూపుదిద్దుకున్న వైనాన్ని గ్రహించడానికి ఈ విశ్లేషణ చాలా అవసరం.

మధ్య ప్రాచ్య దేశాలలో జార్జియాకు ఓ ప్రత్యేమైన స్థానం వుంది. అత్యంత

నాగరకమైన సుమేరియన్, పర్షియన్, ఇండియన్ జాతులతో సాంస్కృతికమైన సంబంధాలు పెంచుకొని వికసించిన దేశం అది! ఇంచుమించుగా క్రీ.శ. 12-13వ శతాబ్ది వరకూ దాని ప్రాచీన వైభవం అలాగే కొనసాగింది. అప్పట్లో దాని లిపిని "చాట్సురి" అనేవాళ్ళు. 13వ శతాబ్ది తర్వాత MKHEDRULI అనే లిపిలో రాయడం మొదలుపెట్టారు. ప్రస్తుతం జార్జియన్లు రాస్తున్న లిపి ఇదే!

ఈ భాషలో పదాలు తెలుగుపదాల్లాగే ధ్వనిస్తాయి. అని (A) బని (B) గాని (G) దొని (D) ఎని (E) విని ((G)) జెని (J) తని (I) ఇని (I) ఖని (K) లజి (L) మణి (M) ఓని (O) షని (S) కాని (X) హే (H) - ఇలా వుంటాయి జార్జియన్ పదాలు. ఇదికూడా తెలుగులాగే అజంత భాష. ట ఠ లు, శ ష స క లు కూడా పలుకుతాయి. దాని లిపి ఇలా వుంటుంది.

იყო არაბეთს როსტევან,
მეფე ღმრთისაგან სვიანი

ప్రాచీన జార్జియా భాషని కర్త్లీ (కర్తులీ) అంటారు. ది లైఫ్ ఆఫ్ కర్త్లీ (Tgilis, 1849 పేజీ 129)లో మొదటిగా జార్జియా ఇండియాల మధ్య నడిచిన సంబంధాలను ప్రస్తావించారు. ఆ తర్వాత చాలా పరిశోధనలు చేశారు. బహుశా కర్తులీ భాష 'సింధు' నాగరకత చరమాంకంలో బాగా వ్యాప్తిలో వుండి వుండవచ్చు.

Dr. NIKOLOZ KENCHO SHIVLI అనే పరిశీలకుడు "ఇండో జార్జియన్ హిస్టారికల్ట్రైస్" పేరుతో జర్మనీ భాషలో 1993లో ఒక పరిశోధనాత్మక వ్యాసం ప్రచురించాడు. దాని ఇంగ్లీషు అనువాదం అందుబాటులోనే వుంది. అందులో కొన్ని జార్జియన్ పదాలు సంస్కృత భాషకు బాగా 'దగ్గరగా వుండటాన్ని ఆయన ఎత్తిచూపించారు. తద్వారా ఇండోయూరోపియన్ భాష ప్రభావంతో జార్జియన్ భాష రూపొందిందనే ఆలోచనని ఆయన చేశారు. అయితే, అదే విశ్లేషణని ఇంకొంచెం లోతుగా అధ్యయనం చేస్తే, అవి మూలద్రావిడ రూపాల నుంచి

రూపొందినవని, తెలుగులో అవి ఇంకా సజీవంగా వున్నాయని తేలింది. ఆ వైనాన్ని సవివరంగా మీ ముందుంచుతున్నాను. పరిశీలించండి.

**1. WRIST** : ముష్టి (సంస్కృతం = గుప్పిట) MUSTU (జార్జియన్ = WRIST)

స్థూలంగా చూసినప్పుడు, జార్జియన్ ముష్టు, సంస్కృత ముష్టి సమాన రూపాలు, సమానార్థకాలుగానే కన్పిస్తున్నాయి. కానీ, పూర్వద్రావిడ రూపాలను కూడా గమనించండి.

| | | |
|---|---|---|
| పూర్వద్రావిడ | = ముట్ | = Fist, to hammer |
| పూర్వ దక్షిణద్రావిడ | = మొట్ | |
| ప్రోటో తెలుగు | = మొట్. ట్ | |
| ఆధునిక తెలుగు | = మొట్టు. | |

"ముట్" అనే మూల ద్రావిడరూపానికి 'FIST' to hammer లతోపాటు ఇంకా అనేక అర్థాలున్నాయి.

| | | | |
|---|---|---|---|
| 1. to touch | = ముట్. ట్ | = ముట్టుకోవడం | |
| 2. Knee, Elbow | = ముడ్ | = ముడుకు | |
| 3. Tool | = ముట్ | =(పని)ముట్టు, కుడిముట్టు (అన్నంతినే కంచం) | |
| 4. Surround | = ముట్ | = (చుట్టు) ముట్టు | |

నిజానికి సంస్కృత పదం "ముష్టి"ని తెలుగులో అతి సాధారణ ప్రజలు కూడా వాడుతూనే వుంటారు. అది సంస్కృతంలోంచి వచ్చిన పదమే అయితే, అతి సామాన్యులకు అందేదిగా వుంటుందా అని అనుమానం. ముష్టివాడు, ముష్టియుద్ధం, ముష్టి వెయ్యడం ఇలా తరచూ వాడుకునే పదమే ఇది!

మూలద్రావిడ "ముట్" సంస్కృత భాషలో "ముష్టి"గా చేరడానికి తెలుగు పండితులే సహకరించి వుండవచ్చేమో!

**2. GARLAND :** మాల (సంస్కృతం)

MALA (జార్జియన్ = Spinal, as garland)

జార్జియన్ MALA, సంస్కృతం మాల ఒకే రూపం, ఒకే అర్థంలో వున్నమాట

వాస్తవం. అయితే, "మాల" అనే పదం పూర్వ తెలుగుభాషలోంచి సంస్కృతంలోకి చేరేందుకు అవకాశం వున్నదా.... అన్నది ప్రశ్న. ఈ వివరాలు పరిశీలించండి:

ప్రొటో ద్రవిడియన్ రూపం = మాల్ - అయ్ (Garland, Wreath) (Wreath = మాల, దండ, హారము, మలిపినది

ప్రొటో తెలుగు = మాల్. అ

ఆధునిక తెలుగు = మాల

పూర్వద్రావిడ రూపాలను పునర్నిర్మించుకోగల్గినపుడు, అవే పదాలు సంస్కృతంలో వున్నంత మాత్రాన తొందరపడి సంస్కృతపదాలే ద్రావిడ భాషలన్నింటిలో చేరినట్లు భావించనవసరం లేదనుకుంటాను. ద్రావిడ భాషలోంచే ఆ పదం సంస్కృతంలోకి చేరి వుండవచ్చుకూడా! మనం ఆ దృష్టితో పునఃపరిశీలన చేయాలి.

ఒకటి మాత్రం వాస్తవం. తెలుగులో 'మాల' శబ్దం సంస్కృతంలోంచి రాలేదు. అది ద్రావిడ భాషాపరమైన రూపమే! భాషా చారిత్రకపరంగా ఈ పదం సంస్కృతంలోకి చేరడానికి మూల తెలుగు సహకరించి వుంటుంది.

మరో ముఖ్య విషయం: తెలుగునాట 'మాల' ఒక కుల వాచకం కూడా. ఇది సంస్కృత "మాల" శబ్దంలోంచి ఏర్పడలేదు. 'మాల్' అనే ప్రోటో ద్రవిడియన్ రూపం ఇంకొకటి వుంది. దీనికి, Confused, Perturbed, intoxicated, to die, to destroy అని అర్థాలున్నాయి. ఇక్కడ "Perturb" అంటే, చలింపచేయు, కదిలించు, ఆందోళన కలుగచేయు, వైకల్యం అని! ఈ అర్థాలలోంచి 'మాల్' అనే మూలద్రావిడ పదం మూల తెలుగుభాషలోకి 'మాల' అని కుల వాచకంగా మారి వుండవచ్చు. 'మాల' అనే కులవ్యవస్థ స్పష్టంగా "దళిత" అనే అర్థంలో ద్రావిడ భాషలోంచి తెలుగు విడివడే నాటికే ఏర్పడివుందని ఊహించేందుకు ఇది ఆస్కారం ఇస్తోంది. ప్రాచీన ద్రావిడ సమాజపు బానిస వ్యవస్థ గురించి అధ్యయనాల అవసరం అందుకే. సింధూ నగరాలలో డ్రైనేజీ వ్యవస్థ వుండేదని గొప్పగా చెప్పుకొంటున్నాం. కానీ, వాటిని శుభ్రంచేసిన పారిశుధ్య పనివారెవరని మనం పెద్దగా ఆలోచించడం లేదు. ధనిక వ్యాపార వర్గాల కోటల్లాంటి ఇళ్లు- పరమ పేదల బీదకొంపల మధ్య స్పష్టమైన తేడా అక్కడ కన్పిస్తుంది మనకి. గోచీపెట్టుకుని కూర్చున్న ఒక బానిస బొమ్మ నగరాలలో దొరకడం ఇందుకుసాక్ష్యం. హిందూ వ్యవస్థలో "కుల తత్త్వం"

ద్రావిడీకరణం వలనే ఏర్పడిందనీ అలనాటి భారతీయ సామాజిక వ్యవస్థ ఇప్పటి మన తెలుగు సమాజంలానే వుండేదనీ భావించడానికి ఈ నిరూపణ అవకాశం ఇస్తోంది! అంతేకాదు, సమరంలో ఓడిపోయిన జాతులు గెలిచిన వారికి బానిసలుగా జీవించారనుకోవడం అన్ని సందర్భాలకూ వర్తించే విషయం కాదు. సింధునగరాలలో బానిసలు జన్మతః దళితులే అయివుంటారని ఊహించవచ్చు. వర్ణవ్యవస్థ కుల వ్యవస్థ వేర్వేరు అంశాలు!! ఆర్యులది వర్ణవ్యవస్థ తెలుగువారిది కులవ్యవస్థ కాలగమనంలో ఏర్పడిన హిందూ సమాజంలో ఈ రెండు అంశాలూ కలగలిసి పోయాయి. బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రులకు అదనంగా దళితులు ఆది నుంచీ ఇప్పటికీ అదే దుస్థితిలో కొనసాగుతున్నారు.

## 3. TIE బంధ (సంస్కృతం)

BANDVA (జార్జియన్)= to tie బంధ' అనే సంస్కృత పదానికి "బంద్వ" అనే జార్జియన్ పదం సమానంగా లేకపోయినా దగ్గరగా వున్నమాట వాస్తవం. అయితే తెలుగులో 'ద'కు వత్తు లేకుండ "బందము" అనే రూపం సజీవంగా వుంది.

1. దూలంపై గుజ్జులకు బిగువుగా వుండేందుకు లంకెగా అమర్చిన పట్టె.
2. తాటిచెట్టు ఎక్కేటప్పుడు రెండు కాళ్ళకు తగిలించే తాడు.
3. పశువులకు ముందుకాళ్ళు రెండింటికీ తగిలించే తాడు.

తెలుగులో ఇలా "వత్తు" లేని ముతకరూపం "బందం", సంస్కరించబడి సంస్కృతంలో "బంధం" గా మారేందుకే అవకాశాలున్నాయి గానీ, సంస్కృత 'బంధం' తెలుగులో ముతకగా 'బందం' అయివుండదని కూడా అనుమానించ వచ్చు.

## 4. to Kill, to hit మర్ (సంస్కృతం) so-mar-e (జార్జియన్ = grave)

'సొరెమపా' అనే జార్జియన్ పదంలో మర్, (మరణం) సంస్కృత మర్ సమానంగానే కన్పిస్తోన్నాయి. అయితే, మూలద్రావిడరూపం "మర్" కూడా ఇదే అర్థంలో వుంది. అది తెలుగులోకి పొందిన పరిణామాల్ని గమనించండి.

| | |
|---|---|
| ప్రొటో ద్రవిడియన్ - మర్ | = to fade, obscure, dirty |
| ప్రొటో సౌత్ ద్రవిడియన్ | = మర్ |

ప్రోటో తెలుగు = మ్రగ్ (మ్రగ్గు)

'మ్రగ్గు' అనే ఆధునిక తెలుగు పదానికి చచ్చు, నష్టమగు, విహ్వాలించు, తగ్గు, మండిపడు, చిముడు -ఇలా అనేక అర్థాలున్నాయి. మరక, మఱుగు (చాటు) మఱుగుడు (సంతాపం) ఇలాంటి పదాలు కూడా తెలుగులోకి మూలద్రావిడ 'మర్' లోంచే ఏర్పడివుండాలి. సంస్కృతంలోకి కూడా "మర్" అనేది మూలద్రావిడం లోంచే చేరి వుండవచ్చనే ఊహ అత్యాశకాకపోవచ్చు.

**5. Body** తను = సంస్కృతం (తనువు)

Tani = జార్జియన్ (Body)

పూర్వ 'తన్' అనే మూలద్రావిడ రూపానికి Rich, abundant అని అర్థాలు. తాను (గౌరవ ఏకవచనం), తాము (గౌరవ ఏక/బహువచనం), అతను, ఇతను, తనది, తనంతట తాను - ఈ పదాలలోని "తను" సంస్కృత 'తనువు'కు హ్రస్వరూపమా లేక మూలద్రావిడ "తన్" లోంచి రూపొందినదా అనేది ప్రశ్న.

జార్జియన్ పదాలలో ఇలా తెలుగు, సంస్కృతపదాలకు దగ్గరగా వున్నవి అనేకం కన్పిస్తున్నాయి. వాటిని పట్టించుకుని విశ్లేషణ చేయగలిగితే తెలుగుభాష మూలాలు అనేకం వెలుగులోకి వస్తాయి. ఇది ప్రత్యేకమైన అధ్యయనాంశం.

ఇక్కడో ముఖ్య విషయం చెప్పాలి. పూర్వద్రావిడ భాష అనేదే ఒక ఊహాత్మకం. అందులోంచి తెలుగు, తమిళ, కన్నడ తదితర భాషలు పరిణమించాయనడం ఒక నమ్మకం. ఈ నమ్మకంతోనే మనం అనేక భాషలలో తెలుగు పదాల్ని పరిశీలన చేస్తున్నాం. ఈ పరిశీలన సంస్కృతభాషలో ఇమిడిపోయిన తెలుగుపదాల మీద కూడా జరగాలి. సంస్కృత భాషప్రభావంతో తెలుగు ఏర్పడిందని, అందులో అధిక భాగం సంస్కృత పదాలే వున్నాయని అంటారు కదా... కానీ, జి. బ్రొన్నికోవ్ 'తెలుగు ఎటిమాలజీ' 'ద్రవిడియన్ ఎటిమాలజీ' అనే గ్రంథాల్ని రూపొందించాడు. ఆగ్రంథాలలో పూర్వ ద్రావిడ రూపాలు పూర్వ తెలుగు రూపాలుగా మారిన వైనాన్ని గొప్పగా విశ్లేషించాడు. గమనిస్తే, తెలుగులో వున్న సంస్కృత పదాలు చాలా వరకూ సంస్కృత భాషలోంచి తెలుగులోకి చేరినవికాకపోవచ్చని, మూల ద్రావిడ రూపాలే తెలుగు రూపాలుగా మారాయని అర్థం అవుతుంది. తెలుగులోవున్న సంస్కృత పదాలన్నింటినీ ఒకచోటచేర్చి ఒక్కోపదం గురించి విశ్లేషించి చూడండి. సంస్కృత

భాషలోకి చేరిన తెలుగు పదాలు మనకు చాలా దొరికే అవకాశం వుంది. తద్వారా తెలుగుభాష ప్రాచీనతని నిరూపించే అవకాశాలు కలుగుతాయి.

ఇది సంస్కృత భాషకు వ్యతిరేకంగా చేసే ప్రచారం అని ముద్ర వెయ్యకుండా నిదానించి చూడండి. సంస్కృతానికి పదపుష్టి నిచ్చిన తెలుగుభాష మన 'అమ్మభాష' అయినందుకు మనం గర్వించగలుగుతాం!!



# 9

# ప్రపంచ భాషల్లో తెలుగు 'మెంతులు'

## ప్రాచీన జాతులతో సంబంధాలకు సాక్ష్యాలు

**'డిజిటల్** డిక్షనరీస్ ఆఫ్ సౌత్ ఏసియా' వారు ఆన్‌లైన్‌లో అందించిన 'నేపాలీ- ఇంగ్లీషు' నిఘంటువును పరిశీలిస్తున్నప్పుడు అందులో 'మసాలా' అనే పదం కన్పించింది. నేపాలీయులకు ఈ పదం విదేశీయమే అయినా దాన్ని వాళ్ళు ఎలా జాతీయం చేసుకోగలిగారో ఈ నిఘంటువులో కన్పించిన వివరణలు చదివితే అర్థం అవుతుంది.

'జాచ్మా కసరి పాస్ గార్నె మసాలా దినోస్‌న' అనే నేపాలీ వాక్యానికి 'పరీక్షలు పాసయ్యే మసాలా (క్లూ = ఉపాయం) ఏదైనా చెప్పు' అని అర్థం. ఈ అర్థంలో 'మసాలా'ని వాడడం కొత్తగానే అన్పించింది. 'రేరియోమా మసాలా సిద్ధియో' "ఈ రేడియోలో మసాలా చచ్చిపోయింది -' అంటే, బ్యాటరీ అయిపోయిందని అర్థమట!

మనం కూడా పరభాషా పదాలకు డుమువులు చేర్చి తెలుగేననిపించ గలుగుతున్నాం. రోడ్డు, కారు, రైలు అనేస్తున్నాం. అయినా తెలుగు వాక్యంలో ఈ పదాలను తెచ్చి అంటిస్తున్నట్టే వున్నాయి గాని, నేపాలీ వారు మసాలాని జాతీయం చేసుకున్నట్టు మనం ఈ పరభాషా పదాలను నూరుశాతం స్వంతం చేసుకోలేక పోతున్నాం.

అందువలన, ఇంగ్లీషు పదాలు ఇంగ్లీషువిగానే జనవ్యవహారంలో నలుగుతున్నాయి. 'బెగ్గరంకులూ', 'స్వీపరాంటీ' లాంటి పదాలను మన పిల్లలు వాడుతున్నారని ఆక్షేపిస్తున్నాం గానీ, అందుకు సమానమైన గౌరవవాచకాన్ని తెలుగులో మనం కల్పించలేక పోతున్నాం. బదులుగా ఏం అనాలో చెప్పమని నిలదీస్తే మన దగ్గర 'అరచేతి ఊసిరికాయ'లు ఏమీ లేవు. "రిక్షా అంకుల్"ని "రిక్షా బాబాయి" అని పిలవగలిగేంత సంస్కారం మనకున్నదా... అనేది ప్రశ్న.

అయితే, ఇంగ్లీషు పదాలకు తెలుగు సమానార్థకాలు జనపదుల నోళ్ళలోంచి పుట్టాలేగాని, మన మహారచయితలు మఠం వేసుకొని 'ద్విచక్రవాహనం' లాంటి సంస్కృత అనువాదాల్ని తెలుగులాగా భ్రమింపచేస్తే అది జనామోదం పొందదు. 'రెండు చక్రాల బండి' అంటే తెలుగుకు అవమానం ఏమీ కాదు కదా... ఒక గ్రామీణుడు ఫ్లై ఓవర్ మీద నుంచి వచ్చాననడానికి 'పై దారి' మీంచి వచ్చినట్టు చెప్పడం ఇందుకు ఉదాహరణ. పరభాషా పదాలకు తెలుగు సమానార్థకాలు ఇలా జనపదుల్లోంచే పుట్టాలి. ఇంగ్లీషు, సంస్కృతం ఏమాత్రం తెలియని వారే తెలుగు భాషని పరిపుష్టి చెయ్యగలుగుతారు.. అనేది పచ్చినిజం. ఇందుకు చదువుకున్న పండితులు కోపగించుకోనవసరం లేదు.

ఒక పదం విదేశీయమే అయినా అది తెలుగుతో మమేకం కావాలి. 'తాళం చెవి'లో 'చెవి' పోర్చుగీసు పదమే. మన పూర్వీకులు దాన్ని తెలుగేనన్నంతగా కలపగలిగారు. కారునీ, బస్సునీ మనం అలా కలపలేకపోతున్నాం. త్రాసు అనే పర్షియన్ పదం తిక్కన గారి కాలానికే తెలుగు భాషాపదంగా చేరింది. 'అక్షీణ సత్యులు ధర్మపరులును నైన భూసురులును నీవు / ద్రాసులుంబోని చిత్తంబుల తోడఁ దఁ బ్రజ వివాదము నెడఁ బక్ష ముడిగి....' అంటాడు. కాబట్టి ఒక భాష బలంగా ఉండటానికి 'అరువు' పదాలను సజావుగా వినియోగించుకో గలగాలి.

అయితే, ఇదంతా వేరే విషయం ఇక ప్రస్తుతానికి వద్దాం! 'మెంతులు' గురించి - ఆరోగ్యపరంగా అవి కల్గించే ప్రయోజనాల గురించి "భోజనం కథలు" అనే పుస్తకంలో రాస్తున్నప్పుడు ఈ పదం పుట్టు పూర్వోత్తరాలు పరిశీలించే అవకాశం కల్గింది.

'మెంతి' అనే తెలుగు పదం అనేక ప్రపంచ భాషల్లోకి నేరుగా గాని, భావపరంగా గాని ఎలా వ్యాపించిందో ఆలోచిస్తే చాలా ఆశ్చర్యం కలుగుతుంది. ఆ వైనాన్ని మీ ముందుంచడం ప్రస్తుత కర్తవ్యం.

చరిత్ర పూర్వకాలం నుంచీ ఆసియా ప్రజలు మెంతుల్ని వినియోగిస్తూనే వున్నారు. ముఖ్యంగా మధ్యధరా సముద్రతీర ప్రాంతాలతో మొదలుపెట్టి చైనా వరకూ వ్యాపించి వున్న జంబూ ద్వీపం అనండి - లేదా భరతవర్షం అనండి... ఈ ప్రాంతంలో ప్రజలు అనాదిగా మెంతుల్ని ఉపయోగిస్తున్నారు. అయితే, ఈ దేశాలన్నింటిలోనూ మెంతులు బాగా పండు తున్నాయని కాదు, పండిస్తున్నది కొందరే! కాని, దక్షిణ ఆగ్నేయ ఆసియా దేశీయులంతా మెంతుల్ని వాడుకోవడానికి అలవాటుపడ్డారన్నది ముఖ్య విషయం.

మెంతుల్ని ఆంగ్లంలో ఫినుగ్రీకు అంటారు. ఈ మొక్క ఫీనమ్ గ్రీకమ్ (FOENUM GRAECUM) అనే తెగకు సంబంధించింది. 'గ్రీకు సుగంధ ద్రవ్యం' అని దీని అర్థం. ఈ మాటనే యూరోపియన్ దేశాలు రకరకాలుగా ఉపయోగిస్తున్నాయి. ఇంగ్లీషు 'ఫెనుగ్రీక్', డచ్ 'ఫెనిగ్రీక్' పేర్లు ఇందుకు ఉదాహరణ. ఫెన్నెల్ అనే లాటిన్ పదానికి 'ఘాటు' అని అర్థం. గ్రీకు ఘాటు అని "ఫెను గ్రీకు"కు అర్థం అన్నమాట!

ఈ ఉదాహరణల ఆధారంగా వృక్ష శాస్త్రవేత్తలు 'మెంతి' పదానికి గ్రీకు మూలాన్ని ఆపాదిస్తూ ఒక నిర్ణయానికి వచ్చేశారు. అందరూ మెంతులకు 'గ్రీకు' మూలం అంటున్నారు కదా.... మరి గ్రీకులు ఈ మొక్కని ఏమని పిలుస్తారో వూహించగలరా....! వాళ్ళు 'తెలిస్' (TELIS) అంటారు. బహుశా 'తెలుగు ఘాటు' అని దీని అర్థమా...? అయితే, ఆ అర్థం ఇప్పుడు వ్యాప్తిలో లేదు. బల్గేరియా భాషలో తిల్‌చెట్స్ (TILCHETS) పదం మాత్రం ఈ నాటికీ సజీవంగా వుంది. బల్గేరియా భాషలో మెంతుల్ని 'SMINDUH' (స్మిందు), 'SMINDUH GRUTSKI' (స్మిందు గ్రుట్స్కి) అని కూడా పిలుస్తారనేది ఇక్కడ గమనార్హం.

జర్మనీ, ఇతర జర్మనిక్ భాషల్లో ఈ ఫెనుగ్రీక్‌కి ఇంతకన్నా భిన్నమైన పేర్లు కనిపిస్తాయి. జర్మన్‌లో 'బక్స్ హార్న్ క్లీ' 'BUCKSHORNKLEE' అంటే మెంతులు! 'బక్స్ హారన్స్ క్లొవర్' 'దుప్పి లేదా మేక కొమ్ము ఆకారంలో ఉండే గింజ' అని దీని అర్థం. Birds foot, Goats Horn లాంటి పేర్లతోనూ పిలుస్తారు.

మెంతి గింజని దగ్గరగా పరిశీలించి చూడండి. కొమ్ములతో సహా మేకముఖం లాంటి ఆకారం వుంటుంది. ఇప్పటిదాకా మనం ఈ దృష్టితో మెంతిగింజని ఎప్పుడూ చూసి వుండం. డజను గింజల్లో కనీసం ఐదారైనా ఇలాంటి ఆకారంలో వున్నవి మనకు కన్పిస్తాయి. అడవి మెంతుల్ని వంటమెంతులుగా మనం అలవాటు

మరిగేకొద్దీ - అంటే, అవి domesticate అయ్యే కొద్దీ వాటి రూపపరిమాణాల్లో కొంత మార్పు వచ్చి వుండవచ్చు. క్రీస్తుపూర్వ కాలంలో అవి బాగా మేక ముఖం ఆకారంలోనే వుండి వుండవచ్చు కూడా. అయినా, ఇప్పుడు మరొక్కసారి వంటింట్లోకి వెళ్ళి కొన్ని మెంతి గింజల్ని చేతిలోకి తీసుకొని చూడండి - మేక ముఖం వున్న గింజలు తప్పకుండా కన్పిస్తాయి. 'బక్' అంటే దుప్పి, మేకపోతు కూడా! జర్మన్‌లు మేకపోతు ముఖాన్ని వూహించుకున్నారు ఈ గింజ ముక్కోణపు ఆకారంలో వుండి, దిగువ భాగం మేకమూతిగానూ, ఎగువన రెండు కొమ్ములు పొడుచుకొచ్చినట్లు వుంటుంది. ఇదీ మెంతిగింజ ఆకారం!

ఇది ప్రస్తావించడం వెనుక ఒక అపురూపమైన అంశం దాగుంది. సూక్ష్మంగా ఆలోచిస్తే అసలు 'మెంతి' అనే తెలుగు పదమే 'బక్స్ హారన్స్ క్లోవర్' లాంటి అర్థంలోంచే ఏర్పడిందేమోననిపిస్తుంది. జర్మన్‌లకు మెంతులు ఎగుమతి అయినప్పుడు ఆ అర్థం కూడా తెలుగువారి నించి ఎగుమతి అయి వుంటుంది.

నిజానికి మేక అనేది ధ్వన్యనుకరణ పదం. 'మే' అంటుంది కాబట్టి, తెలుగువాళ్ళు మేక అన్నారు. సంస్కృతంలో 'మేషం' కన్నడంలో మేకే, తమిళంలో మేత్తి అంటారు. మేవా, మేయా, మేగె, మేకాన్ని, మేజ్, మేంజి అనేక ఇలా ద్రావిడ భాషల్లో ఇది కన్పిస్తుంది. ఇంకొంచెం లోతుగా వెడితే, ద్రవిడియన్ ఎటిమలాజికల్ డిక్షనరీ (సంఖ్య 5087 పేజీ 460) లో మేథ్ అనే ఒక ద్రావిడ పదం 'మేక' అనే అర్థంలో కన్పిస్తుంది. వాడుకలో మనం పోగొట్టుకున్న ఈ 'మేథ్' ధాతువు తెలుగు 'మెంతి', సంస్కృతం మేథీ పదాలకు మూలం కావచ్చు. మేథ్ అంటే - మెంతి, మేక కూడా!

తమిళం: మెంత్యం, మేతి, మేంటు, వెంతయం, వెంటల్, వెంతియం.

మళయాళం : వెంతయం

కన్నడం: మెంతె, మెంతేయ

తుళు : మెత్తై, మెంతి, మెంటె.

సంస్కృతం : మంథ, మేథి, మేథిక, మేథిని, మేథాని పేర్లు వున్నాయి.

ద్రావిడ భాషాపదం 'మేత్తి', లేదా 'మేథీ' అటు మేకకు ఇటు మెంతికీ సమానంగా కన్పించడం ఇక్కడ ముఖ్యవిషయం. ఈ అంశాల ఆధారంగా, మెంతి అనే తెలుగు పదం మేక (ముఖం) ఆకారంలో వుందనే అర్థంలోనే ఏర్పడిందని మనం తేలికగానే ఊహించవచ్చు.

ద్రావిడ భాషలు మాట్లాడిన ప్రజలు ముఖ్యంగా తెలుగువారు ఆనాడు మెంతులు తదితర సుగంధద్రవ్యాల వ్యాపారంలో వున్నారనడానికి గట్టి సాక్ష్యాలే చరిత్రకారుల దగ్గర వున్నాయి. మచిలీపట్నం నుంచి మలయాకు, చైనాకు, ఈజిప్టుకు అనేక ఇతర ప్రాంతాలకు సుగంధ ద్రవ్యాలు, బట్టలు ఎగుమతి అయ్యాయి. అనేక తెలుగు పేర్లు ఆయా దేశాలలో ఈనాటికీ వ్యాప్తిలో వుండటంతో జాతుల మధ్య సంబంధ బాంధవ్యాలు నడిచాయని కూడా చరిత్రకారులు అంగీకరిస్తున్నారు. 'మెంతి' పదంలోని భావార్థం ఇలా జర్మనీ తదితర దేశాలకు వ్యాపించి వుంటుందని మనం భావించవచ్చు కూడా! ఇంకొంత లోతుల్లోకి వెళితే మరికొన్ని విశేషాలు కన్పించాయి.

అరెబిక్ : 'హుల్బా (Hulba) హిల్బె(Hilbeh)
చైనీస్ : వులౌబా (WUHLOUHBA), హులూబా (HULU BA)
ప్రాచీన సింహళం : ఒయాబే (OABAIY),
హిబ్రూ : హిల్బె (HILBEH)
రష్యన్ : షంబల (Shambala)
సింగళి : ఉలూహాల్ (ULUHAAL)
టర్కి : హుల్బె (HULBE)
ఉక్రేనియన్ : హున్బాసిన్నా (HONBA SINNA)
ఉర్దూ : షంబాలిద్ (Shambalid)
వియత్నమీ : హోలోబా (HO LO BA)

ఈ పేర్లన్నింటి మధ్య ఏదో సారూప్యత మనకు కన్పిస్తుంది. వివరంగా పరిశీలిద్దాం. మేథ - అంటే బుద్ధి, మేథి అంటే మెంతులు అని రెండు ప్రయోగాలున్నట్లే పర్షియన్ భాషలో నల్క్ అంటే బుద్ధి - నిల్క్ అంటే మెంతులు.

పర్షియన్ పదం హుల్బాత్ (HULBAT - Hulba) అంటే మెంతులని అర్థం. షల్మిజ్ (SHALMIZ, SHIMLIT) హుల్య (HULYA) ఫరికా (FARIQA) అనే పేర్లు కూడా ఈ భాషలో వున్నట్లు నిఘంటువులు చెప్తున్నాయి.

'హుల్య' అంటే పర్షియాలో స్త్రీ, మెంతులు అనే రెండర్థాలూ వున్నాయి. అరెబిక్‌లో హుల్బా అంటే ఆనందం, సంతోషంతో పాటు 'మెంతులు' అని కూడా అర్థం

వుంది. సంస్కృతంలో మేథిక అంటే మెంతులు, స్త్రీ అనే అర్థాలు రెండూ వున్నాయి. ఇష్ట సఖిని మేథికా అంటారు. మేథిక అంటే భూమి కూడా!

ఋగ్వేద భాషలో మేథి అంటే, పశువుల్ని కట్టేయటానికి ఉపయోగించే గుంజ - పవిత్రమైనది - అని అర్థం. సంస్కృత మేథి, ప్రాకృత మేది ఈ అర్థంలోనే కనిపిస్తాయి. గుంజలా పాతుకుపోయిన భావాలు, ఎంతకీ మారని మొండితనాన్ని కూడా (Stupidity) మేథి పదంతో వ్యవహరించి వుండవచ్చు.

ఇంతకీ మేథీ అనే ఈ గుంజ యజ్ఞ పసువు 'మేక'ని కట్టేందుకు ఉద్దేశించినదే అయి వుండాలి. అందుకే, మేక (మేథ్)ని కట్టేసేది 'మేథీ' అనే పేరు దీనికొచ్చి వుంటుంది. 'మేథి స్తంభె యథాయుక్తాః పశవః కర్షణార్థకాః' అని దేవీభాగవతంలోనూ, "ఫులసిమేథిః ఖలేదార్, న్యస్తం యప్పశుబంధనె" అని విష్ణు పురాణంలో కూడా మేథి గురించి, మేథి స్తంభం గురించిన వివరాలు కన్పిస్తాయి. ధృవ నక్షత్రాన్ని ఆధారం చేసుకొని నక్షత్ర మండలం యావత్తూ సంచరిస్తున్న వైనాన్ని వివరించడానికి మేథిస్తంభంతో పోల్చినట్లు చెప్తారు. బుద్ధుడి పెద్దగొడుగు కర్ర, పైన గొడుగు కూడా ధృవ నక్షత్ర మండలాన్ని ఆశ్రయించు మేరు పర్వతాన్ని గుర్తుచేయడమే నంటారు. భూమి, ఆకాశం, స్వర్గం (త్రైలోక్య) మూడింటికి గల సంబంధమే మేథి అనే భావన ఇలా రూపొందిందన్న మాట!

జాతుల మధ్య సంబంధ బాంధవ్యాలరీత్యా ద్రావిడ భాషా మూలాలే మెంతుల ద్వారా రూపపరంగానూ, భావపరంగా కూడా సమకాలీన జాతులకు లేదా దేశాలకు ఎగుమతి అయ్యాయనేది స్పష్టం.

కొన్ని దేశాలలో శబ్దసాదృశ్యం కన్పిస్తే, కొన్నిదేశాలలో రూపసాదృశ్యం కన్పిస్తోంది. మొత్తం మీద అత్యంత ప్రాచీన కాలంలో తెలుగు ప్రజలతో విదేశీ సంబంధాలను ఈ మెంతులు చక్కగా నిరూపిస్తున్నాయి.

మళ్లీ మొదటికొద్దాం. ఒక జాతి నుంచి కొన్ని వస్తువులతోబాటు కొంత సంస్కృతి, కొంచెం భాష కూడా ఎగుమతి, దిగుమతులు జరుగుతాయి. అలా వచ్చి చేరిన పదాలను అరువుపదాలంటారు (Loan words) మెంతి అనే పదభావాన్ని జర్మన్లు స్వంతం చేసుకొన్నట్లు తెలుగులో చేరిన ఇంగ్లీషు అరువు పదాల్ని మనం స్వంతం చేసుకోలేకపోతున్నాం! భాషాపరమైన వివక్ష పెరగడానికి ఇది కారణం. ❄

## 10

# బుద్ధునికి పూర్వమే విదేశాలతో తెలుగువారి వ్యాపారాలు

## రోమ్‌తో పెనవేసుకొన్న సాంస్కృతిక బంధాలు

**తెలుగు** నేలమీద బౌద్ధం ఎప్పుడు ప్రవేశించిందనే విషయంపైన శ్రద్ధగా పరిశోధనలు జరిగివుంటే తెలుగువారి ప్రాచీనత గురించి చాలా విశేషాలు వెలుగులోకి వచ్చివుండేవి.

బుద్ధుడు స్వయంగా వచ్చి తెలుగునేలపైన ప్రబోధించాడని టిబెట్‌లోని కాలచక్ర బౌద్ధులు చెప్పుకొంటారు. "బుద్ధుడు ఈ నేల మీదకు వచ్చాడో లేడో తెలియదు. కానీ, మౌర్యులు కన్నా ముందే ఇక్కడ బౌద్ధం వున్నదనేది వాస్తవం (but it can not be doubted that Andhra Buddhism was pre-Asokan)" అని కె. ఆర్. సుబ్రమణియన్ అనే పరిశోధకుడు "బుద్ధిస్ట్ రిమెయిన్స్ ఇన్ ఆంధ్ర అండ్ ద హిస్టరీ ఆఫ్ ఆంధ్ర" అనే గ్రంథంలో స్పష్టంగా పేర్కొన్నాడు.

తెలుగునాట బుద్ధిజం ఎప్పుడు ప్రవేశించింది? నందులు తెలుగునేలనేలిన రాజులేనా? (మైసూరు వరకూ నందులకు సంబంధించిన కొన్ని శాసనాలు దొరికాయని (Bandanikke and Kupatur inscriptions) చరిత్రకారులు చెప్తారు.) అలాగే, నందుల తర్వాత అధికారంలోకి వచ్చిన తొలిమౌర్యుల కాలానికే తెలుగునేల మీద బౌద్ధం వున్నదా? అశోకుడు బౌద్ధాన్ని ఇక్కడకు తీసుకువచ్చాడా? లేక, బౌద్ధం విస్తృతంగా వున్న నేలమీదకే అశోకుడు వచ్చాడా? శ్రీశైలం

స్థలపురాణంలో చంద్రగుప్తుడి ప్రస్తావన చారిత్రకాంశమేనా? బుద్ధిజంతోపాటు, బ్రాహ్మణిజం, జైనిజం పోటా పోటీగా తెలుగునేల మీదకు ప్రవేశించడానికి కారణాలేమిటి? అవి ఎప్పుడు ప్రవేశించాయి?

సామాన్యప్రజల కోసం ఈ ప్రశ్నలకు సంతృప్తికరమైన సమాధానాలు చెప్పవలసిన బాధ్యత తెలుగు చారిత్రకవేత్తల మీద వుంది. 'చరిత్ర' అనేది జాతికి సంబంధించిన, సంస్కృతికి సంబంధించిన అంశం అనే సంగతిని పట్టించుకో నందువల్లనే తెలుగు ప్రజలకు తమ చరిత్ర గురించి ఏమీ తెలియకుండా పోయింది.

తెలుగునేల మీద బౌద్ధస్తూపాల నిర్మాణం క్రీ.పూ. 3వ శతాబ్ది నుంచీ క్రీ.శ 3వ శతాబ్ది వరకూ జరిగినట్లు పురావస్తు పరిశోధకుల భావన. స్తూప నిర్మాణాలకు పూర్వం కూడా బౌద్ధక్షేత్రాలు వుండివుండవచ్చు. 'బావరి' కథ ఇందుకు సాక్ష్యం. "సుత్తనిపాత" అనే బౌద్ధ గ్రంథంలో బుద్ధుడు జీవించి వున్న కాలంలోనే బౌద్ధం అస్సక దేశంలోకి ప్రవేశించినట్లు వుంది. అస్సక దేశం గోదావరి ఒడ్డున వున్న తెలంగాణ ప్రాంతం. బావరి ఈ అస్సక దేశీయుడు. బుద్ధుడితో వైశాలిలో ఈ బావరి జరిపిన సంభాషణలు సుత్తనిపాతంలో వున్నాయి. తెలంగాణ, కోస్తాఆంధ్ర తీరాలలో దేశంలో ఎక్కడా లేనన్ని బౌద్ధక్షేత్రాలు కన్పించడానికి బుద్ధుడితో తెలుగువారు నేరుగా సంబంధాలు నెలకొల్పుకోవటమే కారణం!

తెలుగునాట బయటపడిన బౌద్ధక్షేత్రాల ప్రాచీనతని అధ్యయనం చేస్తే, తెలుగు నాగరకత ప్రాచీనత (Antiquity of Andhra's Civilization) ని, దాని సంపన్నతని నిరూపించడం సాధ్యం అవుతుందని కె.ఆర్. సుబ్రమణియన్ 1928లోనే తన పరిశోధనకు నడుంబిగించాడు.

చరిత్ర పరిశోధకులలో ఎక్కువమంది బుద్ధుడు జీవించిన కాలాన్ని క్రీ.పూ. 9వ శతాబ్ది కంటె కూడా ఇంకా ముందుకు తీసుకువెడుతున్నారు. బుద్ధుడు ఎంత ప్రాచీనుడైతే, తెలుగు నేలమీద తెలుగువారు అంత ప్రాచీనులు అవుతారు.

ఈ దృష్టి కోణంలోంచే సుబ్రమణియన్ గారి "బుద్ధిస్ట్ రిమెయిన్స్ ఇన్ ఆంధ్ర అండ్ ది హిస్టరీ ఆఫ్ఆంధ్ర" గ్రంథాన్ని అధ్యయనం చేయవలసి వుంది. ఈ గ్రంథానికి డా॥ జావ్ దుబ్రేల్ (Dr. G. Jouveau - Dubreuil) అనే ఫ్రెంచి పరిశోధకుడు రాసిన ముందుమాటలు చాలా చారిత్రక అంశాల్ని ప్రోదిచేస్తున్నాయి. వాటి సారాంశాన్ని ఇక్కడ అందిస్తున్నాను.

1. క్రీస్తు పూర్వం నాటి చారిత్రక యుగంలో పశ్చిమ దేశాల నుంచి ఇండియా, బర్మా, చైనా తదితర తూర్పు తీరదేశాలకు జరిగిన వర్తక వాణిజ్యాలకు కృష్ణానది ముఖద్వారం, ముఖ్యకూడలి.

2. భారతదేశం నుంచి తూర్పు తీరదేశాలకు (Far East) వర్తకవాణిజ్యం తామ్రలిప్తి నుంచి గానీ, కలకత్తా, కళింగ ఓడరేవుల నుంచి గానీ జరగలేదని డా॥ జావ్ దుబ్రేల్ గారు స్పష్టీకరించారు.

3. బర్మాలో పెగూ తూర్పుకోస్తా తీరానికి కళింగ అనే పేరుండేది. కళింగ, తెలింగ తెలుగునేలకు సంబంధించిన పేర్లే! ఉత్కళ అంటే ఒరిస్సా. బర్మాలో తైలాంగులు తెలుగువారేనని చరిత్రకారుల నమ్మకం. క్రీ.శ. 4వ శతాబ్దినాటి 'వేంగి' లిపి, ఈ తైలాంగుల లిపి (తెలుగు కన్నడ లిపి) ఒకటిగానే వుందని దుబ్రేల్ గారితోపాటు ఇంకా చాలామంది చరిత్రకారులు పేర్కొన్నారు.

శాసనాలంకార అనే బౌద్ధమత గ్రంథం బర్మాలో పాగాన్ ప్రాంతాన్ని ఏలిన తెలాంగ్ రాజు శాన్‌లాన్ క్రోమ్ గురించి ప్రస్తావించింది. ఈ పేరు శాలంకాయన శబ్దానికి పాలీరూపం కావచ్చు. ఈ శాలంకాయన రాజు బుద్ధదత్త, బుద్ధఘోషులకు సమకాలికుడట. ఇతను వేంగిని రాజధానిగా పాలించిన 1వ నందివర్మ కావచ్చునని అంటారు.

మలయా, ఇండో చైనాలలో తెలుగువారి ఉనికి ఎక్కువ కన్పిస్తుంది. చంద్రవర్మ, జయవర్మ, దేవవర్మ పేర్లున్న శాలంకాయన రాజుల శాసనాలు అక్కడ దొరికాయి. జావాను 'కలింగం' అనికూడా పిలిచేవారట. .జావా, బోర్నియోలలో దొరికిన శాసనాలు వేంగి లిపిలోను, పల్లవ లిపిలోను ఉన్నాయనీ, జావా శాసనంలో పూర్ణవర్మ, బోర్నియో శాసనంలో మల్లవర్మ మూలవర్మ తొలి పల్లవులైన తెలుగువారేననీ చరిత్రకారులు భావిస్తున్నారు.

క్రీ.శ. 5వ శతాబ్ది వరకూ తెలుగువారి విదేశీ వ్యాపారాలు అప్రతిహతంగానే సాగాయనడానికి ఇది ప్రబలమైన సాక్ష్యం. కృష్ణాతీర వాసులు తెలంగాణ ప్రజలు కూడా సమాన ప్రాచీనులుగానే కన్పిస్తున్నారు. ఈ ప్రధాన రహదారుల్ని మరింత పరిశీలిస్తే, వేదయుగంలో కృష్ణాగోదావరుల మధ్య నివసించిన తెలుగు ప్రజలు కాలక్రమంలో అటు కలింగకూ ఇటు దక్షిణాదికీ, పశ్చిమాన మహారాష్ట్ర కర్నాటకలకూ వ్యాపించి తమ నివాసాలను విస్తరించుకున్నట్లు అర్థమవుతుంది.

'బొమ్మదేవర' అయిన బ్రహ్మదేవుడి పేరుని ఆంధ్రులే బర్మాకు సూచించి వుంటారని మన పూర్వీకుల నమ్మకం. ప్రథమ రంగూను ఆంధ్ర మహాసభ 1929లో అధ్యక్షోపన్యాసం ఇస్తూ, కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారు ఈమాటనే అన్నారు.

## ప్రధాన రహదారుల్లోనే బౌద్ధక్షేత్రాలు

డా॥ జావ్ దుబ్రేల్ గారు వేంగి రాజ్యాన్ని ఒక కూడలిగా తీసుకుని ఆంధ్ర ప్రాంతంలో వున్న బౌద్ధ క్షేత్రాలన్నింటినీ కలుపుతూ ఒక మ్యాప్ గీశారు. 5 ప్రధాన రహదారుల పైన ఈ బౌద్ధకేంద్రాలు వెలిసినట్లు ఆయన ఊహించారు.

ఇది 1932లో దుబ్రేల్ గారి ఊహ. అప్పటికి ఆంధ్రప్రాంతంలోని 24 బౌద్ధ కేంద్రాలను మాత్రమే ఆ మ్యాప్‌లో ఆయన గుర్తించారు. ఆర్కియోలాజికల్ సర్వే ఆఫ్ ఇండియా హైదరాబాద్ సర్కిల్‌వారు ఆంధ్రప్రదేశ్‌లో 55 ప్రముఖ బౌద్ధ క్షేత్రాలను గుర్తిస్తూ ఒక మ్యాప్‌ను ప్రకటించారు. విజయవాడ కూడలిగా దుబ్రేల్ గారు సూచించిన 5 ప్రధాన రహదారుల్నీ మళ్ళీ ఆ మ్యాప్‌పైన గీసి చూశాను. అత్యంత ఆశ్చర్యంగా కొత్తగా వెలుగులోకి వచ్చిన బౌద్ధక్షేత్రాలతో సహా అన్నీ ఆ రహదారుల్లోనే నెలకొని వున్నాయి. దీన్నిబట్టి కొన్ని విషయాలు స్పష్టం అయ్యాయి.

- తెలుగు నేలమీద విలసిల్లిన నాగరకతకు దేశం లోపల సింధు నాగరికతతోనూ, దేశానికి బైట సుమేరియన్ ఈజిప్షియన్ నాగరకతలతోనూ సంబంధ బాంధవ్యాలు నడిచేవి కాబట్టే దక్షిణ భారతదేశంలో మొదటి అభివృద్ధి ఇక్కడ కన్పిస్తుంది.
- తెలుగువారికి జీవనదులతో పాటు సుదీర్ఘమైన సముద్ర తీరం వుంది. ఇక్కడే నాగరకత వ్యాప్తి చెందడానికి ఇది ముఖ్యకారణం.
- సుసంపన్నమైన, సువిశాలమైన, సుభిక్షమైన ఈ నేలమీద వర్తక వాణిజ్యాలు జరగలేదంటేనే ఆశ్చర్యపడాలి.
- ఇక్కడి సంపన్నత కోసమే ఉత్తరాది నుంచి అనేక రాజవంశీకులు వారితో సమానంగా పశ్చిమదేశాల నుంచి అనేక జాతులవారు తెలుగు నేలమీదకు ప్రవేశించి ఇక్కడి ప్రజలతో మమేకం అయ్యారు. తెలుగుభాషలో ప్రత్యేకంగా అనేక ప్రోటో సుమేరియన్ పదాలు, ప్రోటో ఆఫ్రో ఏసియాటిక్ పదాలూ కన్పించడానికి ఈ విదేశీ సంబంధాలు ముఖ్యకారణం కావచ్చు.




1. కళింగపట్నం
2. శాలిహుండం
3. దంతపురం
4. పారిపల్లి
5. రామతీర్థం
6. మంగనూరిపేట
7. పావురాళ్లకొండు
8. బావికొండ
9. దొరపాలెం
10. శంకరం
11. అమలాపురం
12. గోపాలపట్నం
13. కొత్తూరు
14. ఎర్రవరం
15. లింగరాజుపాలెం
16. పిఠాపురం
17. కొడవలి
18. పాండవులగుట్ట
19. కాపవరం
20. ఆదుర్రు
21. ఆరుగొలను

22. గుంటుపల్లి
23. అశ్వరావుపేట
24. నేలకొండపల్లి
25. కోటలింగాల
26. పాశిగాం
27. ధూలికట్ట
28. కొండాపూర్
29. తిరుమలగిరి
30. రాజులబండ
31. ఫణిగిరి
32. వర్ధమానకోట
33. ఏలేశ్వరం
34. జగ్గయ్యపేట
35. గుమ్మడిదుర్రు
36. అల్లూరు
37. గుడివాడ
38. ఘంటసాల
39. భట్టిప్రోలు
40. వడ్డమాను
41. అమరావతి
42. గ్రంథసిరి
43. గోలి
44. మంచికల్లు
45. నాగార్జునకొండ
46. రెంటాల
47. బుద్ధాం
48. చినగంజాం
49. పెద్దగంజాం
50. కనుపర్తి
51. ఉప్పుగుండూరు
52. చందవరం
53. దూపాడు
54. రామతీర్థం
55. నందలూరు

- బౌద్ధయుగంలో తెలుగువారే స్వయంగా అందరికన్నా ముందు విదేశీ వర్తక వాణిజ్యాలలోకి రావడానికి మరో కారణం వుంది. రాతియుగంలో ఇనుము వాడకాన్ని విశేషంగా వినియోగంలోకి తెచ్చిన అనుభవం తెలుగువారికుంది. విదేశీయులతో ఏనాడో సంబంధాలు ఏర్పడటానికి ఇదికూడా ఒక కారణం. బౌద్ధయుగానికి వచ్చేసరికి సదుపాయాలు మరింత పెరగడంతో అనుభవం పండిన తెలుగువారు తక్కిన జాతులకన్నా చొరవగా వాటిని అందిపుచ్చుకొని అభివృద్ధి చేయగలిగారు. తమిళ, కన్నడ, మళయాళ, మహారాష్ట్ర ప్రాంతాలతో పోల్చినప్పుడు, అత్యంత ప్రాచీన బౌద్ధక్షేత్రాలు, అత్యధిక సంఖ్యలో ఇక్కడ నెలకొని వుండటానికి ఇవన్నీ కలిసొచ్చిన కారణాలే.
- బుద్ధిజం, బ్రాహ్మణిజం, జైనిజం పోటీపడి తెలుగునేల మీదకు చేరడానికి ఇక్కడి ఈ సంపన్నతే ముఖ్య కారణం.

## తెలుగునాట ప్రాచీన రహదారుల ఊహా చిత్రం

ఇంక అసలు విషయంలోకి వద్దాం. వర్తక వాణిజ్యాలు నడిచే ప్రధాన రహదారులకు దగ్గరగా నీటివసతి, ప్రశాంత వాతావరణం వున్న చోట బౌద్ధక్షేత్రాలు

వెలిశాయి. ప్రతి బౌద్ధక్షేత్రానికి సమీపంలో జనసమ్మర్దత వున్న వాణిజ్యకూడలి గాని, ప్రధాన నగరంకానీ వుండే అవకాశాలు లేకపోలేదు కూడా! బౌద్ధస్థావరాలను బట్టి ఆనాటి ప్రధాన రహదారులను ఈ విధంగా ఊహించడం జరిగింది.

**1. కళింగకు రహదారి** : విజయవాడ, గుంటుపల్లి, ఆరుగొలను, ఆదుర్రు, కాపవరం, పాండవులగుట్ట, కొడవలి, పిఠాపురం, లింగరాజుపాలెం, ఎర్రవరం, కొత్తూరు, గోపాలపట్నం, అమలాపురం, శంకరం, దొరపాలెం, బావికొండ, పావురాళ్లకొండ, మంగనూరిపేట, రామతీర్థం, పారిపల్లి, దంతపురం, శాలిహుండం, కళింగపట్నం మీదుగా కళింగకు రహదారి.

**2. కోసలకు రహదారి** : విజయవాడ నుంచి అల్లూరు, అశ్వారావుపేట మీదుగా గోదావరి దాటి ఛత్తీస్‌ఘర్‌లోని కోసలకు రహదారి.

**3. మహారాష్ట్రకు మొదటి రహదారి** : విజయవాడ మీదుగా గుమ్మడిదుర్రు, జగ్గయ్యపేట, ఫణిగిరి, తిరుమలగిరి, ధూలికట్ట, కోటలింగాల, పాశిగాం మీదుగా మహారాష్ట్రకు మొదటి రహదారి.

**3ఎ. మహారాష్ట్రకు రెండవ రహదారి** : విజయవాడ మీదుగా గుమ్మడిదుర్రు, జగ్గయ్యపేట, ఫణిగిరి, వర్ధమానకోట, గాజులబండ, కొండాపూర్‌ల మీదుగా మహారాష్ట్రకు రెండవ రహదారి.

**4. కర్నాటకకు రహదారి** : విజయవాడ నుంచి అమరావతి, గ్రంథసిరి, గోలి, రెంటాల, మంచికల్లు, నాగార్జునకొండ మీదుగా కృష్ణానది వెంట కర్ణాటకకు రహదారి.

**5. దక్షిణానికి మొదటి రహదారి** : విజయవాడ, అమరావతి, వడ్డమాను, బుద్ధాం, చినగంజాం, పెదగంజాం, కనుపర్తి, ఉప్పుగుండూరుల మీదుగా నేటి తమిళనాడుకు రహదారి.

**5ఎ. దక్షిణానికి రెండవ రహదారి** : అమరావతి, గ్రంథసిరి, గోలి, రెంటాల, మంచికల్లు, చందవరం, దూపాడు, రామతీర్థం, పెన్నా నది మీదుగా నేటి తమిళనాడుకు రహదారి.

ఈ మార్గాలను మరింత లోతుగా పరిశీలిస్తే మనకు చాలా విషయాలు అవగాహనకు వస్తాయి.

1. గోదావరి, కృష్ణ, పెన్న, గుండ్లకమ్మ, కడం, మంజీరా, మూసీ, నాగావళి, వంశధార, తుంగభద్ర ఇలాంటి అనేక నదీతీరాలకు వాణిజ్య రహదారుల కూడళ్ళకూ దగ్గరగా బౌద్ధక్షేత్రాలు వెలిశాయి.

2. సునామీ లాంటి ఏదో విపత్తు కారణంగా ఘంటసాల దగ్గర సముద్రం తనను తాను ఉపసంహరించుకొన్నట్లు వెనక్కి వెళ్ళిపోయింది. అలాగే నదీ ప్రవాహాలు కూడా తమ గమ్యాన్ని, గమనాన్నీ మార్చుకున్నాయి. ఈ కారణంగా కొన్ని బౌద్ధక్షేత్రాలు నీటివనరులకు దూరంగా వుండటాన్ని కూడా మనం గమనించవచ్చు.

3. కళింగకు వెళ్ళే మార్గంలో కొల్లేరు దాటి గోదావరి మీదుగా బొబ్బర్లంక వగైరా లంకలు దాటి ధవళేశ్వరం వద్ద గోదావరి అనేక పాయలుగా చీలుతున్నచోట 'గౌతమి' బౌద్ధులకు పవిత్ర క్షేత్రంగా వెలిసిందని -డా॥ దుబ్రేల్ గారు భావించారు. గౌతమ బుద్ధుడే గోదావరిని గౌతమిని చేశాడేమో పరిశీలించాలి.

4. ఘంటసాలకు సమీపంలో శ్రీకాకుళ క్షేత్రం వుంది. ఆంధ్రుల తొలి రాజధాని నగరంగా దీని ప్రశస్తి. ఆంధ్ర జాతికి ఒక దేవుడున్నాడు. ఆయనే ఆంధ్ర విష్ణువు. శ్రీకాకుళంలో ఆంధ్ర విష్ణువు దేవాలయం వుంది. నిజానికి ఇది కృష్ణ మధ్యన వున్న ఒక పెద్దలంక. దీన్ని పోతర్లంక అని కూడా అనేవారు. రోమన్లతో వ్యాపారం జరిగిన క్రీస్తుపూర్వ యుగాలలో 'మాలంక' (మహాలంక) ప్రస్తావన కన్పిస్తుందట. అది ఇదేననీ, సిముఖ శాతవాహనుడి మంత్రి అనంతపాలుడు ఈ పోతర్లంక అనే శ్రీకాకుళానికి చెందినవాడనీ డా॥ దుబ్రేల్ గారు పేర్కొన్నారు.

5. పశ్చిమ దేశాలతో వాణిజ్యపరమైన రవాణా, రాకపోకలు సాగేందుకు అనువైన ప్రధాన రహదారులు ఏర్పడి, అటు ఉత్తరానికీ, ఇటు దక్షిణానికీ, తూర్పు పడమరలకు కూడా ఈ మార్గాలు విస్తరించి మొత్తం దేశానికి సరుకుల్ని అందించగలిగాయి. అందుకు తెలుగు నేల ప్రముఖ కూడలిగా వుందనేది ఇక్కడి వాస్తవం.

6. చైనావారి పట్టుబట్టలు, తెలుగువారి నూలు బట్టలు ఆరోజుల్లో రోమన్ల మార్కెట్‌ని చెరొక పావువంతూ ఆక్రమించాయని పాశ్చాత్య చరిత్రకారులు రాశారు. రోమ్‌లో హెలెనిస్టిక్ యుగం నడుస్తుంటే, చైనాలో 'హాన్' రాజవంశం అధికారంలో వుంది. 'Wu-Ti' అనే చైనారాజు ఈజిప్ట్, ఇండియాలతో మంచి వాణిజ్య సంబంధాలు నడిపించాడట.

7. తెలుగువారి రామచిలుకలంటే ఈజిప్ట్ రాజులకు గొప్ప ప్రీతి వుండేదిట. ఒక మానవ బానిస కన్నా రామచిలుకని ఎక్కువ ఖరీదుకు అమ్మేవారట. కాకిని తీసుకువెళ్లి బాబిలోనియాలో నెమలి అని చెప్పి దబాయించి అమ్మిన కథ బావేరు జాతక కథలో కన్పిస్తుంది. బావేరు అనేది బాబిలోనియాకు పాలీ రూపం అంటారు. అలాగే, సుప్పరక జాతక కథలో ఖరమల, అణిమల, దధిమల, కొసమల, నలమల, వలభముఖ... అనే నావికుల పేర్లు కన్పిస్తాయి. భయంకరమైన తుఫాన్‌లో ఓడ చిక్కు కున్నప్పుడు అంధుడైన సుప్పరకుడు తన చాకచక్యంతో ఓడని సురక్షితంగా ఒడ్డుకు చేరుస్తాడు. ఇలాంటి కథలు ఆనాటి విదేశీ వాణిజ్యాలకు సాక్ష్యాలు. వీటిలో తెలుగువారి పాత్ర ఎంతవుందో తేల్చే ప్రయత్నాలు జరగాలి. 'సుప్పరక' పేరు 'శూర్పణఖ'కు పాలీ రూపంగా కన్పిస్తోంది. అదే నిజమైతే, సుప్పరక జాతక కథ తెలుగువారి కథేనని మనం గట్టిగా నమ్మవచ్చు. నలమల, కూసమల అనే పేర్లు కూడా తెలుగుదనాన్నే సూచిస్తున్నాయి.

8. తెలుగువారు నేసిన అతి పలుచని నూలు బట్టల్ని ఇష్టంగా కట్టుకొని ఈజిప్ట్‌లోని యువతులు సిగ్గులేకుండా ఒళ్ళు కన్పించేలా తిరుగుతున్నారని, ఈ తూర్పు దేశాలవలన తమ రోమన్ సంస్కృతి కలుషితమై పోతోందనీ రోము పార్లమెంటులో గగ్గోలు పెట్టిన కథని చరిత్రకారులు ప్రముఖంగా చెప్తారు.

9. ఏడెన్ నుంచి నేరుగా 120 ఓడలు భారతదేశానికి వచ్చేవని చెప్తారు. మే నెల నుంచి అక్టోబర్ వరకూ నైరుతి ఋతుపవనాల కాలంలో ఓడలు ఇక్కడకు వచ్చి, నవంబర్ నుంచి మార్చి వరకూ ఈశాన్య ఋతుపవనాల కాలంలో వెనక్కి వెళ్ళేవిట.

10. పశ్చిమదేశాల నుంచి వచ్చిన ఓడలు భారత దేశానికి పశ్చిమ తీరాన ఎక్కువగా ఆగవలసి వుండగా, తూర్పున బంగాళాఖాతం తీరాన తెలుగునేలనే వాళ్లు ఎంచుకోవడానికి బర్మా, చైనా తదితర తూర్పు తీర దేశాలతో వున్న వాణిజ్య సంబంధాలు కూడా చెప్పుకోదగిన కారణం కావచ్చు. అది తెలుగువారికి అదనంగా కలిసివచ్చిన అంశమే!

## ఆనాటి బ్యాంకింగ్ వ్యవస్థ

బౌద్ధయుగంలో వాణిజ్యపరమైన గిల్డ్‌లు చాలా బలంగా వుండేవి. వీటిని శ్రేణులు అని పిలిచేవారు. వీటి అధిపతిని 'శ్రేష్ఠి' అన్నారు. ధర్మణిక శ్రేణి, కారాకార శ్రేణి, తెసకార శ్రేణి... ఇలా ఏ వ్యాపారానికి ఆశ్రేణి వుండేది.

ఈ శ్రేణుల ప్రధాన కార్యాలయాన్ని నిగమసభ అన్నారు (సెంట్రల్ ఆఫీస్). దేశవ్యాప్తంగా వర్తక వాణిజ్యాలన్నింటినీ ఈ నిగమ సభలే తమ అదుపులో నడుపుతుండేవి.

వీటి పనితీరు బ్యాంకింగ్ తరహాలో వుండేది. నెలవారీ వడ్డీ వసూలు చేసేవారు. ఒక శ్రేణిలో "పావొనదుకు మాసం" వడ్డీకి కొంతసొమ్ము అప్పుతెచ్చి, ఇంకొక శ్రేణిలో "పావో మాసం" వడ్డీకి పెట్టుబడి పెట్టిన వైనాలు కూడా వున్నాయి. ఒక బ్యాంకులో తక్కువ వడ్డీకి అప్పుతెచ్చి ఇంకొక బ్యాంక్‌లో ఎక్కువ వడ్డీకి డిపాజిట్ చేయడం లాంటిది ఇది!

ఉశ్వదాత అనే వ్యాపారి రెండువేల కార్షాపణల్ని ఒక చేనేత శ్రేణిలో 'ప్రతిక శాతం' వడ్డీకి (12%), ఇంకో చేనేత శ్రేణిలో వెయ్యి కార్షాపణల్ని ముప్పతిక శాతం (9%) వడ్డీకి పెట్టుబడి పెట్టాడట. బౌద్ధ సాహిత్యాలలో ఇలాంటి కథలు ఆనాటి వాణిజ్యం తీరుతెన్నుల్ని చెప్పేవి అనేకం వున్నాయి.

డిపాజిట్లు తీసుకోవడం, అప్పులివ్వడం, వ్యాపారపరమైన లావాదేవీలు నిర్వర్తించడం, వివాదాలు పరిష్కరించడం, ఉత్పత్తిని పెంపొందించేందుకు తోడ్పడడం లాంటి విధుల్ని ఈ శ్రేణులు నిర్వహించేవి. ఇది తెలుగు నేలమీదే కాదు, దేశం అంతా అమలులోవున్న ఆనాటి బ్యాంకింగ్ వ్యవస్థ. శాతవాహనుల తదనంతరం కూడా ఈ వ్యవస్థ కొంతకాలం కొనసాగింది.

## సింహళంతో తెలుగువారికి సంబంధాలు

తమిళులు శ్రీలంకని ఆక్రమించడానికన్నా వెయ్యేళ్ళముందే, క్రీ.పూ. 500 నాటికే సింహళంతో తెలుగువారికి వాణిజ్య సంబంధాలతో పాటు సాంస్కృతిక సంబంధాలు కూడా నడిచాయని "ఇండియా ఇన్ సిలనీస్ హిస్టరీ, సొసైటీ అండ్ కల్చర్'' గ్రంథంలో ఎం.డి. రాఘవన్ పేర్కొన్నారు. సింహళంలో మొదటి బౌద్ధస్థూపం, బుద్ధవిగ్రహాలు కృష్ణాతీరం నుంచే సింహళానికి చేరాయని ఆయన సవివరంగా నిరూపించారు. సింహళంలో బౌద్ధ ఫలకాలమీద చిత్రించిన స్త్రీలు అమరావతి స్థూపం మీది స్త్రీలను పోలి వున్నారేగాని, అజంతా ఎల్లోరాలలో చిత్రాలలోని స్త్రీల మాదిరిగా లేరని శిల్పకళ ఆధారంగా బెంజిమిన్ రోలండ్ చేసిన నిరూపణలు ఇక్కడ గమనార్హం. అమరావతి స్తూపం మీది స్త్రీలు సన్నగా, నాజూకుగా, తీగలా చలాకీగా కనపడతారనీ, ఆజానుబాహులనీ, అప్సరసలు అంటే వీరేనన్నట్లుంటారనీ ఆయన వ్యాఖ్యానించాడు.

మహాదేవుడు అనే బౌద్ధబిక్షువు పల్లవబొగ్గం (పల్నాడు)నుంచి చేనేత, కమ్మరం, వడ్రంగం పనివారిని, శిల్పకారుల్ని, నిర్మాణ పనివారినీ సింహళం తీసుకువెళ్ళినట్లు 'మహావంశ' గ్రంథంలో వుంది. ఇవన్నీ 2,500 ఏళ్లనాటి తెలుగువారి ప్రగతికి నిలువెత్తు సాక్ష్యాలు.

తెలుగువారి చరిత్రని ఎక్కువమంది తమిళ చరిత్రకారులు తొక్కిపెట్టేందుకే ప్రయత్నించినా, ఎల్.ఎ. కృష్ణయ్యర్, ఎం.డి. రాఘవన్ లాంటి ప్రముఖులు తెలుగువారి ప్రాచీనతా సంపన్నత గురించి చాలా విశేషాలు వెలుగులోకి తెచ్చారు. వాటిలో ఎం.డి. రాఘవన్ ఓ ఊహాత్మకమైనదిగా ఉటంకించిన అంశం ఒకటి వుంది.

కృష్ణాతీరాన్ని మైసోలాస్, మైసోలియా పేర్లతో పిలిచేవారు. ఈ శబ్దాలు వాటికి దగ్గరగా ధ్వనించే ఒక పదానికి గ్రీకు భ్రష్టరూపాలు అయివుండవచ్చు. ఆ పదం ఏదో ఊహించే ప్రయత్నం జరిగినట్లు కన్పించదు. ఎం.డి. రాఘవన్ తానుచూసిన ఒక నోట్స్‌లో 'మహాసాలిపట్నం' ప్రస్తావన వుందనీ, సింహళానికి చేరిన తెలుగువారిలో చేనేత పనివారు తాము మహాసాలిపట్నం నుంచి వచ్చినట్లు, తాము సాలిగోత్రీకులైన సాలంకాయన బ్రాహ్మణులమని అందులో చెప్పుకున్నట్లు

పేర్కొన్నారు. మహాసాలిపట్నానికి గ్రీకు భ్రష్టరూపం మైసోలియా కావచ్చు. అది ఈనాటి మచిలీపట్నం పేరుకి పూర్వరూపం కావచ్చుకూడా!

'సాలి' పదంతో వ్యవహరించబడిన పద్మసాలీలు, కమసాలీలు (కంసాలీలు) తెలుగు నాగరకతకు మూలపురుషులు. ఒకరు బట్టను నేసి ఎగుమతిచేశారు. ఇంకొకరు ఇనుమును కరిగించి నాగరకతను నేర్పారు.

**చివరగా ఒక మాట :**

బౌద్ధ సాహిత్యాన్ని, జైన సాహిత్యాన్ని ప్రత్యేకంగా అధ్యయనం చేస్తే క్రీ.పూ. 1,000 నుంచి క్రీ.శ. 5వ శతాబ్ది వరకూ తెలుగు నేల కేంద్రంగా సాగిన సాంస్కృతిక, చారిత్రక పరిణామాలు ఎన్నో వెలుగుచూస్తాయి. తెలుగుభాష మూలాలు కూడా వాటిలో దొరుకుతాయి. టిబెట్‌లో దొరికే బౌద్ధ గ్రంథాలలో తెలుగు నాగరకతా విశేషాలు ఎన్నో వున్నాయని పరిశోధకులు చెప్తున్నారు. వాటిని వెలికితీసి ప్రజాపరం చెయ్యాలి.

1. తెలుగు ప్రజలకు తమ సంస్కృతి ఔన్నత్యానికి సంబంధించిన సాక్ష్యాలు అందించాలి.

2. తెలుగు ప్రజలకు తమ నాగరకత వైశిష్ట్యాన్ని చాటిచెప్పే చారిత్రక అంశాలను విశ్లేషించి అందించాలి.

3. తెలుగు ప్రజలకు తమ భాష మూలాలని వెదికి దాని ప్రాచీనతని నిరూపించే భాషా చారిత్రక విశేషాలను విశదీకరించి అందించాలి. అప్పుడుగాని, జాతి ప్రజలలో జాత్యభిమానం, భాషాభిమానం పెల్లుబికిరావు.

ఈ బాధ్యత పరిశోధకులందరిపైనా వుంది. 

## 11

# 'ఇండో-యూరోపియన్' భాషల్లో వందలాది తెలుగుపదాలు

## తెలుగుజాతి ప్రాచీనతను నిరూపించే సాక్ష్యాలు

**తెలుగువారి** మూలాలను వెలికి తీయాలనే పరిశోధనలు కొమర్రాజు లక్ష్మణరావుగారి పూనికతోనే మొదలయినాయి. 1910లో విజ్ఞాన చంద్రికా ప్రచురణల ద్వారా, చిలుకూరి వీరభద్రరావు గారితో రాయించిన "ఆంధ్రుల చరిత్రము" ప్రధమభాగం (పూర్వయుగం)లో తెలుగు ప్రజలు అత్యంత ప్రాచీనులైన జాతి అని, విశ్వమంతా విస్తరించినవారనీ నిరూపించేందుకు సాహసోపేతమైన ప్రయత్నం జరిగింది -

తర్వాతి కాలంలో ఇదే విషయమై విశేష పరిశోధనలు కొనసాగాయి. 1933లో చిల్లరిగె శ్రీనివాసరావుగారు "ఆంధ్రదేశపు చరిత్ర" గ్రంథాన్ని ఆంధ్ర సరస్వతీ గ్రంథమాల 20వ ప్రచురణగా వెలువరించారు. ఈ గ్రంథానికి తేకుమళ్ల రాజగోపాలరావుగారు రాసిన 108 పేజీల పీఠిక అద్భుతమైన సమాచారాన్ని అందిస్తుంది. "తెలుంగులు భరత వర్షములో ప్రవేశించుటను గూర్చిన పరిశోధనా ఫలితమగు పీఠిక" గా దీన్ని పేర్కొన్నారు.

ఈ 108 పేజీల పీఠికలో తేకుమళ్ల రాజగోపాలరావు గారు చెప్పిన ముఖ్య విశేషాలు ఇవి :

1. ప్రాచీనకాలంలో వివిధజాతులు ఆసియాఖండంలోంచే ఐరోపాలోకి ప్రవేశించారు.

2. ఆసియాలో ఏభాగం నుంచి? బైబిల్ ఆధారంగా కాస్పియన్ సముద్రం ప్రాంతంలోని ఆసియాభూమి అని తెలుస్తోంది.

3. మరికొంతమంది జాతి, మత, భాషాపరమైన అంశాల ఆధారంగా "మధ్య ఆసియా" నుంచి వెళ్లివుండవచ్చని అంటారు.

4. రాజగోపాలరావు గారు నమ్మిన సిద్ధాంతం ఇది: " నా మతమున మన తెలుగు జాతుల ఆదిమ భూమి మధ్య ఆసియా అనియే!"

5. ఆసియా నుంచి నేటికి 10వేల ఏళ్లకుముందు కొందరు ప్రజలు పశ్చిమానికీ, మరికొందరు దక్షిణానికీ వలస వచ్చారు.

6. పశ్చిమానికి వలసవెళ్లిన వాళ్లు "ట్యూటన్స్" అయ్యారు. ఇంగ్లీషు, ఐస్‌లాండిక్, ఉలందా, డేనిష్, స్కాండినేవియన్, జర్మన్, ప్రాచీన భాషలైన ఆంగ్లో శాక్సన్, గోథిక్ మొదలైన భాషలన్నీ ఇందులోంచే ఏర్పడ్డాయి. అంటే, ఈ భాషల పితామహులు 10వేల ఏళ్లకు ముందు ఒకరిమాట ఒకరికి అర్థమయ్యే స్థితిలో వుండివుంటారు.

7. దక్షిణానికి వలసవచ్చిన వారిలో తెలుగు ప్రజలున్నారు. అందుకని, తెలుగుపదాలు పైన పేర్కొన్న యూరోపియన్ భాషలన్నింటిలోనూ అంతో ఇంతో కన్పిస్తాయి.

స్కాట్ దొర లాంటి కొందరు చరిత్ర పరిశోధకుల పరిశోధనల ఆధారంగా 1933లో తేకుమళ్ళ రాజగోపాలరావుగారు చెప్పిన విశేషాలివి. ఇందుకు తార్కాణంగా ఇంగ్లీష్, ఆంగ్లోశాక్సన్, డేనిష్, జర్మన్ తదితర భాషల్లో ఇంకా సజీవంగా వున్న దాదాపు 104 తెలుగు పదాలను ఆయన ఎత్తిచూపించారు మచ్చుకి ఒక ఉదాహరణ:

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| పడు | ఇం: | fall | డేనిష్ : faldi | | | |
| మేత | ఇం: | meat | ఆం.శా: meta | | గో: | mets |
| తిరుగు | ఇం: | Turn | Torlnare, | | జె: | Torlnos |
| వ్రాత | ఇం: | write | ఆం.శా: writan | | | |
| వేగు (వేయించడం) | ఇం: | Bake | ఆం.శా: Becan | | | |
| పీలు (పీలిక) | ఇం: | peel | పాత ఫ్రెంచి: peiler<br>లాటిన్: pellir | | | |
| విల్లి, వల్లి, పల్లి | ఇం: | villa,village | | | | |
| పాలిపోవు | ఇం: | pale | డేనిష్ : pal | | | |

| | | |
|---|---|---|
| వెల/విలువ | ఇం: value | ఫ్రెంచి : value లాటిన్:valere |

ఈ పరిశోధనాంశాల స్ఫూర్తితో ఇండోయూరోపియన్ పదాల పూర్వరూపాలను తెలియజేసే డిక్షనరీని ఆన్‌లైన్‌లో నేను సంప్రదించాను. Sergei Nikolayer రూపొందించిన డేటాబేసిస్ ఇది. సంస్కృతంలో కన్పించే తెలుగు పదాలను వదిలేయగా, సంస్కృతంలోకి వెళ్లకుండా ఇతర ఇండోయూరోపియన్ భాషల్లో కన్పించే తెలుగుపదాలు అనేకం ఇందులో నాకు దొరికాయి.

శబ్దసాదృశ్యం ఆధారంగా పూర్వపు తెలుగువారితో (Proto Telugu people) పూర్వపు యూరోపియన్ జాతుల వారికి గల సంబంధాలను ఊహించే ప్రయత్నాన్ని ఆనాడే స్కాట్‌లాంటి అనేకమంది పాశ్చాత్య పండితులు చేశారు.

| | | |
|---|---|---|
| చమురు | గోథిక్:smair (గ్రీకు) | |
| పొడి | ఇం: powder | |
| ప్రక్క(లు) | ఇం:break | ఆం.శా: brekon |
| | | డేనిష్ : brockke |
| పడక | ఇం: bed | గోథిక్: badi |
| | | స్వీడిష్ : badd |
| గుఱక | ఇం: Growl, roar | |
| పాటు | ఇం: plight | |
| మిక్కు, మిక్కిలి | ఇం: Much | ఆం.శా: mycel |
| చిక్కని | ఇం: thick | ఆం.శా: thricce |
| వెనుక | ఇం: Hind | ఆం.శా: hind |
| ఈ, ఈదరి | ఇం: hither | ఆం.శా: hider |

ఇలా రాజగోపాలరావుగారు దర్శించిన అనేక శబ్ద సాదృశ్యాల్ని పరిశీలించిన తర్వాత రెండు ముఖ్య విషయాలు మనసులోకి వస్తాయి.

1. ఇండో యూరోపియన్ భాషాకుటుంబానికి చెందిన సంస్కృత భాషతో నిమిత్తంలేకుండా, అనేక యూరోపియన్ భాషల్లోకి తెలుగు పదాలు చేరిపోయాయి.

లేదా, అనేకం యూరోపియన్ పదాలు తెలుగులోకి చేరాయి.

2. ఇలాచేరడానికి కారణమైన "సమీప వర్తిత్వం" - తెలుగువారితో కలిసి జీవించిన సంఘటన చరిత్రలో వెదికితే దొరకవచ్చు. అలావెదకవలసిన అవసరాన్ని ఈ శబ్దసాదృశ్యాలు గుర్తుచేస్తున్నాయి.

## "అంథ" అంటే గ్రీకు భాషలో మనిషి:

ఇక్కడొక ముఖ్య విషయాన్ని ప్రస్తావించాలి. 'ఆంధ్రులు' అంటే ఎవరు? ఈ పదానికి అసలైన అర్థం ఏమిటి??

"భరత ఖండమునందలి దక్షిణాపథ దేశములలో నాంధ్ర దేశము సుప్రసిద్ధమయినదిగ నున్నది. (అంధ+రన్=అంధ= దృష్ట్యుపఘాతేయని ధాతువు) మనుష్యులు వసియింప శక్యముగాని యంధకారము కలది యగుటచే నౌత్తరాహులీదేశము నాంధ్ర దేశమని వాడుచువచ్చిరి" ఇది చిలుకూరి వీరభద్రరావు పంతులుగారు 1910లో రాసిన "ఆంధ్రుల చరిత్రము"లో ఆంధ్రులంటే ఎవరో చెప్తూ రాసిన మాటలు.

ప్రాచీన కాలంలో, అంధకార బంధురమైన మహారణ్య మధ్యమంలో నివసించారు కాబట్టి ఉత్తరాది ఆర్యులు వీళ్లని ఆంధ్రదేశీయులని, ఆంధ్రులని అన్నట్లు వీరిభావం.

అంధ్ర, ఆంధ్ర, అంధక అనే పేర్లున్న ఒక అనార్య మిశ్రజాతి వుండేదని శ్రీ టి.వి.జి. శాస్త్రిని ఉటంకిస్తూ ఆచార్య హెచ్.ఎస్. బ్రహ్మానంద "తెలుగు శబ్ద పరిణామం" గ్రంథంలో కొన్ని విశేషాలు తెలిపారు.

ఆయన చెప్పిన వాటిలో ముఖ్యాంశాలు ఇవి:

1. క్రీ.పూ. 600 నాటి ఐతరేయ బ్రాహ్మణంలో ఆంధ్రుల్ని పుండ్రులు, మూతిబులు, శబరులు, పుళిందాదులతో కలిపి పేర్కొన్నారు. వీళ్లని, దస్యులు, మ్లేచ్ఛులు అని కూడా అన్నారు.

2. ఆంధ్రులు ఆర్యులు కాదు. అలాగని ద్రావిడులు కూడా కాదు. ముండాజాతి వారితోపాటు ఈ దేశంలో స్థానికంగా ఆర్యులరాక కన్నా ముందునుంచీ వున్న ప్రాచీనజాతివారు ఆంధ్రులు.

3. మహాభారతంలో పాండవ పక్షాన వున్న రాజులలో అంగ, వంగ, పుండ్రక, పాండ్య, మద్ర రాజులతోపాటు ఆంధ్రరాజు కూడా వున్నాడు.

4. ఆంధ్ర శబ్దానికి వేటగాడు అని కూడా అర్థం వుంది.

5. ఆంధ్రకులు (అంధకులు), గుహులు, పుళిందులు, శబరులు, చుచుకులు, మద్రకులు వీళ్లంతా దక్షిణాపథంలోనే జన్మించారని మహాభారతం శాంతిపర్వంలో ఉంది.

6. అంధ అనే పేరుతో బీరార్ ప్రాంతంలో ఒక ఆటవిక జాతి వుందని థామస్ బుర్రో గుర్తించారు.

7. "అంధ" శబ్దమే "ఆంధ్ర"గా ఉన్నతీకరణం పొంది ఉండాలి. రాజుల నామాలు ఆర్యీకరణం పొందటం భారతీయ చరిత్రలో ఉన్నదే!

8. అంధ శబ్దానికి "గుడ్డి" అర్థాన్ని ఆంధ్రగా మార్చడం ద్వారా పరిహరింపచేశారు. ఆంధ్ర శబ్దం దేశసూచకంగా స్థిరపడింది.

9. ఆంధ్రకు "తెలుగు" అనేది అనువాదమూకాదు, సమానార్థకమూ కాదు.

10. "సామాన్య జనులు 'తెలు'గని పిలుస్తూ వచ్చిన భాషకే ఆంధ్రమనే శిష్టనామం కల్గింది. మనం తొలుత తెలుగులం. తరువాతనే ఆంధ్రులం" అని కోరాడవారు ఏనాడో ఘోషించారు.

11. సంస్కృతంలో అంధ్రుడు అంటే, ఆంధ్రుడు, వ్యాధుడు, వైదేహునకు వారస్త్రీయందు పుట్టిన సంకరజాతివాడు అని అర్థాలిచ్చారు.

ఇంత సుదీర్ఘంగా ఈ విషయాన్ని ఇక్కడ ప్రస్తావించడానికి ఒక ముఖ్య కారణం వుంది. తేకుమళ్ల రాజగోపాలరావు గారు యూరోపియన్ భాషా కుటుంబంలో ఆంధ్ర పదాలు వెదకడానికి ప్రయత్నించిన సంగతి, మన పురాణేతిహాసాలు ఆంధ్రుల్ని, అటు ఆర్యులు, ఇటు ద్రావిడులూ కాని స్వతంత్ర జాతీయులుగా భావించిన సంగతి - ఈ రెండింటినీ ముడిపెట్టి ఆలోచించడం అవసరం అని అభిప్రాయ పడ్తున్నాను.

Sergei రూపొందించిన ప్రొటో ఇండో యూరోపియన్ ఆన్‌లైన్ Detabases పరిశీలిస్తున్నప్పుడు, అందులో ప్రోటో ఇండోయూరోపియన్ పదం "అంధ్" కన్పించింది. సహజంగానే సంస్కృత అర్థం "అంధత్వం"కు సంబంధించిన పదరూపం అయివుంటుందని అనుకొంటూ దాన్ని పరిశీలించాను.

Proto indo - European : andh

Meaning : Person

"ఆంధ్ర" శబ్దానికి వ్యక్తి, మనిషి అనే అర్థాలు ఇక్కడ కన్పిస్తోన్నాయి. ప్రాచీన సంస్కృత భాషలో కూడా ఒకప్పుడు ఈ అర్థాలు సహజంగా వుండి వుంటాయి. బహుశా ఋగ్వేదఆర్యులు భారతదేశంలోకి అడుగుపెట్టినప్పుడు, క్రూర జంతువులు, మహావృక్షాలు తప్ప మరేమీ కన్పించనిచోట మొదటగా తారసిల్లిన వ్యక్తుల్ని "అంధ" శబ్దంతో వ్యవహరించి వుంటారు - మనుషులు కన్పించిన ఆ ఆనందంలో.

పంచములు, హరిజనులు లేదా దళితుల్ని ఒకప్పుడు ఆది ఆంధ్రులు అని పిలిచేవాళ్లు. "ఆంధ్రులు" అంటేనే దళితులని అర్థం. వీళ్లు ఈనాడు దళితులు కావచ్చు కానీ, ఆనాడు రాజాధిరాజులే!

## అంధలు ఇలా అంధకులయ్యారు:

ఈ అంధ శబ్దానికి 'క' చేర్చి అంధక అని ఎలా పిలిచారో శ్రీ టి.వి.జి. శాస్త్రిగారిని ఉదహరిస్తూ, ఆచార్య హెచ్.ఎస్. బ్రహ్మానంద "తెలుగు శబ్ద పరిణామం" అనే చిన్న గ్రంథంలో పేర్కొన్న మరికొన్ని విశేషాలు ఇవి:

1. ప్రాకృత సంస్కృత ప్రభావం వలన నామ వాచక సర్వనామాలకు చివర "క" చేర్చడం జరిగింది.

2. భట్టిప్రోలు త్రవ్వకాలలో బైటపడిన కుండపెంకుల పైన బ్రాహ్మీలిపిలో రాసిన ప్రాకృత శాసనాలు దాదాపు 140 వరకూ వున్నాయి. వాటిలో మత గురువుల పేర్లు, ఊళ్లపేర్లు, మనుష్యుల పేర్లు అన్నింటికీ చివర "క" అని వున్నాయి. అలా అంధ శబ్దం "అంధక"గా మారి వుంటుంది.

3. బౌద్ధ జాతక కథలలో అంధక వెన్హు (ఆంధ్ర విష్ణువు) ప్రస్తావన వుంది. ఈయన చరిత్రని తెలుగే ప్రాచీనం అనే గ్రంథంలో వివరంగా అందించాను. పరిశీలించ గలరు.

4. అమరావతి మహా చైత్యాన్ని "చైత్య'కు'లు" నిర్మించినట్లు ఒక శాసనంలో వుంది.

5. ఇవి రమారమి క్రీ.పూ. 200 నాటివని మనం భావించవచ్చు.

6. గోదావరి పుట్టిన "త్రయంబక" , దాని దగ్గరున్న నాసిక్‌లలో కూడా చివర 'క' ఉండటం గమనార్హం.

7. ఈ కారణంగా "అంత-క" (చివర"క" వుండే భాష) అనికూడా ఆంధ్ర భాషకు పేరుండేది.

ఈ విశ్లేషణని పరిశీలించాక "అంధ" లేదా అంధ్ర శబ్దంతో పిలువబడిన ఆంధ్రులు బౌద్ధ యుగం నాటికే అంధకులుగా మారారని అర్థం అవుతుంది. చరిత్రవేత్తలు బుద్ధుడు కాలాన్ని క్రీ.పూ. 9వ శతాబ్ది వరకూ తీసుకువెడ్తున్నారు. బుద్ధుడు జీవించివున్న కాలంలోనే అంధక దేశంలో, గోదావరి ఒడ్డున ఈనాటి తెలంగాణాలో "మూలక", "అసిక" (అశ్మక) ప్రాంతాల నుంచి 'బావరి" అనే తాత్త్వికుడు స్వయంగా బుద్ధుడితో కొన్ని శాస్త్ర సాంకేతిక అంశాలు చర్చించినట్లు "సుత్తనిపాత" అనే బౌద్ధ జాతక గ్రంథంలో వుంది. దీన్నిబట్టి 'అంధ' అని పిలువబడిన ఆంధ్రప్రజలు బుద్ధుడికన్నా పూర్వమే అంధకులుగా మారినట్లు స్పష్టం అవుతోంది.

ఈ విశ్లేషణని బట్టి కొన్ని కొత్త ఆలోచనలను మీ ముందుంచుతున్నాను.

1. తెలుగు ప్రజలు అంధ లేదా అంధ్ర శబ్దంతో వ్యవహరించబడే నాటికే భారతదేశంలో వాళ్లు స్థానిక ప్రజలుగా వున్నారు. అంటే, ఆంధ్రులు ఆర్యులకన్న ఈదేశంలో పూర్వీకులు -

2. పూర్వ ముండా భాష మాట్లాడిన ప్రజలకు 'అంధ" భాషమాట్లాడిన ప్రజలు సమకాలికులు, సహజీవనులు, సమీప వర్తిత్వం కలవారు. వీళ్లు భారతదేశం అంతా అప్పటికే అల్లుకుని వున్నారు.

3. ప్రొటో ఇండోయూరోపియన్ : andh (a) = person

ప్రాచీన హిట్టయిట్ భాష : antuhsa, antuhha ("అంతహ్హా" అనే ఈ పదం "అంతక (అంధక)" కు దగ్గరగా వుండటం గమనార్హం.)

ప్రాచీన గ్రీకుభాష : "anthros"

గ్రీకు భాషలో యాంథ్రోస్ అంటే "Man" అని! Logos అంటే అధ్యయనం చెయ్యడం. ఆంథ్రపాలజీ అంటే, మనిషిని అధ్యయనంచేసే శాస్త్రం. ఈ పదాన్ని మొదటగా ప్రయోగించినవాడు గ్రీకు తత్త్వవేత్త అరిస్టాటిల్. ఆయన బౌద్ధయుగం నాటివాడు.

ఆంధ్రపాలజీలో "అంధ్ర", ఆంధ్ర శబ్దంలోని "అంధ్ర" ఒకే అర్ధంలో వున్నాయని దీన్నిబట్టి స్పష్టం అవుతోంది.

ఈ పరిశీలనలో "అంధ" అనే పదం "అంధ్రోస్ అనే గ్రీకు పదానికి మాతృక అని తేలింది. అంధ అంటే అంధుడు కాదని 'మనిషి' అని కూడా తేలింది. అంధలు, అంధ్రలు, ఆంధ్రలు, అంధకులు "మనుషులు" అనే అర్ధంలోనే అలా పిలువబడ్డారు. కానీ, గుడ్డివాళ్లనీ, గుడ్డివాళ్ల సంతతి అనీ సంస్కృతాభిమానులు పిచ్చి కథలు రాసి ఇన్నాళ్లు మనల్ని అవమానించారని కూడా తేలింది. అంతేకాదు, చారిత్రకయుగం నాటికే ఆంధ్రులు ఈ తెలుగునేల మీద నివసించి వున్నారని, ఇది వారి స్వంత స్థావరం అని కూడా తేలింది.

4. అంధ శబ్దానికి పూర్వ ఇండోయూరోపియన్ భాషలో మరో రెండు అర్ధాలున్నాయి.

ప్రోటో ఇండోయూరోపియన్ : అంథ్ (1. Sprout, 2. Flower)

పూర్వ సంస్కృతం : ఆంథాస్ (ఒక మొక్క)

పూర్వ గ్రీకు : anthos (వికాసం)

ఇన్ని సానుకూల అర్ధాలున్న అంధ శబ్దానికి సంస్కృతంలో వున్న 'గుడ్డి తనం' అనే అర్ధం కారణంగా ఆంధ్రుల్ని బహిష్కృతులుగానూ, శాపగ్రస్థులుగానూ, అనాగరకులుగానూ ఆటవికులుగనూ పరిగణించి పురాణాలలోనూ మత గ్రంథాలలోనూ అన్యాయమైన రాతలు రాశారని స్పష్టం అవుతోంది!

మనం అంధ జాతి ప్రజలమైనందుకు గర్వించాలి!

అంధ అంటే మనిషి.

"ఆంథోస్" అంటే మనిషి!

అంధ అంటే పుష్పం, మొలక.

ఆంథోస్ అంటే వికాసం.

## ఇండో యూరోపియన్ భాషల్లో మరికొన్ని తెలుగు పదాలు :

"Sergei Nikolayer" రూపొందించిన ప్రోటో ఇండోయూరోపియన్ ఆన్‌లైన్ డాటాబేస్‌లో అచ్చు గుద్దినట్లు సరిపోయిన ఎన్నో తెలుగు పదాలున్నాయి. రూపసాదృశ్యము, శబ్ద సాదృశ్యాలతోపాటు భావసాదృశ్యం కూడా వుంది కాబట్టి వీటిని పట్టించుకుతీరాల్సిందే! వీటిలో చాలాపదాలు తమిళ, కన్నడ తదితర ద్రావిడ భాషల్లో లేనివి కూడా వున్నాయని నాకు అన్పించింది. DEDR లో (ద్రవిడియన్

ఎటిమలాజికల్ డిక్షనరీ) లో అవి కన్పించకపోవడమే ఇలా అనడానికి కారణం. ఆర్యాద్రావిడ భాషలలో పాండిత్యం కలవారు ఈ విషయాన్ని కూడా పరిశీలించ వలసివుంది. ఇండోయూరోపియన్ భాషాపదాల్లో శబ్దసాదృశ్యం కలిగిన తెలుగు పదాల్ని ఒకచోట చేర్చి-వాటిలో సంస్కృతభాషలో కూడా కన్పించే పదాల్ని వదిలేయగా మిగిలిన వాటిలో కొన్నింటిని ఇక్కడ ఉదహరిస్తున్నాను. పరిశీలించగలరు.

1. **అంగ**= వేగముగాఁ బోవుటకై కాళ్లు చాచివేయుట.
stride, a long step.
ప్రోటో ఇండో యూరోపియన్ : Ang (early)
ప్రాచీన సంస్కృతం : anjas (Quickly, instantly) anjasa (Straight on)
బాల్టిక్ : ank-s-t-ei, ank-s-t-a,
జర్మనిక్ : unx - tw - on - f

2. **గ్రుద్దు** : గుద్దు, పిడికిటిపోటు, గ్రుద్దులాట, నియుద్ధము togive a blow with the first , a fisticuff, to combat
ప్రోటో ఇండోయూరోపియన్ : grud (to press, to squeeze)
జర్మనిక్ : krud-a - ; kru-d; krau-d -
సెల్టిక్ : gruth

3. **ఎయిదు** : ఎయ్దు= చేరు, అందుకొను, వెంబడించు, వెంటాడు, పొందు, సాగు, సరిపడు, సమానమగు, అనుకూలమగు, పోవు, చను, వెళ్లు, ఎగురు.
ఎయిదించు = తెలుపు, యెఱిగించు
ప్రోటో ఇండోయూరోపియన్ = ey (to go)
హిట్టయిట్ : i, pa - i
తొఖారియన్ : i, (go, travel)
ప్రాచీన సంస్కృతం : eti (to go, walk)
అవెస్తా : aeiti
ప్రాచీన పర్షియన్ : aitiy
ప్రాచీన గ్రీక్ : ei □mi
లాటిన్ : eo; itum,

**4. అలపు** = (అలయు) (అలుపు) ఆలస్యముచేయు, విసుగు, శ్రమపడు (to be tired, be disgusted (DEDR : 236)
అలయించు = to weary, over work, disgust
అలగు = to be displeased, take offence, grieve
అలచు = to tease, harass అలసట = weariness
అలిపిరి = Lean, thin, weak
ప్రోటో ఇండో యూరోపియన్ = alp (a) = weak
హిట్టయిట్ = alpanta (alpant) = Ill, weak
ప్రాచీన సంస్కృతం = alpa, alpaka, (small, minute, triffling)
బాల్టిక్ = alp, alp - na
జెర్మనిక్ = alb-a-m, alb-i-c
యూరేసియాటిక్ = Halpv (weak)
అల్టాయిక్ = alpa.

**5. కాలు** (కాలడం)
ప్రోటో ఇండోయూరోపియన్ = KAl (emaciated)
స్లావిక్ = o-koleti
బాల్టిక్ = Kale (dry), Kal-d-an-a-, Kal-t-ia-c, Kal-t-e
జెర్మనిక్ = Xal-ja
లిథువేనియన్ = nu-kaleti

**6. చిన** (చిన్న)
ప్రోటో ఇండో యూరోపియన్ = Ken (part)
సంస్కృతం = కణ (particle)
అవెస్తా = cIna (particle)
జెర్మనిక్ = gini (xunv)
లాటిన్ = cunque (?)
తమిళం = cinna (small, little, low)
మళయాళం = cinna (small)
కన్నడ = cini, cinni

**7. అర** : సగము, అర్ధము, సందేహము, శంక
ప్రోటో ఇండోయూరోపియన్ = ara / ere (Part)
ప్రాచీన గ్రీకు = ara, ar, (particle, implying anxiety or impatience)
బాల్టిక్ = ar, ir
తమిళ = arai (waist, Loins, not full stomach)
మళయాళం = ara (middle of the body)

**8. అయితి** : ఐతి, అయితు (ఉచితం, శక్యము, సాధ్యము)
ప్రయోగం = అది నాకు అయితికాదు" అంటే, సాధ్యం కాదని!
possible, which may be or can be done;
allowable, convenient, possibility.
ప్రోటో ఇండోయూరోపియన్ = ait (Motley)
ప్రాచీన సంస్కృతం = eta (variegated, shining, brilliant)
అవెస్తా = aeta
బాల్టిక్ = ait-e-gen (a)-m (smallwood pecker)
ప్రాచీన ప్రష్యన్ = aytegenis

**9. అరిగ** = ఒక బిరుదు, ఒక రాజచిహ్నము, చర్మఫలకము, కేడెము
అరిగాపు = కట్టుకావలి, పడిగాపు, కనిపెట్టుకొని పడియుండుట.
కంచె కోట. అరిగొను = అడ్డుపడు
ప్రోటో ఇండోయూరోపియన్ = a - reg (to care, to help)
ప్రాచీన గ్రీకు = arego, arogo
జెర్మనిక్ = rok-i, rok-ia

**10. అగడు** : అవ్వ, నింద, దూఱు; నెగడు, కలత, తొట్రుపాటు (నింద్యము)
ప్రయోగాలు : అగచాట్లు (కష్టాలు); అగడుపెట్టు
(అల్లరి పెట్టు); అగడుకాకి. (ఆకతాయి)
అగడువడు (పదిమంది నోళ్లలో పడు) అగడారు (నింద, అపవాదం)
ప్రోటో ఇండో యూరోపియన్ = ag (sin, crime)
ప్రాచీన సంస్కృతం = (agas) (offence, injury sin, fault) (అఘము)
ప్రాచీన గ్రీకు = agos

జెర్మనిక్ = ak-a-; ak-i-c; akl-a-m
యూరేసియాటిక్ = aka (bad)
ఆఫ్రో ఆసియాటిక్ = ? k
సైనో కాకేషియన్ = Hag (wv)
సైనో టిబెటన్ = ? ak
తమిళం = అకటు (wickednem)
కన్నడం = అగడు (viciousnem)

**11. ఏగు** : పోవు, గమించు, (to go, proceed)
ఏగించు : వీధులలో దేముని విగ్రహాన్ని ఒక గుంపుగా వెడుతూ తీసుకువెళ్లడం (ఊరేగించు) (DEDR - 871)
ప్రోటో ఇండో యూరోపియన్ = ag (to drive)
తొఖారియన్ = ak (Lead, guide drive)
సంస్కృతం = అజతి (to drive) (అజ, అజి)
అవెస్తా = Azaiti
ఆర్మీనియన్ = acen
ప్రాచీన గ్రీకు = ago (transport) agon
జెర్మనిక్ = ak-a(n) (tosail) ek-a navigate
లాటిన్ = ago, egi, actum
స్వీడిష్ = oka, aka
డేనిష్ = age

**12. గొణుగు**: గొణగు = మాట వెడలనీక నోటనె గొణగొణయను
ప్రోటో ఇండో యూరోపియన్ = gong (to mutter)
ప్రాచీన సంస్కృతం = గుంజతి (to buzz, hum)
ప్రాచీన గ్రీకు = gonguzdo
స్లావిక్ = go □ gnja

**13. అత్త** : అత్తమ్మ, అత్తయ్య = father's sister.
ఇండో యూరోపియన్ = ata, atta (father)
హిట్టయిట్ = atta-c

ప్రాచీన గ్రీక్ = atta
జెర్మనిక్ = att-an-m
లాటిన్ = attam
సెల్టిక్ = wite

**14. వదిన** : వదినె, వదినియ (అన్న భార్య; భార్య, జ్యేష్ఠమాతువేయి తనకంటె పెద్దదగు మేనత్త మేనమామల కూతురు)
ప్రోటో ఇండోయూరోపియన్ = (e) yena-t-er (brother's wife)
ప్రాచీన సంస్కృతం = yatar (husband's father's wife)
ఆర్మీనియన్ = ner, gen, Niri,
ప్రాచీన గ్రీకు = enateres, eron, enater
స్లావిక్ = Je□tr
బాల్టిక్ = Jente
లాటిన్ = lanitrices

**15. అంకు** : దొరకు, లభించు
ప్రయోగాలు : 1. వానికది అంకలేదు
2. అంకినంత వఱకు తీసికొనిపోయెను (సూ. సూర్యరాయాంధ్ర నిఘంటువు)
అంకించు : ఒప్పు, ప్రకాశించు to raise, liff up; to extol, praise, to flourish, brandish.
ప్రోటో ఇండోయూరోపియన్ = ank (fate, destiny)
హిట్టయిట్ = henkan
ప్రాచీన గ్రీక్ = ananka
జెర్మనిక్ = anx-t-o

**16. మామిడి:** = Mango : మాకాయి, మావి, మామిడి, మావిడి
ప్రోటో ఇండో యూరోపియన్ = amel (a Fruit tree, Fruit)
ప్రాచీన సంస్కృతం = ఆమ్ర (mango tree)
ప్రాచీన గ్రీక్ = ampelo-s
జెర్మనిక్ = amil-on-f ?
సెల్టిక్ = amella

తమిళం = మా, మాంటి, మాట్టి (Mango) మాంకాయ్
సంస్కృతం = మా కంద (Mango tree) DEDR = 4782

**17. గొవరు** : తాపము. గొవరు వోవు = తపించు
"కొన్ని దేశంబు లెండచే గొవరువోయె" అని కాశీఖండంలో ప్రయోగం.
ప్రోటో ఇండో యూరోపియన్ = g' wer ( to burn, to flame)
ప్రాచీన సంస్కృతం = Jvarati (to be feverish)
Jvaram = fever, grief)
బాల్టిక్ = □ Wer - a

**18. అలగు** = వెనుదీయు, శ్రమపడు, శోకించు, సంకోచించు.
అలచు = అలగజేయు, శ్రమపరచు
ప్రోటో ఇండోయూరోపియన్ = (a) Leg (to take care)
ప్రాచీన గ్రీకు = alego
లాటిన్ = diligo

**19. అలుక** = కోపము, ద్రోహ చింత (అలుగు, అలువు, అలుక, అలుకువ = angre, Displeasure)
ప్రోటో ఇండో యూరోపియన్ = (a) Lew, alk (anger)
హిట్టయిట్ = halluwai
ప్రాచీన గ్రీక్ = aluo, aeol
యూరేసియాటిక్ = Halv (to be angry)
అల్బాయిక్ = ali
ఉరలిక్ = alv (to condemn bewitch)
పూర్వద్రావిడ = alu (to prick be angry (DEDR 304)

**20. మేవు** : పూయు, ఆవరించు (ఆంధ్ర దీపిక : p: 639)
మేవడి : నమ్రత, ఉపాయము, ఉచితము
(humility, a stratagem) మేవడికాడు = నమ్రతగలవాడు
(humble man, a strategist) (చూ. పి. శంకరనారాయణ తెలుగు-ఇంగ్లీషు నిఘంటువు)

ప్రోటో ఇండోయూరోపియన్ : (a) mewe, mwo (to move, to drive)
తొఖారియన్ = mew miw (shake, quake)
ప్రాచీన సంస్కృతం = mivati (to press, push open by pressure)
అవెస్తా = ava-mivaman
ప్రాచీన గ్రీకు = ameusasthai
స్లావిక్ = majati, motati, matati, maxati
బాల్టిక్ = mau
జెర్మనిక్ = mau-s-id-o (n)
లాటిన్ = moveo, movi
ఆధునిక ఇంగ్లీష్ = move

**21. అంప**: బాణము (అంబు, అంబకము, అమ్ము) అంపకాడు = archer arrow
ప్రోటో ఇండో యూరోపియన్ = a(m) p-i-/e, b, అంపి (లేదా) అంబ్
(bee, stinging fly - తేనె టీగ (లేదా) ముల్లు కల్గిన ఈగ)
ప్రాచీన గ్రీకు = Empis,
జెర్మనిక్ = imb, ia-m
లాటిన్ = apis, (ఇస్ అనేది బహువచనం)
తమిళ = అంపు (arrow)
మళయాళం = అంపు (arrow)
కన్నడ = అంబు
తుళు = అంబు

**22. కల్లు** : కలు; రాయి. (బడిగల్లు, సన్నికల్లు)
"గగన హరినీల శైలశృంగంబు నుండి, దొర్లిపడెఁ బ్రొద్దు జేగురు
(గల్లువోలె" (నైషధం 8-152)
కల్లు గాన్గు = కలుగానుక (రాతి గానుగు)
కల్లుప్పు = రాతి ఉప్పు (సైంధవలవణం)
కల్లువడు = స్తంభించు, రాపడు
("గుండె జల్లుమని కల్లువడి .... "అని మనుచరిత్రలో ప్రయోగం)
ప్రోటో ఇండోయూరోపియన్ = Kal (stone, rock)

ఆర్మీనియన్ = sat, gen, sali
(అన్ని ద్రావిడ భాషలలోనూ ఈ "కల్లు" పదం ఇదే అర్థంలో కన్పిస్తుంది.

**23. అట్ట** : శరీరపు మొండెము, చెప్పులకు అడుగునవేయు తోలుముక్క, పుస్తకమునకు పైన వేయు కాగితము, తోలు మొ॥ ఒకదానితో ఒకటి అంటుకు పోయిన పదార్థము. Sole of shoe or slipper, hide or leadher, card board
ప్రోటో ఇండో యూరోపియన్ = at, ad (skin, cover)
ప్రాచీన సంస్కృతం = atka-m (armour, mail, carment)
అవెస్తా = adka, atka-m
ప్రాచీన గ్రీకు = attomai,
బాల్టిక్ = a d-a
తమిళ = అట్టాయ్ = Sole of shoe card board
కన్నడ = అట్టె (Sole-of leather) Sandal, skin

**24. ఏయు** : ఎయ్యి :
1. ప్రయోగించు, (బాణాదులతో) కొట్టు, వేయు, వైచు, ఉంచు, ఏటు, ఏటుకాడు, ఏటులాడు
ప్రోటో ఇండో యూరోపియన్ = ey (to do, to make)
హిట్టయిట్ = ija,
తొఖారిన్ = ya, yam
ప్రాచీన గ్రీకు = ei

**25. అవును** : అవు, అగు, ఔ,
అంగీకారమును ప్రశంసను తెలుపునది.
(ఆమ్రేడితమున ఔ నౌ), అగు, అవు. ఔగాక! (so be it)
ప్రాటో ఇండో యూరోపియన్ = aw a (to note, to listen)
హిట్టయిట్ = au (s), u (wa)
ప్రాచీన సంస్కృతం = avis (before the eyes, openly evidently)
(ఆవిష్కరణం)
అవెస్తా = avis
ప్రాచీన గ్రీకు = aisthanomai (aiathomai)

శ్లావిక్ = aviti, ave,
బాల్టిక్ = au-mo, a-mo
లాటిన్ = audio.

పైపైన వెదికితే కళ్లలో పడిన అనేక పదాలలో కొన్నింటిని మాత్రమే ఇక్కడ అందించాను. భాషా శాస్త్రవేత్తలు మరింత శాస్త్రీయమైన పద్ధతిలో కృషిచేస్తే ఎన్నో అద్భుతమైన అంశాలు వెలుగులోకి వచ్చే అవకాశం వుంది.

తేకుమళ్ల రాజగోపాలరావుగారి ప్రారంభానికి ఇది కొనసాగింపు మాత్రమే! భాష ప్రమాదంలో పడిన నేపథ్యంలో నావంతు కర్తవ్యంగా చేస్తున్న చిరుప్రయత్నం మాత్రమే!

"ఆంధ్రము" ఇండో యూరోపియన్ భాషా కుటుంబానికి చెందినది కావచ్చుని గట్టిగా వాదించిన పరిశోధకుడు డా॥ చిలుకూరి నారాయణరావు. అయితే, సంస్కృతం లోంచి ద్రావిడ భాషలు ఏర్పడ్డాయని నిరూపించడానికి ఆయన ఎక్కువ శ్రమించారు. అందుకని, ఆయన వాదనలు నిలువలేదు.

ఇండోయూరోపియన్ భాషా కుటుంబంలో గ్రీకు, లాటిన్, జర్మన్ తదితర భాషలతో పాటు ప్రాచీన సంస్కృతం (లేదా) వేద భాష, సంస్కృత భాషలు కూడా చేరివున్నాయి. ఈ భాషల మాతృక అనదగిన పూర్వ ఇండో యూరోపియన్ (Proto Indo-Europian) భాషని పరిశోధకులు కొంతవరకు పునర్నిర్మించగలిగారు.

ఈ "పూర్వ ఇండోయూరోపియన్ భాషా" పదరూపాలలో కొన్ని ఈనాటికీ తెలుగులోనూ సంస్కృతంలోనూ సజీవంగా వున్నాయి. మరికొన్ని సంస్కృ తంతో నిమిత్తం లేనివి కూడా కన్పించాయి. వాటిలో ముఖ్యమైనవాటిని ఈ వ్యాసంలో ఉదహరించాను. ఈ పదరూపాల పరిశీలన తర్వాత కొన్ని ముఖ్య విషయాలు స్పష్టం అవుతున్నాయి.

1. సంస్కృత భాషలోంచి తెలుగు (ఆంధ్రము) రూపొందిందనేది అపోహ మాత్రమే! "జనని సంస్కృతంబు ఎల్ల భాషలకు" అనే సూక్తి ఉత్తర భారతదేశంలోని హిందీ భాషారూపాలకు వర్తిస్తుందేగాని తెలుగుతో సహా ఏ దక్షిణాది భాషకూ వర్తించదు.
2. పూర్వ సంస్కృతానికి మాతృక అనదగిన ప్రోటో ఇండో యూరోపియన్ భాషలోనే ఆంధ్ర (తెలుగు) పదాలు కన్పించాయంటే, తెలుగు-వేదభాష సమకాలీనమైనవని అర్థం అవుతోంది. అంటే, సంస్కృతం కన్నా తెలుగే ఒకింత ప్రాచీనం కావచ్చు

నన్నమాట- సంస్కృతం తెలుగు భాషకు చిన్న చెల్లెలు అవుతుందేమో గాని "తల్లి" మాత్రం కాదు.

3. ఇండో యూరోపియన్ మాతృకలోంచి పూర్వ సంస్కృత పదాలు (వేదభాష) రూపుదిద్దుకున్న క్రమంలోనే కొన్ని తెలుగు పదాలు కూడా రూపుదిద్దుకుని వుంటాయి.

4. భారతదేశంలో వైదిక ఆర్యులతో ఆంధ్రభాష మాట్లాడిన ప్రజలకు సాన్నిహిత్యం ఏర్పడిన తర్వాత కొన్ని పదాలు ఈ రెండు భాషల్లోనూ పరస్పరం మార్పిడి పొంది వుంటాయి. తెలుగులో సంస్కృత పదాలా.... సంస్కృతంలో తెలుగు పదాలా .... తేల్చలేనంతగా అవి కలిసిపోయాయి.

5. భారతదేశంలో ఆంధ్రము (తెలుగు) అత్యంత ప్రాచీనభాష కాబట్టి ప్రాచీన సంస్కృతం (వేదభాష)తో దానికి అంత సాన్నిహిత్యము, సమీపత్వమూ వున్నాయి. తర్వాతి కాలంలో రూపొందిన ఇతర ద్రావిడ భాషలకు వేద భాషతోనూ, సంస్కృతంతోనూ అంత సాన్నిహిత్యం లేదని అర్థం అవుతోంది.

6. ఆంధ్రము, తెలుగు వేర్వేరు భాషలని, ఇవి రెండూ కలగలిసిన మిశ్రమ భాషనే ఇప్పటి తెలుగు ప్రజలు మాట్లాడాతున్నారనీ పండితులు ఎక్కువమంది భావిస్తున్నారు. భారత దేశంలో ఒక విచిత్ర పరిస్థితివుంది. ఒక్కొక్క భాషవారు తమని ప్రత్యేక జాతి అనుకొంటారు. ఆర్యభాషలు మాట్లాడేవాళ్లు తాము ఆర్యజాతి వాళ్లమంటారు. ద్రావిడ భాషలు మాట్లాడేవాళ్లు తాము ద్రావిడ జాతీయుల మంటారు. తమ జాతికి మూలాలను వెదికే ప్రయత్నాలు చేస్తారు. కానీ, వివిధ ద్రావిడ భాషలు మాట్లాడే ప్రజలందరూ ఒకే జాతీయులు కానట్టే వివిధ ఆర్యభాషలు మాట్లాడే ప్రజలుకూడా ఒకే జాతీయులు కాదు. దేశంలోని వివిధ ప్రాంతాల్లోకి వివిధ జాతి ప్రజలు ప్రవేశించి స్థానిక భాషల్ని స్వీకరించి వారితో మిశ్రమం అయిపోయారు. ఒకే దేశంలో ఇన్ని భాషా వైవిధ్యాలు, ఇన్ని రకాలుగా వర్ధిల్లాయి.

హరప్పా నాగరికత ఆంధ్రుల నాగరికత కావచ్చునని లేదా ఆ నాగరికత కాలంలో ఆంధ్రులు ప్రధాన పాత్ర పోషించారనీ ఐరావతం మహదేవన్ గారి తాజా పరిశోధనలు స్పష్టీకరిస్తున్నాయి.

శ్రీ కొమాండూరు శఠకోపాచార్యులు 1950 దశకంలో ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రిక దుందుభి నామ సంవత్సర 44వ వార్షికోత్సవ సంచికలో "భారతదేశ

భాషలు-తెలుగు" అనే వ్యాసం ప్రచురించారు. అందులో ఆయన చెప్పిన విశేషాలివి:

● ఆర్య ద్రావిడ భాషా కుటుంబాలు రెండింటికీ సమన్వయ కరమగుటవలన ఈ రెండింటి విశేషాలూ ఆంధ్రములో గలవు.

● తమిళభాషలో అచ్చులకి ప్రాముఖ్యము. ఉత్తర ఆర్య భాషలలో హల్లులకు అధిక ప్రాముఖ్యము తెలుగులో ఈ రెండింటికీ సమాన స్థాయి కలిగి మాధుర్యము మిళితమైనది.

● ఆర్య ద్రావిడ జాతులు చిరకాలం క్రిందటే మిళితములై మిశ్రమములై తెలుగు జాతీయులుగా మారారని జాతిశాస్త్రజ్ఞులంగీకరిస్తున్నారు.

● భౌగోళికంగా ఉత్తర మధ్య దేశాలకు, దక్షిణ దేశానికీ మధ్యనున్న ఆంధ్రులలో ఈ ఉభయజాతుల మిశ్రణం హెచ్చుగా వుండటం సహజం. బెంగాలీలూ అంతే! ద్రావిడుల మిశ్రజాతిగా బెంగాలీ ప్రజల్ని చరిత్రవేత్తలు భావిస్తారు.

దేశంలో వివిధ ప్రాంతాలలో తెలుగు మాట్లాడే ప్రజలు నివసిస్తున్నారు. "అనగనగా ఒక రాజు" కథ బెంగాలీలో కూడా ప్రసిద్ధమైన జానపద గాథే! అస్సాంకు చెందిన ప్రాచీన ముండా జాతి నాగులతో తెలుగువారికి చక్కని సంబంధాలు రాతియుగం కాలంలోనే వుండేవని ఎల్. ఎ. కృష్ణ అయ్యర్ (మద్రాస్ విశ్వవిద్యాలయం ఆంథ్రపాలజీ విభాగాధిపతి) 1967లోనే Kerala Megaliths and their Builders అనే గ్రంథంలో పేర్కొన్నారు.

ఆంధ్రము, తెలుగు మిశ్రమ భాష మాట్లాడే ప్రజలు ఈ భారత దేశంలోకి అడుగుపెట్టడానికి పూర్వమే అది మిశ్రమం అయివుంటుంది. ఇందులో పూర్వ ఇండో యూరోపియన్ పదరూపాలతోపాటు ప్రోటో ఆఫ్రో ఆసియాటిక్, సుమేరియన్, అవెస్తా (ప్రాచీన పర్షియన్) పదరూపాలు ఎన్నో కన్పిస్తాయి. ఈ భాషల పితామహులు 10వేల ఏళ్లకు ముందు ఒకరి మాట ఒకరికి అర్థం అయ్యే స్థితిలో వుండివుంటారు.

● వీటిలో ఏవి తెలుగు, ఏవి ఆంధ్రము అని వితర్కించడం అనవసర శ్రమే! అవి రెండూ కలగలిసిపోయి తెలుగునేల మీద తెలుగు ప్రజలలో ఆంధ్రభాషగానూ, తెలుగుభాషగానూ స్థిరపడిపోయాయి.

● బౌద్ధులకాలానికి తెలంగాణాలో నివసించిన ప్రజలు తమని (అంధకులు) ఆంధ్రులనే పిలుచుకున్నారు.

● రాయలసీమలో రాతియుగపు మానవులకు సంబంధించిన పురావస్తు ఆధారాలు దొరికాయి.

● గుండ్లకమ్మ నదీ తీరాన అత్యంత ప్రాచీన మానవుడి ఉనికి లభించింది.

● కృష్ణా గోదావరి మధ్య మైదాన ప్రాంతాల్లో నాగరక జీవనం విలసిల్లింది.

● వీళ్లంతా ఆంధ్రము, తెలుగు కలగలిసిన మిశ్రమభాషనే మాట్లాడారు.

● తెలుగుజాతి ప్రాచీనం, తెలుగు భాష ప్రాచీనం, తెలుగు నాగరకత ప్రాచీనం అనడానికి తగినన్ని సాక్ష్యాలు దొరుకుతున్నాయి. వీటిని శాస్త్రీయమైన రీతిలో కూర్చవలసిన బాధ్యతని భాషా చారిత్రక శాస్త్రవేత్తలు స్వీకరించవలసివుంది.

● తెలుగువారి ప్రాచీనతకు సంబంధించి ఏ చిన్న విశేషాన్ని ఎవరు వెలుగులోకి తెచ్చినా ఆదరించి, పరిశీలించి వాస్తవాన్ని జనసామాన్యానికి తెలియపరిచే ధోరణి ఇప్పుడు కావాలి.



## ఆధార గ్రంథాలు

Aiyar, Vaidynatha, R, S.1929. Sumero – Dravidian and Hittite – Aryan Origins. Mythic Society Quarterly Journal, April.

Ayer, Krishna L.A..1967. Kerala Megaliths and their Builders. Madras: University of Madras.

Brahmananda, H.S *Telugu Sabda Parinamam* (the Evolution of the word Telugu). Anantapuram : Akshara Prasara Prachuranalu.

Caldwell, Robert. 1856 [1976]. A Comparative Grammar of the Dravidian or South Indian Family of Languages. Madras: Madras University.

Chaterji, S.K. 1963 [1965]. Dravidian. Annamalai Nagar: Annamalai University.

Cincinnati, O. 1849. Address on the Anglo –Saxon language: its origin, character and density. Alexander Campbell Popular Lectures and Addresses (1886).

Davids, Rhys T. Buddhist India. New Delhi: Motilal Banarsidass Publishers .

Kak, Subhash. 1994. The Evolution of early writing in India. In Indian Journal of History of Science, Vol. 28, pp. 375-388.

Krihsnamacharyulu, N.Ch. *Vengi Desapu Prachina Charitramu*(Telugu)

Krishnamurti, Bh. 1999. *Bhasha-Samajam-samskruti* (Telugu). Hyderabad: Nilkamal Publishers.

Krishnamurti , Bh. 1975 *Telugu Bhasha Vikasa* (Telugu). Hyderabad: International Institute of Telugu.

Krishnamurti, Bh. 2003. The Dravidian languages. Cambridge: Cambridge: University Press.

Kuiper, F.B.J. 1967. The Genesis of a linguistic area. In Indo Iranian Journal 10:81-102.

M'crindle, J.W. 1876. Indica of Arrian, In The Indian Antiquary, March. Madras:

Minakshi, C.1936. Administration and Social Life under the Pallavas: In Madras University Historical Series No 13.

Panikkar, K.M.1956. A Survey of Indian History. Bombay: Asia Publishing House.

Pillay, K.K.1975. A Social History of the Tamils. Madras: University of Madras.

Raghavan, M D . India in Ceylonese History, Society and Culture 2nd revised edition. Indian Council for Cultural Relations, New Delhi: Asia Publishing House.

Rajamahendravaram . 1931. Kalinga Sanchika (Telugu). Andhrethihasa Parisodhaka Mandali.

Rama Rao, Chekuri. _Bhashantarangam (Telugu). Hyderabad: Potti Sri Ramulu Telugu Viswa Vidyalayam.

Rao, Hanumantha, B.S.L.2003. Andhrula Charitra(Telugu). Hyderabad: Visalandhra Publishing House.

Rao, Krishna B.V.1942. A History of early Dynasties of Andhra Desa.

Richards, F.S.1917. Some Dravidian affinities and their sequel. In Mythic Society quarterly Journal.

Sastri, Nilakantha, K.A.1966. A History of South India. New Delhi: Oxford University Press.

Subrahmanyam, P.S. 1984. Adhunika Bhasha Sastra Siddhantalu (Telugu). Hyderabad: Andhra Pradesh Sahithya Akademi.

Subrahmanyam, P.S. *Paniniyam-Sastra Lakshnalu* (Telugu). Hyderabad: Potti Sri Ramulu Telugu Viswa Vidyalayam.

Subrahmanyan, K, R. 1989. Buddhist remains in Andhra and the History of Andhra between 225 & 610 A.D. New Delhi: Asian Educational Service.

Tyagaraju, A.S. 1932. Sumero Dravidian Affinities. In Mythic Society Quarterly Journal VolXXIII, October.

Waddell, L.A. 1929. The Makers of Civilization in Race and History. New Delhi:

**Electronic Resources**

Ancient Babylonia
http://www.earth-history.com/Babylon/index.htm

Alexander, Militarev (compiled) Semitic etymology
http://www.stickhi.ru/cgi-bin/main

Bhubaneshwar, Samar Abbas Exracts from T.R.Sesha Iyengar's "Dravidian India"
http://saxakali.com/southasia/dravidian_india.htm

Burrow T and Emeneau, M.B. A Dravidian etymological dictionary 2nd edition
http://dsal.uchicago.edu/dictionaries/burrow/

Bronnikov, G. Dravidian Etymology Database.
http://ehl.santafe.edu/cgi-bin/response.cgi

Blench, Roger. Nilo-Saharan languages
http://www.arikah.net/encyclopedia/Nilo-Saharan_languages

Boeree, George C. The language familie s of the world
http://webspace.ship.edu/cgboer/languagefamilies.html

Crispin, Bates. 1995. Race, Caste and Tribe in Central India: The Early Origins of Indian Anthropometry. In Edinburgh Papers in South Asian Studies Number 3 (1995)
http://www.csas.ed.ac.uk/fichiers/BATES_RaceCaste&Tribe

Cologne Sanskrit lexicon
http://webapps.uni-koeln.de/tamil/

Callahan, Kevin L. Current Trends in Archaeological Theory.
http://www.geocities.com/athens/acropolis/5579/chapter1.html

Dravidian Language Family
http://www.nvtc.gov/lotw/months/april/DravidianLanguageFamily.htm

Dorain, Fuller, Q. 2001. Harappan seeds and agriculture: some considerations.In Antiquity, June, 2001.
http://findarticles.com/p/articles/mi_hb3284/is_200106/ai_n7993408

Egyptian merchants in the Old Kingdom
http://nefertiti.iwebland.com

Elam .In Wikipedia, the free encyclopedia
www. wikipedia.org

Flemmingm, Southampton, N. C. Submarine prehistoric archaeology of the Indian Continental shelf: A potential resource. UK: Oceanography Centre, European UK
http://www.ias.ac.in/currsci/may102004/1225.pdf

Herlin, Susan J. Ancient African civilization to CA 1500
http://louisville.edu/a-s/history/herlin/textsup.htm

Hurrians. In Wikipedia, the free encyclopedia
www. wikipedia.org

Indo-European Origins and Geography, A Theory of Symmetric Expansion
enstnew@mail.ru

Indo-European, Uralic and Altaic populations in Eurasia, with an Excursus on Slavic ethno genesis
http://www.continuitas.com/interdisciplinary.pdf

Koenraad . Linguistic Aspects of the Indo-European Urheimat Question
http://koenraadelst.voiceofdharma.com/articles/aid/urheimat.html

Kenchoshvili, Nikoloz and Tbilisi and Georgia At the Source of Indo-Georgian Historical Ties (A Short Review)
http://www.veda.harekrsna.cz

Kuzmina, Elena. Genesis of the Indo-Iranians: Archeological and Linguistic aspects. http://www.silk-road.com/newsletter/volumeonenumberone/summary.html

Mahadevan, Iravatam.2000. Aryan or Dravidian or Neither? A Study of recent attempts to decipher the Indus Script (1995-2000). In Electronic Journal of Vedic Studies (EJVS) V01.8 (2002) issue 1, March 8.
http://www.ejvs.laurasianacademy.com

Matlock, Gene D. Who Was Abraham?
http://www.viewzone.com/abraham.html

Militarev, Alexander Olga and Stolbova (compiled) Afro-Asiatic etymology
http://www.stickhi.ru/cgi-bin/main

Online Etymology Dictionary
http://www.etymonline.com/index.php?l=e

Ross, Kelley L. Genetic Distance and Language Affinities between Autochthonous Human Populations.
http://www.friesian.com/trees.htm

Ruhlen, Merritt. (Compiled) A global linguistic database
http://www.stickhi.ru/cgi-bin/main

Ross , Kelley L. The Semitic and Other Afro-asiatic Languages
http://www.friesian.com/trees.htm

Santos, Arysio Nunes dos. The mysterious origin of the Guanches
www.atlan.org/articles/guanche_origin

Santos, Arysio Nunes dos . Etruscan a Dravidian Tongue?
arysio@horizontes.net

Starostin, Sergei (compiled) Long-range etymologies
http://www.stickhi.ru/cgi-bin/main.

Sitchin, Zecharia . When Time Began: Book V of the Earth Chronicles
http://wingeddisk.com/

Sergei, Nikolayev (Compiled) Indo-European etymology
http://www.stickhi.ru/cgi-bin/main.

Subbanna, Sreenivasarao. 2007. Cultural Relations between Ancient India and Egypt
http://www.allempires.com

Starostin, George (Compiled) Dravidian etymology
http://www.stickhi.ru/cgi-bin/main

Witze, Michael.2000. The Languages of Harappa. In Electronic Journal of Vedic Studies (EJVS).
http://www.people.fas.harvard.edu/~witzel/IndusLang.pdf

Winters, Clyde A. The Proto-Saharan Homeland of the Dravidian, African, Sumerian and Elamite People: fertile African Crescent.
http://www.geocities.com

Winters, Clyde A. Cultural Unity of the Dravidian and African Peoples
http://www.geocities.com

Winters, Clyde. Tamil culture: the pre-Diluvial civlisation of mankind
http://www.geocities.com/olmec982000/tamana.htm

Winters, Clyde A.The proto- Saharan religion.
http://www.geocities.com/olmec982000/rel2.htm

Watkins ,Calvert. Indo-European and the Indo-Europeans
Available on: the American Heritage Dictionary of the English Language

Zvelebil, V Kamil .2004. Dravidian Languages. Encyclopedia Britannica. 2004.
http://www.search.eb.com/eb/article?eu=118132.

Nailu nunchi Krishna daka

*- Dr. G.V. Purnachand*

1148



'నైలు నుంచి కృష్ణదాకా' అరుదైన పరిశోధనా వ్యాస సంకలనం ఈజిప్ట్ నుంచి తెలుగు నేల వరకూ తెలుగు భాషతో పెనవేసుకున్న భాషాబంధాల గురించిన కొన్ని అధ్యయనాంశాలను మనముందుకు తెస్తోంది. ఇందులోని పరిశీలనాంశాలు మనల్ని కొత్తగా ఆలోచింప చేయడమేకాదు, ఆశ్చర్య చకితులను చేస్తాయి. తెలుగుభాషా సంస్కృతుల మూలాలను అధ్యయనం చేసేవారికి ఈ పుస్తకం విలువైన ఆలోచనల్ని అందించే ఒక 'ఆకరం'గా ఉపయోగపడ్తుంది.

■

డా॥ జి.వి.పూర్ణచంద్ సృజనాత్మక విశ్లేషకుడు. భాషాచారిత్రకాంశాలపైన ఒక కొత్త దృష్టికోణాన్ని ఆవిష్కరించిన పరిశీలకులు. తెలుగు భాషోద్యమంలో ముఖ్య కార్యకర్త. ప్రపంచ తెలుగు రచయితల మహాసభల నిర్వహణలో ప్రధాన భూమికవహించారు. భాషాచారిత్రకాంశాలపైన 'తెలుగే ప్రాచీనం' వీరి ముఖ్యరచన. హిందీ భాషలోకి అనువదితమైంది. వైద్యవృత్తిలో కొనసాగుతూనే వివిధ సాహిత్య ప్రక్రియలపైన 63 పుస్తకాలు వెలువరించారు. నాటి మిని కవితా ఉద్యమం నుంచి నేటి తెలుగుభాషకు ప్రాచీనతా విశిష్ట హోదాను సాధించే మహాఉద్యమం దాకా జి.వి.పూర్ణచంద్ ఉద్యమజీవి. భాషా సాహిత్యాల పరిశోధన, వైద్యశాస్త్రసంశోధన, సామాజిక సేవ - ఈ మూడు త్రివేణి సంగమంగా ఈ 'జీవి'లో కలిసిపోయాయి.

prasārānga




DRAVIDIAN UNIVERSITY

Srinivasavanam, Kuppam - 517 425

